

సచిత్ర విచిత్రం

# ఆకాశంలో ఫోను




మన కార్లకు కూడా ఫోన్లు వస్తున్నాయంటేనే సంబర పడిపోతున్నాంగానీ- విదేశాల్లో విమాన ప్రయాణీకులు కూడా కిందున్నవారికి ఫోన్ చేసి మాట్లాడుకునే సౌకర్యం ఉంది. సీట్లో కూర్చునే ఇంటికి ఫోన్‌చేసి క్షేమ సమాచారాలు చెప్పుకోవచ్చు.

# చతుర ప్రపంచం

## నిద్రతీర్చే కోరికలు

నిద్ర గురించి, అందులో మనకు వచ్చే స్వప్నాల గురించి, ఆ స్వప్నావస్థలను దాటిన గాఢ సుషుప్తి గురించి ఎంతోమంది ఎన్నో పరిశోధనలు చేసి, తమకు తోచిన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఇంకా ఎన్నో పరిశోధనలు ఈ రంగంలో ఎప్పుడూ జరుగుతూ వస్తున్నాయి. నిద్ర కూడా ఒక యాంత్రిక పద్ధతిలో జరిగి నిద్రలో కూడా మనని ఉత్సాహంగా వుంచగలుగుతుంది అంటున్నారు కొంతమంది పరిశోధకులు. చక్కటి తాజాదనాన్ని, శక్తిని పోగుచేసి మనిషికిస్తుంది నిద్ర. అందుకే మనం నిద్రలేవగానే ఎంతో ఉత్సాహంగా, శక్తివంతంగా, తాజాగా వున్నట్టు అనుభూతిని పొందుతాము.

అయితే నిద్ర మాత్రమే మనిషిని తాజాగాను, శక్తివంతంగాను వుంచుతుందా అనే విషయంమీద చాలా ప్రయోగాలే జరిగాయి. ఈమధ్య జరిగిన కొన్ని ప్రయోగాలు అది పూర్తిగా నిజం కాదని తేల్చాయి. అమెరికాలో గత ఏడాదిగా నిద్రమీద ఆసక్తికరమైన ప్రయోగాలు జరుగుతూ వస్తున్నాయి. నిద్రలో విభిన్న దశలలో మనిషి ఎటువంటి అనుభూతులకు లోనవుతాడన్న విషయంపై పరిశీలన జరిపే పరికరాన్ని ఎలెక్ట్రాయిన్ సెఫెలోగ్రాఫ్ అంటారు. మనిషి నిద్రిస్తున్నప్పుడు అతడి మైండ్ కొన్ని ఎలక్ట్రికల్ తాకిడులను ఉత్పత్తిచేస్తుంది. అవి చాలా బలహీనమైన విద్యుత్తరంగాలు. వాటిని సునిశితమైన ఎలక్ట్రానిక్ యంత్ర పరికరం మాత్రమే పెద్దవిగా చేసి చూపగలదు. ఆ యంత్రానికి ఓ పెన్సిల్ తగల్చబడి వుంటుంది. ఈ పెన్సిల్ కింద ఓ గ్రాఫ్ కాగితం అమర్చబడి వుంటుంది. ఇది మనిషి గాఢనిద్రలోకెడుతున్న విషయాన్ని తన కదలికలతో సూచిస్తూ వుంటుంది. గ్రాఫ్ పేపరుపై పెన్సిలు సూచన యొక్క గాఢతను, తేలికతనాన్నిబట్టి నిద్ర యొక్క దశలను గుర్తించవచ్చు. అమెరికాలో సుమారు 10 విశ్వవిద్యాలయాలు నిద్రాప్రయోగశాలలను నెలకొల్పి నిద్రలోని దశలను, అంతర్దశలను తెలుసుకుం[illegible] ప్రయత్నాలు చేస్తున్నారు. 500 మంది [illegible]షులు, 600 మంది స్త్రీలు ఈ ప్రయోగశా[illegible] పనిచేస్తున్నారు. అయితే వీళ్ళ పని కేవ[illegible] అక్కడికి వెళ్ళి పడుకోవడమే. ఈ ప్రయోగాలు డాక్టర్ గాయర్, డాక్టర్ సెగల్‌లు నిర్వహిస్తున్నారు. నిద్రపోతున్న వ్యక్తి మెదడుకు వైరులు కనెక్ట్ చేయబడతాయి. అటుపైన ఎలక్ట్రానిక్ మెషీన్‌మొత్తం నిద్రాసమయంలో మెదడు కదలికలను, అనుభూతులను, వత్తిడులను రికార్డ్ చేస్తుంది. నిద్ర మనిషికి దశలు దశలుగా వస్తుంది. మొదటిదశలో గ్రాఫ్‌మీద చిన్నచిన్న తేలికపాటి తరంగాలు ముద్రించబడతాయి. కొంచెం నిద్ర ముదరగానే మెదడు ఎన్నో విద్యుత్ తాకిడులతో ఏక్టివ్‌గావున్నట్టు గ్రాఫ్‌లో రికార్డు అవుతుంది. ఈ టైములో కండరాలు ఉత్సాహంగా పనిచేస్తూ వుంటాయి. పల్స్‌రేట్ తక్కువగా కనిపిస్తుంది. ఆ దశలో సదరు వ్యక్తికి నిద్రిస్తున్న స్పృహే వుండదు. ఆ సమయంలో అతన్ని లేపితే 'అబ్బే! నేనెక్కడ నిద్రపోతున్నాను' అన్నా అనగలడు. అలా లేపకపోతే అతడు క్రమంగా నిద్రలోని తరవాతి దశకు చేరుకుంటాడు. నిద్రలోని రెండవదశలో మెదడు మరికొంచెం ఉత్సాహవంతంగా వుండడాన్ని సూచిస్తుంది గ్రాఫ్. ఆ దశలో పెద్దపెద్ద విద్యుత్తాకిడులు కనిపిస్తాయి గ్రాఫ్‌పై. కొన్ని

కవర్‌ఫోటో: వి. సత్యమూర్తి

వైర్లు కంటి లోపలిభాగాలకు అమరుస్తారు. అవి కూడా నిద్రలోని మెదడు తాకిడులను రికార్డ్ చేస్తాయి. దీనికి గల సాంకేతిక పదం రేమింగ్.

ఈ సమయంలో కనుక లేపితే అతడు తాను నిద్రపోతున్నానా అనే అనుమానస్థితిలో వుంటాడు. కొంతసేపటిదాకా అతడికి తాను నిద్రనుంచి లేచానన్నది జ్ఞప్తికి రాదు. ఈ దశలకి ఓ అరగంట తరవాత అతడు నిద్రలోని 3వ దశకు చేరుకుంటాడు. అప్పుడు గ్రాఫ్‌మీద ఎన్నో పెద్ద, చిన్న ఇంప్రెషన్లు పడతాయి. ఆ సమయంలో మైండ్‌లో కరెంటు ఓల్టేజి చాలా ఎక్కువగా వుంటుంది. అప్పుడు నిద్రిస్తున్న వ్యక్తి కేకలేసినా, ఏడ్చినా, నవ్వినా, మాట్లాడినా కూడా తిరిగి నిద్రనుంచి లేచాక అతడికి అవేవీ గుర్తుండవు.

నిద్రలో వున్న మనిషి ఓ పది పన్నెండు సార్లు అటునుంచి ఇటు, ఇటునుంచి అటు ఒత్తిగిల్లినా, తనకెంతో నిశ్చింతగా నిద్రపట్టిందంటాడు. గాఢనిద్రలో కండరాలన్నీ తేలికయి, ఊపిరి సమానస్థాయిని పొందుతుంది. రక్తప్రసరణ, ఉష్ణోగ్రతలు కూడా తగ్గుతాయి. 3వ దశ తరవాతి దశ... అంటే 4వ దశలో గాఢ సుషుప్త్యవస్థకెడతాడు మనిషి. ఒకటవ రెండవ నిద్రాదశలను డెల్టా స్లీప్ అని అంటారు. నిద్రించే మనిషి 1, 2 దశలలో మాత్రమే కలలు కంటాడు. 3, 4 దశలలో వుండే గాఢ నిద్ర అస్తమానూ రాదు. మనిషి బాగా అలిసిపోయినప్పుడు మాత్రమే నిద్రలోని 3, 4 దశలకు చేరుకుంటాడు. కొంతమంది కలలు కూడా రాని నిద్రే అసలైన నిద్ర అంటారు. కానీ అది నిజంకాదు. మొత్తం నిద్రలో కలలు రాని నిద్ర ఓ దశమాత్రమే.

ఈ మధ్య జరిగిన కొన్ని పరిశీలనల ద్వారా తేలిందేమంటే ప్రతి మనిషికి సరియైన ఆరోగ్యం వుండాలంటే కలలతో కూడిన నిద్ర, స్వప్న రహిత నిద్ర... ఈ రెండు దశలూ కూడా పూర్తిగా అవసరమేనని. అంటే స్వప్నాలు మనిషికి మేధోపరంగానూ, భౌతికంగాను కూడా సహాయకారులవుతాయి అంటున్నారు. అలాగే 'కలత నిద్రయింది' అని మనం తరచూ వాడే మాటకి అర్థంలేకపోలేదు. సరిగ్గా స్వప్నావస్థలో మనిషిని లేపినపుడు అతడు అప్పటికి తప్పని సరిగా లేచినా మిగిలిన రోజంతా ఏదో అసహనంగా, చికాకుగా, ఆందోళనగా కనిపిస్తాడు. ఇదే ప్రయోగాన్ని స్త్రీలలో చేసినా




అవే ఫలితాలొస్తున్నాయంటున్నారు. కాబట్టి మనిషి ఆరోగ్యానికి నిద్ర చాలా అవసరమని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.

చాలా అసంతృప్తిగా, తీరక మిగిలిపోయిన కోరికలను ఈ నిద్రావస్థ తీరుస్తుందని తెలుస్తోంది. నిద్ర మధ్యలో లేపితే సదరు వ్యక్తిలో ఆత్మన్యూనతాభావం పెరిగే అవకాశం కూడా వుందంటున్నారు పరిశీలకులు.

## పహిల్వాన్ క్రమ శిక్షణ

'మల్లయుద్ధం' పుట్టిపెరిగింది ఇండియాలోనే అయినా దాని కీర్తి ప్రతిష్టలు, అభివృద్ధి మాత్రం ప్రపంచవ్యాప్తంగా విస్తరించాయి ఈనాడు. ఇండియాలో ఎన్నో మల్లయుద్ధ కేంద్రాలున్నాయి. కానీ ఢిల్లీలోని పహిల్వాన్ పద్మశ్రీ హనుమాన్ అనే మల్లయుద్ధ వీరుడి చేత నడపబడే కుస్తీకేంద్రం అన్నిటికన్నా పురాతనమైనది. 1928లో స్థాపించబడిన ఈ




కేంద్రాన్ని 'అఖడా' అంటారు. ఇది అటు లాభాలు, ఇటు నష్టాలూ లేకుండా ఇప్పటికీ ప్రఖ్యాత కేంద్రంగా కొనసాగుతోంది.

రాజస్థాన్‌లోని చిత్వాడాలో పుట్టిన హనుమాన్ 3 నెలల వయసులోనే అనాధ అయ్యాడు. అటు తరవాత పన్నాలాల్ కౌశిక్ అనేవ్యక్తి హనుమాన్‌ని పెంచి పెద్ద చేశాడు.

హనుమాన్ చిన్నతనంనుంచీ చాలా సన్నగా గడకర్రలా వుండేవాడు. అతని స్నేహితులు అతనిపై ఎన్నో జోక్సు వేసేవారు.

ఇది సహించలేక అతడు రోజూ తన అందమైన శరీర నిర్మాణం కోసం దగ్గిరలో వున్న కుస్తీ కేంద్రానికి పరుగెత్తి అక్కడి కుస్తీపట్లని, ఆ ఆటగాళ్ళని చూస్తూ నిలబడేవాడు. ఓరోజున ఓ కుస్తీవీరుడు హనుమాన్‌ని కూడా కుస్తీ నేర్చుకుంటావా అని అడిగాడు. అప్పటి నుంచీ అతడిలో మరింత ఉత్సాహం రేకెత్తి కుస్తీ నేర్చుకోసాగాడు. చిన్న చిన్న పందాలు కట్టి ప్రదర్శనలు ఇచ్చేవాడు. ఓసారి హరిద్వార్‌లో జరిగిన ఓ కుస్తీపోటీలో నెగ్గిన హనుమాన్‌కి ఒక రూపాయి బహుమతిగా దొరికింది. అప్పట్లో కుస్తీకి అంతగా జనాదరణ లేకపోవడంతో కేవలం మల్లయుద్ధంమీదే తన బతుకు నడపడం కష్టమనుకున్నాడు హనుమాన్. దాంతో రోడ్డుపక్కన ఓ చిన్న టిఫిన్ సెంటర్ ప్రారంభించాడు.

దానితోపాటే కుస్తీ కూడా బాగా ప్రాక్టీసు చేస్తూ, ఓసారి లాహెూర్‌లో జరిగిన మల్లయుద్ధ పోటీలలో పాల్గొన్నాడు హనుమాన్. ఈ పోటీల్లో నెగ్గి పేరుప్రఖ్యాతులు తెచ్చుకోవాలంటే నిత్యం కుస్తీని ప్రాక్టీసు చెయ్యాలని నిశ్చయించుకున్నాడు హనుమాన్. దాని కోసం ఓ కుస్తీ ట్రెయినింగ్ సెంటరును తనే స్వయంగా ప్రారంభించాడు హనుమాన్. అతడి పెంపుడు తండ్రి పన్నాలాల్‌కి ఇతడు కుస్తీ కేంద్రాన్ని నడపడం ఎంతమాత్రం ఇష్టంలేదు.

పైగా ఈ కేంద్రాన్ని ఒక శ్మశానంలో పెట్టడంతో మొదట్లో ఎవరూ ఈ కేంద్రానికి రావడానికి సాహసించేవారు కాదు. కానీ 1940 నాటికి ప్రజల్లో అతనిపట్ల, అతని కేంద్రంపట్ల విశ్వాసం పెరిగింది. అది ఓ ఫుల్‌టైమ్ ట్రెయినింగ్ సెంటర్‌లా మారి విద్యార్థులు అక్కడే తినిపడుకునేవారు. అక్కడ వున్నవాళ్లు విద్యార్థులకు టి.విగానీ, సినిమాగానీ ఏవీ చూడటానికి అనుమతించేవారు కాదు. ఆహారం కూడా చాలా రుచికరంగా, ఆరోగ్యవంతంగా వుండేది.

కుస్తీకే తన జీవితాన్ని అంకితం చేసిన హనుమాన్‌కి పన్నాలాల్ ఎంతో మంచి

సంబంధాలు తెచ్చి కూడా పెళ్లి చేయలేకపోయాడు. ఎంతోమంది అనాధ పిల్లలను తన కుస్తీ కేంద్రంలో చేర్చుకుని కన్నబిడ్డల్లా చూసుకుంటూ వారికి మల్లయుద్ధం నేర్పేవాడు హనుమాన్.

కుస్తీకేంద్రం స్థాపించినప్పటినుంచీ పారిశ్రామికవేత్త బిర్లా చందాలు పంపుతూ వచ్చాడు. ఇప్పటికీ బిర్లానుంచి చందాలనందుకుంటూనే వుంది ఆ కేంద్రం.

ఈ కేంద్రంనుంచి సుధీష్‌కుమార్, వేదప్రకాష్, సప్తాల్, రాజేంద్రసింగ్‌లాంటి ఎంతోమంది మల్లయుద్ధవీరులు శిక్షణ పొందివచ్చారు. ఈ కేంద్రానికి చెందిన వీరులు ఆసియా, ఒలింపిక్ మొదలైన కుస్తీపోటీల్లో ఇండియా తరపున ఎన్నో బంగారు, రజిత, కాంస్య పతకాలను పొందారు. హనుమాన్ చెప్పేదేమంటే ప్రతి భారతీయుడు తనదైన పద్ధతిలో ఓ పహిల్వాన్‌లా తయారవ్వాలని, అతడు చక్కటి క్రమశిక్షణ పాటించాలని అనేవాడు. అయితే విచారకరమైన విషయమేమంటే మల్లయుద్ధానికి ప్రభుత్వంనుంచి తగిన ప్రోత్సాహం లేదు. దేశం మొత్తంమీద మల్లయుద్ధకేంద్రాలను తగినన్ని స్థాపిస్తే అప్పుడు భారతదేశ మల్లయుద్ధ విద్యను ఉన్నత శిఖరాలకు చేర్చవచ్చని సదరు కళాకారులు అభిప్రాయపడుతున్నారు.

ప్రస్తుతం హనుమాన్ వయసు 85 సంవత్సరాలు. అయినా 40 ఏళ్ల నడివయస్కుడిలా కనిపిస్తాడతడు. తన నేతృత్వంలో చక్కటి వీరులను దేశానికందించి, మల్లయుద్ధంలో ఇండియాను కీర్తిశిఖరాగ్రాన నిలపాలన్నదే తన జీవితాశయం అంటాడు హనుమాన్.

## మాయమవుతున్న డైనమైట్లు

ఉత్తరప్రదేశ్‌లోని ఓ ప్రాంతంలో డైనమైట్ల దొంగతనం ఎక్కువగా జరుగుతున్నట్లు తెలుస్తోంది. మీర్జాపూర్‌కి దగ్గరున్న సింగ్రౌలీ బొగ్గుగనులకు ప్రసిద్ధి. ఇక్కడ మోర్వా, దుధిచౌ, జయంత్, వీనా, క్రాకి, జింగుర్దా ప్రాంతాల్లో ఈ బొగ్గుగనులున్నాయి. సింగ్రౌలికి, దుధిచౌకి మధ్య గల ప్రభుత్వ గోదాముల్లో డైనమైట్లు ఎక్కువ సంఖ్యలో భద్రపరచబడతాయి. వీటిని దొంగిలించి పంజాబ్ టెర్రరిస్ట్‌లకు పంపుతున్నారన్న వార్త బయటకు వచ్చింది.

ప్రస్తుతం సింగ్రౌలీ లంచగొండితనానికి, దొంగతనానికి ప్రసిద్ధి చెందిన ప్రాంతంగా తయారయిందని అంటున్నారు. కోట్లాది రూపాయల విలువగల యంత్రసామగ్రి వృధాగా పడివుందక్కడ. ప్రతిరోజూ టన్నులకొద్దీ బొగ్గు దొంగిలించబడి అక్రమ రవాణా చేయబడుతోందని వినికిడి. ఎప్పుడైనా దుధిచౌలోని బొగ్గుగనుల్లోకి హఠాత్తుగా వెడితే అక్కడ ఒకళ్లో ఇద్దరో పనివాళ్లు మాత్రం కంటపడతారు. వాకబు చేస్తే అందరూ సైట్లోకి పనికి వెళ్లారంటారు. మిటమిటలాడే ఎండలో నాలుగు కిలోమీటర్లు వెళ్లి చూసినా వర్క్‌సైట్‌లో ఒక్క వర్కరూ కనిపించడు.




విచారిస్తే వాటర్‌టాంకర్ వాటర్ తీసుకురాని కారణంగా పనివాళ్లందరూ ఇళ్లకు వెళ్లిపోయారని చెబుతారు అక్కడున్నవాళ్లు.

గనులలో పేల్చడానికి డైనమైట్లను వ్యాన్‌లలో తెస్తారు. ఆ వ్యాన్‌లకి రక్షణగా ఎవరూ వుండరు. సరికదా, ఎవరైనా రెండు బాంబులను తీసి జేబులో పెట్టుకున్నా అడిగేవాళ్లు లేరక్కడ. నేలమీద కూడా ఎక్కడ పడితే అక్కడ ఎక్స్‌ప్లోజివ్స్ పడివుంటాయి.

అలాంటి నిర్లక్ష్యవైఖరి కారణంగా ఎన్నో డైనమైట్లు నిర్భయంగా దొంగిలించబడుతున్నాయి. దీని వెనుక ఓ పెద్ద ర్యాకెట్ వుందని కూడా వార్త వచ్చింది. రిజిస్టర్‌లో డైనమైట్ల సంఖ్యను తక్కువగా చూపించి మిగిలినవాటిని ఏజెంట్లకు ఎక్కువ మొత్తం తీసుకుని అమ్ముతారు. ఆ ఏజెంట్లు వీటిని పంజాబు టెర్రరిస్ట్‌లకు చేరవేస్తున్నారని అంచనా. ఈ విషయాలన్నీ పై అధికారులకు తెలిసినా ధనంతో వారి నోరు మూతబడుతోందని కొందరి వాదన. విస్ఫోటకాలను బొగ్గు లారీలలో బొగ్గుకు అడుగున కనపడకుండా సర్ది పంజాబు టెర్రరిస్టులకు చేరవేస్తున్నారని అంచనా.

'సెంట్రల్ కోల్డ్‌ఫీల్డ్ యొక్క విజిలెన్స్ సెల్‌వారు, మినిస్ట్రీ ఆఫ్ ఎనర్జీవారు ఈ అక్రమ ఎగుమతులపై పరిశోధనలు జరిపి విడుదల చేసిన నివేదిక ద్వారా పెద్ద ఎత్తున అణువిస్ఫోటకాల దొంగతనం జరుగుతోందని అందులో జెలిటన్ స్టిక్స్ సంఖ్య అధికంగా వుందనీ తెలుస్తోంది. ప్రభుత్వం కూడా ఈ విషయాలన్నీ తెలిసీ మౌనం వహిస్తోందంటున్నారు మరికొంతమంది. అణువిస్ఫోటకాలను భద్రపరిచే గోదాములను పెద్ద పెద్ద స్థలాలలో విశాలంగా నిర్మించినా, దాని రక్షణ విషయంలో మాత్రం తగుజాగ్రత్త తీసుకోలేదని తెలుస్తోంది. మొత్తం గోడౌన్‌కి ఒక్కరో ఇద్దరో గార్డులు కాపలా వుంటారు. ఎవరు పడితే వారు ఎటువంటి అడ్డంకి లేకుండా గోదాముల్లోని 'ప్రవేశ నిషేధ' ప్రాంతంలోకి వచ్చేస్తూ వుంటారు. ఒక్క విస్ఫోటకాలేకాక టన్నులకొద్దీ బొగ్గు కూడా దొంగిలించబడుతూ వుంటుంది. నిజానికి ఈ గనులలోని బొగ్గు పబ్లిక్ సేల్‌కి కాదు. దాన్ని తిన్నగా 'నేషనల్ థర్మల్ పవర్ కార్పొరేషన్'కి పంపుతారు.

ఆ ప్రాంతాల్లో 5 థర్మల్ పవర్ స్టేషన్లున్నాయి. అయినా బొగ్గు అన్ని పవర్ స్టేషన్లకీ సక్రమంగా జేరదు. ఆఫీసర్లు, వర్కర్లు, ఏజెంట్లు... ఇంతమంది కలిస్తేగానీ టన్నులకొద్దీ బొగ్గు సింగ్రౌలీ అడవుల్లోంచి అక్రమంగా ఎగుమతి కావడం కష్టమని చాలామంది నొక్కి వక్కాణిస్తున్నారు. చివరగా ఈ అక్రమ రవాణా బొగ్గు మధ్యప్రదేశ్‌లోని నల్లబజారుకి చేరుకుంటుంది.

ప్రపంచంలోకెల్లా శక్తివంతమైన బొగ్గు యంత్రాలు అక్కడ వున్నా, వాటిని శ్రద్ధగా ఉపయోగించడం లేదన్న వాదన వినవస్తోంది. ప్రపంచంలో ప్రసిద్ధి పొందినదనిపించుకున్న డెక్-లైన్ బొగ్గుయంత్రం సింగ్రౌలీ కోల్డ్‌ఫీల్డ్‌లో తుప్పుపట్టి పడి వుందంటున్నారు పరిశీలకులు. దీని ఖరీదు 8 కోట్లు. ఇది టన్నులకొద్దీ బొగ్గుని ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి సరఫరా చేయగలదు. కానీ దీని శక్తిలో 25 శాతం మాత్రమే ఉపయోగించుకుంటున్నారు గనులలో.

జయంత్ బొగ్గుగనుల్లో ఆసియాలోకెల్లా పెద్దదయిన ఆటోమేటిక్ లోడింగ్ ప్లాంట్ వుంది. ఈ పెద్ద క్రేన్‌యంత్రం టన్నులకొద్దీ బొగ్గుని త్రవ్వగలగడమే కాక ట్రెయిన్ వేగన్లలో డైరెక్టుగా బొగ్గును నింపుతుంది.

అంత చక్కని యంత్రాన్ని కేవలం ఉపయోగించడంలో అశ్రద్ధవల్ల పనిలో ఆలస్యం, కష్టం కనిపిస్తూ వుంటుంది. దీన్నిబట్టి చూస్తే మనకున్న ప్రకృతివనరుల్ని, మేధోసంపత్తిని, శాస్త్రీయ పరిజ్ఞానాన్ని తెలివిగా, నిస్వార్థంగా ఉపయోగించుకుంటే దేశం మరింత వేగంగా అభివృద్ధి పథంలోకి పరుగెడుతుందన్నది నిజం.

# ఐశ్వర్య సిల్క్ షోరూంకు



విచ్చేయండి.

కాంచీపురం పట్టు చేనేత

సహకార సంఘాల వారి చీరలపై

**10% రూ.**
**ప్రత్యేక రాయితి**

(ఆషాడ, శ్రావణ మాసాల
ప్రత్యేక ఆకర్షణ)

మా ప్రత్యేకత

ఐశ్వర్య, గౌరి, కాపర్ జరీ, కాటన్,
మైసూర్ సిల్క్స్, మిస్టిక్ సిల్క్స్
అన్ని విధములైన కళాత్మకమైన
చీరలు లభించును.

**అన్ని రకాల చీరలపై 10% రాయితి**

## ఐశ్వర్య సిల్క్స్ లిమిటెడ్.,

3–6 యన్.టి.ఆర్. ఎస్టేట్,
రామకృష్ణ థియేటర్ కాంప్లెక్స్,
ఆబిడ్స్, హైదరాబాద్-1. ఫోన్: 506513

**Note: Exclusive Parking Space available**


స్వాతంత్ర్య సమరయోధునిగా, దేశంకోసం సర్వస్వాన్ని ధారపోసిన త్యాగధనునిగా, నేటి మంత్రిగా సుపరిచితుడయిన ప్రముఖుని ఆగమనం కోసం... ప్రజలంతా ఎదురుచూస్తున్నారు. స్వాగత బ్యానర్లు గాలికి రెపరెపలాడుతుంటే... లౌడు స్పీకర్లు మంత్రిగారి ఆగమనాన్ని గురించి హెచ్చరిస్తుంటే పిల్లల కేరింతలతో, పెద్దల ఎదురు చూపులతో... ఆ ప్రాంతమంతా కోలాహలంలో వుండగా విచ్చేశారు మంత్రిగారు. అధ్యక్షుల ఉపన్యాసానంతరం మంత్రిగారు మైకు చేపట్టి అనర్గళంగా ఉపన్యసిస్తుండగా హటాత్తుగా లేచి అడ్డుకుంది ఒక మహిళ.
"చెప్పింది చాలుగానీ, నోర్మూసుకో" అరిచిందామె. అంతే...! జనంలో కలకలం, పోలీసులు లాఠీలకు పనిచెప్పారు. జనం చెల్లాచెదురయ్యారు. అయినా తొణకని బెణకని ఆ మహిళ అందరికీ విప్పి చెప్పిన ఆ ఊరికథ ఏమిటి?
జనం మరిచినా, రాజకీయవేత్తలు మరిచినట్లు నటించినా, చరిత్ర మరువని రక్తపిపాసుల యదార్థ గాధ... కందిమళ్ల ప్రతాపరెడ్డి రచన "బందూక్" ఈ నెల చతుర సమగ్ర నవల.
బందూక్
-కందిమళ్ల ప్రతాపరెడ్డి

"అంతా ఎక్కడోళ్లక్కడ కూసోండి. కొద్దిసేపట్లో మంత్రిగారొస్తున్నరు.

మన నాయకులు, ఎం.ఎల్.ఎ. రంగారావుగారు ఇంకా శానామంది నాయకులొస్తున్నరు. కూసోండి... అంతా కూసోండి"

రికార్డులమోత- పోలీసుల హడావుడి- కార్యకర్తల సందడి-

ఇంతలో పోలీసు వ్యాన్ వచ్చింది. ఆ చప్పుడు విని జనం లేచారు.

"కూసోండి... కూసోండి. మంత్రిగారు రాలేదు. దార్లో వున్నరు. కూసోండి" మైకులో ప్రకటన.

కార్లశబ్దం, పోలీసుల విజిల్సు, కార్యకర్తల నినాదాలు ఎక్కువైనాయి.

"మంత్రిగారొచ్చింద్రు. నాయకులంత వచ్చింద్రు. లేవొద్దు. కూసోండి" ఊపిరి సలపకుండా మైకులో ఒకవ్యక్తి ప్రకటిస్తున్నాడు.

అది తెలంగాణాలో ఓ మారుమూల గ్రామం- సింగారం.

ఊరంతా తోరణాలతో అలంకరించి వుంది. స్వాగత బ్యానర్లు వేలాడుతున్నాయి. జెండాలు ఎగురుతున్నాయి. లారీలు, బస్సులు, ట్రాక్టర్లు, జీపులు జనాన్ని మోసుకొస్తున్నాయి. జనం గుంపులు గుంపులుగా దిగుతున్నారు. కార్యకర్తలు జైకొట్టిస్తున్నారు. అంతా సందడిగా వుంది.

ఊరిబయట మైదానంలో పెద్ద స్టేజికట్టి, లౌడ్‌స్పీకర్లు బిగించారు. సినిమాపాటల రికార్డులు చెవులు అదిరేటట్లు మోగుతున్నాయి.

మంత్రిగారితోపాటు, నాయకులంతా వచ్చి స్టేజి ఎక్కి కూర్చున్నారు.

ఒక నాయకుడు మైకుముందుకొచ్చి ప్రారంభించాడు.

"సోదరీ- సోదరులారా!

ఈరోజు మనకెంతో మంచిరోజు. శానాకాలానికి మంత్రి పూజ్యులు పాపిరెడ్డిగారు మన వూరొచ్చింద్రు. మన అదృష్టం. స్వతంత్ర సమరయోధుడు, మన ప్రియతమ నాయకుడు, మంత్రి పాపిరెడ్డిగారికి మనందరి తరపున స్వాగతం చెప్పుతున్న. అంతే కాదు... ఇయ్యాల్టిదినం మీ అందరికీ తెల్వు. తెలంగాణాదినం. అంటే శానామందికి తెల్వదు. నైజాం రాజ్యంపోయి ప్రజారాజ్యమొచ్చినదినం. అయితే అది వట్టిగనే రాలేదు. పోరాటం జేస్తే వచ్చింది. ఆ పోరాటంలో శ్రీ పాపిరెడ్డిగారు ముందున్నడు. మీకు దెల్వదు. స్వతంత్రమెట్లొచ్చింది? ఎవరు దెచ్చింది? ఎన్ని త్యాగాలు జేసింది? నైజాంకు వ్యతిరేకంగా పోరాడిన స్వతంత్ర సమరయోధుడు శ్రీ పాపిరెడ్డిగారు. స్వతంత్ర మొచ్చినంక దేశంకోసం, ప్రజలకోసం జీవితం ఖర్చుబెట్టిండు. ఎన్నో పదవులు జేసిండు. ఎం.ఎల్.ఎ. అయ్యిండు. ఎం.పీ. అయ్యిండు. 15 ఏండ్ల నుండి మంత్రిపదవి జేస్తుండు. ఒక్కటే లెక్క- నేను జెప్తున్న- ఈ రాష్ట్రంలో యిసోంటోళ్లు ఇంకెవరైనా వున్నారా? అని అడ్గుతున్న. ఏపార్టీ గెల్చినా, ఎవరు ముఖ్యమంత్రయినా శ్రీ పాపిరెడ్డిగారు మంత్రిగనే వున్నరు. ఎందుకని? అడ్గుతున్న. ఆయన గొప్పతనం. చేసిన సేవ. అందుకే... ఇయ్యాల వారు మనకు శానా విషయాలు జెప్పుతరు. స్వతంత్ర సమరయోధులకు సన్మానం జేస్తరు. శంకుస్థాపనలు జేస్తరు. మన ఎం.ఎల్.ఎ. రంగారావుగారు, ఇంకా శానామంది నాయకులు కూడా మాట్లాడతరు. నేనెక్కువ జెప్పితే బాగుండదు. ఎందుకంటే టైంలేదు కన్క. ముగిస్తున్న. ఈ సభకు మన ఎం.ఎల్.ఎ. శ్రీ రంగారావుగార్ని అధ్యక్షత వహించమని కోరుతూ ముగిస్తున్న"

అని రంగారావు మెడలో దండవేసి కూర్చున్నాడు.

రంగారావు మైకుముందు నిలబడి, జనాన్ని చూశాడు. సంతృప్తి పొందాడు.

"ముందుగా- మన మంత్రిగార్కి దండల ప్రోగ్రామంటది. ఒక్కొక్కరు వర్సగా వచ్చి

మంత్రిగారికి దండలెయ్యాలని కోరుతున్న" అన్నాడు.

దండలు పట్టుకున్న జనం తోసుకొస్తున్నారు. పోలీసులు, కార్యకర్తలు వాళ్ళను సర్దుతూ వరుసలో పంపుతున్నారు. బంతి పూలదండో, చామంతి పూలదండో, గన్నేరు పూలదండో పట్టుకున్న స్త్రీలు, పురుషులు, హరిజన-గిరిజన, పేదప్రజలు వేదికమీదికి వస్తున్నారు. దండతోపాటు వాళ్ల చేతుల్లో తమ గోడు వినిపించుకునే దరఖాస్తులున్నాయి. మంత్రిగారి మెడలో దండలు వేస్తున్నారు. దండం పెడుతున్నారు. దరఖాస్తులిస్తున్నారు. దండలు, దరఖాస్తులు పక్కనున్న పి.ఎ. అందుకుంటున్నాడు. దండలు వేసినవాళ్లను పోలీసులు సాగనంపుతున్నారు.

దండల కార్యక్రమం ముగిసింది.

రంగారావు ముందుగా మంత్రిగారి మెడలో పెద్దదండవేసి దండంపెట్టి ఉపన్యాసం ప్రారంభించాడు.

"గౌరవనీయులు, పూజ్యులు, స్వాతంత్ర సమరయోధులు, అమాత్యులు శ్రీ పాపిరెడ్డిగారు, వేదికమీదున్న పెద్దలారా! సోదరులారా! సోదరీమణులారా... నమస్కారాలు.

నిజంగా ఈ దినం మనకు పండగదినం. తెలంగాణా ప్రజలకు విముక్తి కలిగినదినం. నైజాం నిరంకుశపాలనబోయి, ప్రజాస్వామ్యం వచ్చినదినం. తెలంగాణా పోరాటంలో పాల్గొని, ఎన్నో త్యాగాలు చేసిన శ్రీ పాపిరెడ్డిగారు ఇంకా మనముందున్నరు. మన అదృష్టం. వారికి మీ తరుపున, నా తరపున దన్యవాదాలు జెప్పుతున్న. వారు ఆయురారోగ్యాలతో నూరేండ్లు బతకాలని ఆ దేవుడిని ప్రార్థిస్తున్న"

కార్యకర్తలు బిగ్గరగా చప్పట్లు కొడుతున్నారు. జనంచేత కొట్టిస్తున్నారు.

"వారు... శ్రీ పాపిరెడ్డి మనకు చాలా విషయాలు జెప్పుతరు. ఐదరాబాదు రాజ్యం- అంటే నైజాం సర్కారెట్లుండేది? ప్రజల కష్టాలెట్లుండేయి? పోరాటమెట్ల జర్గింది? రజాకార్లెట్లు బోయింద్రు? ప్రజా రాజ్యమెట్లొచ్చింది? వివరంగ జెప్పుతరు. వారు అందులో పాల్గొన్నరు. ఆ పోరాటం నడిపింద్రు. త్యాగాలు చేసింద్రు. ఆ పోరాటంలో పన్జేసిన చాలామంది నాయకులిక్కడున్నరు. వారికి మంత్రిగారు సన్మానం జేస్తరు. అంతేకాదు ఇయ్యాల మనవూరికి మంచినీళ్ల ట్యాంకులేదు. గుడిలేదు. వాటికి శంఖుస్థాపన జేస్తరు. పేదోళ్లకు భూమి పట్టాలు పంచుతరు. వారికెన్నో పనులున్నా ఇయ్యాల ఇక్కడికి వచ్చింద్రంటే వొట్టిగనే రాలేదు. నా మాట కాదనలేక వచ్చింద్రు. నా గురించి మీకు తెల్సు. నా గురువు శ్రీపాపిరెడ్డిగారు. వారు చేయబట్టే నేను రాజకీయాల్లోకొచ్చిన. ప్రజాసేవజేస్తున్న. మీకు దెల్సు. నేనేం జేసిన్నో. రోడ్డేయించిన-బస్సు దెప్పించిన, బడి గట్టించిన, బోరింగేయించిన, కరెంట్ దెప్పించిన, అప్పులిప్పించిన, భూములు పంపకంజేపించిన ఇంకా బోలెడు పనులు జేసిన. ఇంకా చేయడానికి చాలా వున్నయ్. మీరందరు నా ఎంట వుంటే, మంత్రిగారు దయదలిస్తే అయన్నీ జేస్త. పేదలకోసం, నా ప్రజలకోసం ఏమైనా జేస్త. ఇంకా నేనేం మాట్లాడాలి. మాట్లాడితే మర్యాదగుండదు. ఇప్పుడు మంత్రిగారు ముందుగా ఈ ప్రాంతం తెలంగాణా స్వతంత్ర సమరయోధులకు సన్మానం జేస్తరు"

రంగారావు సన్మానితుల పేర్లు చదువుతున్నాడు. మంత్రి ఒక్కొక్కరి మెడలో దండవేసి, శాలువాకప్పుతున్నాడు. సన్మానితులను చూసి జనం ఆశ్చర్యపోతున్నారు. గుసగుసలాడుతున్నారు. కార్యకర్తలు చప్పట్లు కొట్టిస్తున్నారు.

సన్మాన కార్యక్రమం ముగిసింది. మంత్రి మైకుముందు నిలిచాడు. జనాన్ని తేరిపార చూశాడు. ఖద్దరు లాల్చీ, పెద్దంచుపంచె,

భుజంమీద మడత చెరగని కండువా, నెత్తిన గాంధీటోపీ, కళ్లకు జోడు ముసలితన మొచ్చినా నిగనిగలాడుతున్న శరీరం.

పాపిరెడ్డి గొంతు సవరించుకున్నాడు. చిరునవ్వు తెచ్చుకున్నాడు. గాంభీర్యంగా గొంతు విప్పాడు.

కార్యకర్తలు జైకొడుతున్నారు. చప్పట్లు కొడుతున్నారు. బిగ్గరగా కొట్టమని జనానికి సైగలు జేస్తున్నారు.

"నిజంగ ఇది నా అదృష్టం. ఇంతమంది జనం వచ్చిండ్రు. స్వాగతం చెప్పిండ్రు? ఎందుకు చెప్పిండ్రు? ఎందుకొచ్చిండ్రు



ఇంత మందిక్కడికి? వూర్కెనే రాలేదు. నాకోసమొచ్చింద్రు! నా త్యాగాన్ని చూసివచ్చింద్రు. తెలంగాణాకు విముక్తి ఎట్ల వచ్చిందో తెలుసుకోవాలని వచ్చింద్రు. అందుకని మీ అందరికీ నా దన్యవాదాలు చెప్పుతున్న"

చప్పట్లు మార్మోగాయి.

"నైజాం రాజ్యముండంగ గిట్లమీటింగు బెట్టుకోనిచ్చింద్రా? లేదు. మాట్లాడనిచ్చింద్రా లేదు. వూర్లల్ల బడులున్నయా... లేవు. బస్సులొచ్చినయా... లేదు. ఓట్లున్నయా!



లేవు. మరింకేముండేది? మీలో చాలామం దికి తెల్వదు. ఎట్టి చాకిరుండేది. దొరల దౌర్జన్యముండేది. అంటరానితనముండేది. నైజాం సర్కారు నిరంకుశత్వముండేది. గయన్నీ దల్సుకుంటే బయమేస్తది. గయన్నీ మీరు చూడలేదు. మీకెర్కలేదు. దేశంలో ఇంగ్లీషోల్లు దోపిడి చేస్తుంటే స్వతంత్రం గావాలని గాంధీగారు పోరాటం షురూ జేసిండు. గది మాకు దెల్సింది. మాలాంటో ళ్లమంతా పార్టిబెట్టినం. పోరాటంలో జేరినం. నైజాం సర్కారును గద్దెదించాలని, ప్రజారాజ్యం గావాలని పోరాడినం. అయితే నైజాం సర్కారు వూర్కుంటదా! సైన్యాలు బంపింద్రు. తర్వాత రజాకార్లొచ్చింద్రు. ఇంకేముంది? వూర్లమీద బడ్డరు. దోపిడీలు జేసింద్రు. ఆడోళ్లను ఆగంజేసింద్రు. మగో ళ్లను హింసలు బెట్టింద్రు. ఎదిరించి నోళ్లను కాల్చి చంపింద్రు. మరి గయన్నీ ఎట్లబోయి నయ్. వూర్కెనే బోయినయా! మేము ఎన్ని కష్టాలు పడ్డమో మీకు తెల్వదు. నైజాం సర్కారుకు వ్యతిరేకంగా మేము పోరాటం జేస్తుంటే మధ్యలో సంగపోళ్లొచ్చింద్రు. రక్త పాతం జేసింద్రు. ఎంతోమంది తలకాయలు కరకర గోసింద్రు. అటుపక్క సర్కారు, ఇటుపక్క సంగపోల్లు ఇద్దరి మధ్య జనం గిలగిల గొట్టుకున్నరు. ఏం జెయ్యాలె? ఏమన్నాగనీ- అని గట్టిగ నిలబడ్డం. శాంతి యుత పోరాటం జేసినం. సత్యాగ్రహాలు జేసినం. లాఠీదెబ్బలు తిన్నం. జైళ్లకు బోయినం. వాళ్లు ఎన్ని జేసిన పోరాటం ఆపలే. నైజాం సర్కారు దిగొచ్చిందు. రాజీ బేరానికొచ్చిండు. కానీ మేము కుదరదన్నం. మా పార్టీ కేంద్రంలో అధికారానికొచ్చింది. సర్దార్‌పటేల్ డిఫెన్సు మినిష్టరుగున్నడు. ఆయనకు జెప్పినం. బస్ గంతే. పటేల్ సైన్యాన్ని బంపిండు. దెబ్బకు నైజాం రాజు గద్దెదిగిండు. రజాకార్లు బోయింద్రు. అగ్గో- గట్లొచ్చింది స్వతంత్రం మనకు. స్వతంత్ర మొచ్చినంక ప్రజారాజ్యమొచ్చింది. ఓట్లొచ్చి నయ్. ఎప్పట్నుంచో ప్రజాసేవజేస్తున్న. ఎందుకంటే మేమెందుకున్నం? ప్రజాసేవ జేయడానికి? ప్రజాసేవ జేస్తూనే ముసలో ల్లమైపోతున్నం. అందుకే యువకులు ముందుకురండి. ఆఖరుగా ఒక్కమాట జెప్పి వూర్కుంట. మల్లా ఎన్నికలొస్తున్నయ్. నేను చెప్పవలసిన పన్లేదు. అయినా చెప్తు తున్న. ఈసారి కూడా రంగారావుగారికే టికెట్టు ఇచ్చినం. ఆయన్ని గెలిపించాలే. ఎందుకంటే మన మనిషి, త్యాగం జేసిండు. మంచిపనులు జేస్తుండు. ఈసారి మరల మన ప్రభుత్వమొస్తది. వస్తే రూపాయకు కిలోబియ్యం. పేదలకు భూములు, వృద్ధా ప్యపించన్లు. వూరికో బస్సు, ఇంటికో లైటు, మనిషికో బర్రె, తలకో గొర్రె, అందరికీ నౌక రీలు, బ్యాంకుఅప్పులు, తోటలపెంపకం, హరిజనులకు, గిరిజనులకు ఇండ్లస్థలాలు, గీసెటోల్లకు చెట్టు.నేసేటోల్లకు దారం... ఇంకా చాలాచాలా సూత్రాలున్నయ్. గయన్నీ జేస్తం"మళ్ళీ చప్పట్లుమార్మోగాయి.

"ఆఖర్న... స్వాతంత్ర సమరయోధుడిగ జెప్తుతున్న. పేదోళ్ళు, ముఖ్యంగా ఆడోళ్లు, అమ్మలు, అక్కలు, చెల్లెండ్లు... మిమ్మల్ని జూస్తుంటే నాకెట్లగో వుంటది. ఎందుకంటే మీకు కడుపునిండ తిండిలేదు. కట్టుకోవడా నికి బట్టలేదు. వుండటానికి గుడిసెలేదు. ఎందుకని? ఎందుకంటే! అయన్నీ జేయ కుండా అపోజిషనోళ్లు అడ్డు తగుల్తున్నరు. సమ్మెలు చేయిస్తున్నరు. అరాచకం జేయి స్తున్నరు. దోపిడీలు, దొంగతనాలు జేసేటో ళ్లను రౌడీలను... అదేందీ... ఎంకరేజ్ జేస్తున్నరు. యిగ ఇప్పుడు నక్సలైట్లొ చ్చింద్రు. ప్రాణాలు దీస్తుంద్రు. పరేషాన్ జేస్తుంద్రు. ఇయన్నీ జూస్తుంటే బాదయి తది గనీ యేంజేస్త.

"మనిషై బుట్టినంక మంచి పన్లు జేసి, మంచిగా జావాలె. గట్లగాకబోతే మనిషెట్ల యితడు? గట్లజేసినం గాబట్టే గిట్లున్నం.

"ఇయ్యాల గప్పుడెప్పుడో జర్గిన తెలంగాణ పోరాటం గురించెందుకు తల్సుకుంటున్నం? అప్పటోళ్లం త్యాగాలు జేస్నింగాబట్టి... గప్పుడు మేము గిట్లయితదనుకున్నమా? నేను బతుకుతననుకున్ననా? మంత్రినైతననుకున్ననా? సచ్చేటోడ్ని బతికిన. ఎట్లనో తెల్సా! ఒకరోజు- మా పూరు రామారాన్ని నైజాం మిలిట్రీ- రజాకార్లు ముట్టడిజేసింద్రు. ఆగమాగం జేస్తుంద్రు. ఆడోళ్లను ఆగం జేస్తుంద్రు. మగోళ్లను కంపల్లయేసి కొడుతున్నరు. పారిపోయేటోల్లను కాల్చిచంపుతున్నరు. ఏమన్నగనీ- అని బోయిన. ఎదిరించి ధైర్యంగ అడిగిన... కాలుస్తమన్నరు. కాల్చుమన్న. చంపుతమన్నరు చంపమన్న. నన్నేమన్న జెయ్యండిగని నా ప్రజలనొదిలేయమన్న. ముందుకుబోతున్న. గంతే... టపటపా కాల్చింద్రు. నా పక్కనున్నాయన తుపాకి దెబ్బతగిలి కిందపడిపోయిండు. గిలగిలకొట్టుకొని ప్రాణమిడిసిండు. ఇంకో తూటా. గిట్ల... గిట్ల నాపక్కంగబోయింది. బతికిన. పట్టుకున్నరు. చిత్కగొట్టింద్రు. జైల్లో బెట్టింద్రు. చచ్చిపోకుండా ఎందుకు బతికిన? గది ఆ దేవుడికే దెల్వాలె. బతికించిండు. దేనికి? మీ సేవజెయ్యడానికి. బతికినంతకాలం గిట్ల ప్రజాసేవ జేస్తూనే చస్తా. ఎనుకటియన్నీ తలుసుకుంటే... గయన్నీ ఎట్ల జేస్నిం? ఎందుకు జేస్నిం? గిట్ల చెప్పుతుబోతే తెల్లార్తది. అందుకే ఇగ ఆఖర్న..."

"చెప్పింది చాలు నోర్ముసుకో" జనంలో నుండి ఒక వృద్ధ స్త్రీ బిగ్గరగా అరిచింది. అందరి చూపులు ఆ వైపు మళ్లాయి. కార్యకర్తలు ఆవైపు పరుగెత్తుతున్నారు. పోలీసులు ఆమెకోసం వెతుకుతున్నారు. జనంలో కలకలం బయల్దేరింది. మంత్రి ముందు తడబడ్డా సర్దుకుని.

"ఎవరో ముసల్ది. పాపం పిచ్చిదానిలాగున్నది. గయన్నీ పట్టించుకుంటే మనం పిచ్చోళ్లమయితం. అందుకే నేను జెప్పుతున్నదేందంటే"

ఆమె జనంలోనుండి లేచి నిలబడి.

"ఇంకేమి చెప్పొద్దు. చెప్పింది చాలు దిగు. పోలీసుపటేల్ పాపిరెడ్డి. నువ్వు స్వాతంత్ర్య సమరయోధుడివా? తెలంగాణా పోరాటయోధుడివా? సిగ్గు లేకుండ ఎందు కట్ల మాట్లాడుతున్నవ్? ఆ అమరవీరుల త్యాగాలను ఎందుకు అపవిత్రం చేస్తవ్? పరమ కిరాతకుడివి నీవు..." అన్నది.

దగ్గరికొచ్చిన పోలీసులు ఆమె రెక్కబట్టుకొని బయటికి ఈడ్చుకుపోతున్నారు. అయినా ఆమె గొంతు వినిపిస్తూనే వున్నది.

"ఎంతకాలం ప్రజల్ని మోసం జేస్తవ్? రజాకార్ల బంటువురా నువ్వు. ఎంతమంది మాన, ప్రాణాలు దీసినవో నాకు దెలుసు. నీ బతుకంతా ఎండగడ్త"

లాక్కుపోతున్న ఎస్సై ఆమెను కర్రతో కొడుతూ, 'నోర్ముయ్. నోరుదెరిస్తే చంపేస్త' అంటున్నడు.

"చంపు, చంపరా! మీ చేతిలో తుపాకులున్నది మాలాంటివాళ్లను చంపడానికేగద. మీ చేతికి కర్రలిచ్చింది మమ్మల్ని కొట్టడానికి, మా నోర్లు మూయించడానికేగద. వాళ్లు కొట్టమంటే కొడ్తారు. కాల్చుమంటే కాలుస్తారు. ఎంతకాలం చేస్తారు? మీరున్నది న్యాయాన్ని కాపాడటానికి? కానీ... ఇలాంటివాళ్లకు గులాంగిరీ చేయడానిక్కాదు..." బిగ్గరగా అని చెయి విదిలించుకున్నది.

జనంలో చలనం కలిగింది. కొందరు ఆమెను పట్టుకొని పోతుంటే వెనకాలే నడుస్తున్నారు. ఒక ముసలమ్మమీద పోలీసుల దౌర్జన్యం సహించలేక అసహ్యించుకుంటున్నారు. కానీ, ధైర్యం చాలక వెనకముందాడుతున్నారు. అవమానం జరిగినందుకు మంత్రి మండిపడుతున్నాడు. సభ చెదిరిపోయింది. జనం లేచిపోతున్నారు. అందరి దృష్టి పోలీసులు పట్టుకొనిపోతున్న ముస

లమ్మ మీదనే వున్నది. క్రమంగా జనమంతా అటువైపు కదులుతున్నారు. ఇక సభ జరగదని తెలుసుకున్న మంత్రి గబగబా స్టేజి దిగి కార్లోకెక్కాడు. అతనితోపాటే వచ్చిన నాయకులంతా వెళ్ళిపోయారు. రంగారావు పరువు పోయిందనుకుని ఉద్రేకంతో ఉడికిపోతున్నాడు. గబగబా పోలీసులు పట్టుకుపోతున్న ముసలమ్మ దగ్గరికెళ్ళాడు.

"ఏంటే ముసలిముండ! నోటికొచ్చినట్లు కూసి మీటింగు చెడగొట్టినవ్. మంత్రిగారిని అవమానపరిచినవ్? ఏ వూరే నీది? ఎందుకొచ్చినవ్? నీ అంతు జూస్త. నీకెవడడ్డమొస్తడో చూస్త" అని ఎస్సై వంక చూశాడు.

"దీన్ని దీస్కబోయి సంగతేందో చూడండి. ఇది చచ్చిన ఫర్వాలేదు. ఏమన్న అయితే నేను జూస్కుంట... లాక్కపొండి" అని ఆర్డరేశాడు. ఎస్సై మళ్లీ ఆమె చేయి బట్టుకొని లాగుతున్నాడు.

"ఒరేయ్ రంగారావు. నీ బతుకు కూడా నాకు తెల్సురా! రంగులు మార్చే వూసరవెల్లులురా మీరు! ప్రజలనెంతో కాలం మభ్యపెట్టలేరు. నైజాం కాలంలో దొర- ఈనాడు రాజకీయనాయకుడు. ఎంతకాలం సాగిస్తావ్? ఎప్పటికైనా మీ పాపాలు బద్దలయితయ్"

"ఏయ్ బాడ్కావ్ముండ! ఏందే కూస్తున్నవ్! నీయమ్మ" రంగారావు ఆవేశంతో వూగిపోతూ ఆమె చెంపలమీద చళ్లుచళ్లున కొడుతున్నాడు.

"కొట్టరా! కొట్టినా, తిట్టినా నా నోరు మూయించలేవురా! ప్రాణాలకు భయపడే పిరికిదాన్నికాదురా"

"అట్ల జూస్తవేంది. దీన్ని తీస్కబోయి లాకప్‌లో బడేయ్ సభలో అల్లరి జేసిందని. మంత్రిగారిమీద దాడిచేసిందని కేసు బెట్టు. దీని రోగం కుదురతది" ఎస్సైకి ఆర్డర్ వేసిండు రంగారావు.

ఎస్సై ఆమె రెక్కబట్టుకొని లాగబోయాడు. అప్పటిదాక సహనం పాటించిన ఆడవాళ్లు ముందుకు దూసుకొచ్చారు.

"ఎందుకయ్యా! ఆమెనట్ల జేస్తున్నరు" ఒకామె ధైర్యం చేసి అడిగింది. మిగతా ఆడవాళ్లు కూడా ధైర్యంచేసి ఎస్సైను, రంగారావును చుట్టేసి ప్రశ్నలవర్షం కురిపిస్తున్నారు.

"ఎందుకట్ల గొడుతున్నరు?"

"వున్నదే అన్నది?"

"ఏం తప్పు జేసింది?"

"మీరు జేసిందే చెప్పింది."

"మీరేమి యెల్లబెట్టింద్రు?"

"అడ్గితే తప్పొచ్చిందా?"

"పేదోళ్లకేం జేసింద్రు?"

"నోర్లేనోళ్లమని, ఇష్టమొచ్చినట్లు జేస్తున్నరు"

"నువ్వు దొరవు కావా? దుర్మార్గం చెయ్యలేదా?"

"నువ్వేం జేస్నివ్? వచ్చిందంతా మీరేపంచుకుంటిరి?"

"మాకేమిచ్చింద్రు?"

"భూములన్నరు- బావులన్నరు, యాడున్నయ్?"

"మీకయన్నీ యెట్లొచ్చినయ్?"

"మాకు దెల్వదనుకుంటున్నరా?"

"పట్టకపొండి సూస్తం- ఎంతమందిని పట్టకపోతరో?"

ఆడాళ్లను చూసి మగాళ్లు కూడా ధైర్యం చేస్తున్నారు. ముందుకు దూసుకొస్తున్నారు. వాళ్ళ ఉద్రేకం గమనించాడు రంగారావు. జనాన్ని చూసి కార్యకర్తలు కూడా తోకముడిచారు. దిక్కుతోచకుండా ప్రజలమధ్య చిక్కుకున్నాడు రంగారావు. ఎస్సై బిత్తరపోయి చూస్తున్నాడు.

ఎస్పీ హడావుడిగా వచ్చాడు జీపు దిగుతూనే గొంతుచించుకుంటూ.

"ఏందిరా అందరిక్కడ గుమిగూడింద్రు.

బొమ్మలాడుతున్నయా? నడువుండ్రి! దాని సంగతి నేను జూస్త..." అంటూ జనాన్ని కర్రతో బాదుతూ ఆమె దగ్గరకొచ్చాడు. పోలీసులు జనాన్ని లాఠీలతో చెదరగొడుతున్నారు.

ముసలమ్మను ఎగాదిగా చూశాడు.

తెల్లని చీర, రవిక, నెరిసినజుట్టు, ముడతలు పడిన శరీరం, ఎరుపెక్కిన కళ్లు, గాంభీర్యం ఆమె ముఖంలో ఉట్టిపడుతున్నది. రంగారావువంక చూశాడు.

"సారీ సార్! ఇదెవతో నిజంగనే పిచ్చిదానిలా గున్నది.

దీని సంగతి మేం జూసుకుంటం మీరెళ్ళండి సార్" క్షమాపణ చెప్పుకున్నాడు ఎస్పీ. రంగారావు అదే అదునని నెమ్మదిగా జారుకున్నాడు. ఎస్.ఐ. వంక జూశాడు.

"టేక్ దిస్ బిచ్ టు స్టేషన్ అండ్ గివ్ ప్రాపర్ ట్రీట్‌మెంట్" అని ఇంగ్లీషులో నోటికొచ్చినట్లు తిడుతున్నాడు. శకుంతలమ్మ భరించలేకపోయింది.

"మిస్టర్ ఎస్.పి. హోల్డ్ యువర్ టంగ్. డోన్ట్ టాక్ రబిష్" ఆవేశంతో అన్నది.

ఖంగుతిన్న ఎస్.పి. బిక్కమొగమేశాడు.

"నీవు ప్రభుత్వ అధికారివిగాని, ఈ గూండా రాజకీయనాయకుల ఏజెంటువు కాదు. మర్యాద ఇచ్చి పుచ్చుకోవడం నేర్చుకో. నీ ఉద్యోగధర్మం గుర్తుంచుకో. ఇంగ్లీషుభాష నీకొక్కడికే కాదు, నాకూ వచ్చు నేనూ అనగలను. ఆ మంత్రి గతమేమిటో నీకు తెలుసా! ఒకనాడతను నిజాంబంటు, రజాకార్ల ఏజెంటు. ప్రజాద్రోహి. అతను మంత్రిగావచ్చు కానీ స్వాతంత్ర్య సమరయోధుడనని ప్రజలను మోసం చేస్తుంటే భరించలేకపోయాను. అందుకే అడిగాను" అంది.

"సారీ మేడం, మీరెవరో నాకు తెలియదు? మీరేమిజెప్పుతున్నరో నాకర్థం కావడంలేదు"

"అందుకేగద దేశమిట్లున్నది? మీరు మంచీ చెడు ఆలోచించగలిగితే- న్యాయానికి, ఉద్యోగ ధర్మానికి కట్టుబడితే దేశమెప్పుడో బాగుపడేది? "

ఇంతలో జనంలోనుండి ఒక ముసలమ్మ ముందుకొచ్చింది. ఆమెకు చేతులు జోడించి నమస్కరించింది.

"అమ్మా! నన్ను గుర్తు పట్టినవా? " గుడ్లనిండా నీరు నింపుకుని ఆప్యాయంగా అడిగింది. మాసిన జుట్టు, అతుకుల రవికె, మోకాళ్లదాక కాచేబోసిన చీర, చేతిలో కర్ర, ముడతలు బడ్డ శరీరం పరిశీలనగా చూసి.

"లక్ష్మమ్మా!" అనిబిగ్గరగా కౌగలించుకున్నది.

లక్ష్మమ్మ సంతోషంతో పొంగిపోయింది. చెప్పరాని ఆనందంతో అందరివంక జూసింది.

"ఈ అమ్మ ఎవరనుకున్నారు? శకుంతలమ్మ! రజాకార్లతో పోరాటం జేసింది. ఎన్ని కష్టాలు పడ్డది ఈయమ్మ" అన్నది.

అందరూ శకుంతలమ్మకు నమస్కారం చేస్తూ- ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఎస్పీ అర్థం చేసుకున్నాడు. అక్కడుంటే బాగుండదని నెమ్మదిగా తప్పుకున్నాడు.

"బాగున్నవా! లక్ష్మమ్మా" శకుంతలమ్మ అడిగింది.

"సావలేక బత్కలేక గిట్లున్నమ్మా! మీరెట్లున్నరు? బాబు బాగున్నడా? ఏం నౌకరి జేస్తున్నడు? "

శకుంతలమ్మ దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. ఒక్కసారి భోరున ఏడ్చింది. లక్ష్మమ్మకు ఎందుకో అర్థంకాలేదు.

"ఎందుకమ్మా! ఏమయ్యింది? "

"విప్లవంలో పుట్టాడు. కిరణ్ అని పేరు బెట్టుకున్న. తండ్రిలాగేవాడు నాకు దూరమయ్యాడు. ఈ దుర్మార్గులే అతన్ని పొట్టనబెట్టుకున్నారు"

"ఎంత అన్యాయం జేసిండమ్మా దేవుడు?

"దేవుడు కాదు లక్ష్మమ్మా- ఈ దుర్మా

ర్గులు చేసింది"

"ఇక్కడే వుంటున్నరా!"

"లేదు... పట్నంలోనే. నువ్వెక్కడుంటు న్నవ్? "

"ఊర్లోనే వుంటున్నమ్మా! వృద్ధాప్య పించన్లు ఇస్తరు, భూములిస్తరు అని వూర్లల్ల జనాలందర్నీ లారీలమీద తీసుకొస్తుంటే అదేందో సూద్దామనొచ్చిన. లతీఫ్ అన్న గూడ వచ్చిండు" అని వెనక్కి తిరిగి జనం లోకి చూస్తూ, "లతీపన్న- ఓ లతీపన్నా" కేకవేసింది. తెల్లని పిల్లిగడ్డం, మీసాలు, తలకు రుమాలు, చంకల బనియన్, చంకకు సంచి, చేతిలో కర్రతో లతీఫ్, లక్ష్మమ్మ దగ్గ రికొచ్చాడు. లక్ష్మమ్మ, శకుంతలమ్మను చూపుతూ అడిగింది.

"ఎవరో గుర్తు పట్టినవా? "

లతీఫ్ పరీక్షగా చూసి "గుర్తుకొస్తలేదు" అన్నాడు.

"శకుంతలగారు" చెప్పింది లక్ష్మమ్మ సంతోషం వ్యక్తం చేస్తూ.

లతీఫ్ కళ్లల్లో నీళ్లు తిరిగినయ్. మాట తడబడింది. గద్గద స్వరంతో.

"సూస్నివా అమ్మా! ఆ పాపిరెడ్డిగాడు. లుచ్చాగాడు ఎట్ల మాట్లాడుతుండో! మీరు మంచిగడిగింండ్రు. ఆడు మాట్లాడుతుంటే నా రక్తముడికింది. ఆడిప్పుడు మంత్రయ్యిండు. మాయమాటలు జెప్పుండు. అయ్యాల యూడ్నిగూడ ఖతంజేస్తె పీడబొయ్యేది" ఆవే శంతో అన్నాడు లతీఫ్.

"గుర్తుందా లతీఫ్‌బాయ్. మన ఆఖరి పోరాటం ఇక్కడే జరిగింది" అన్నది శకుం తల.

"ఎందుకు గుర్తులేదమ్మ. రవిగారు- మిగతా కామ్రేడ్లు నల్గురు ఇక్కడే గద సని పోయింండ్రు!" లక్ష్మమ్మ అన్నది.

"అయిటంక మనమెక్కడోల్ల మక్కడైపో యినం. మేము వూరికిబోయినంక, యీ పాపిరెడ్డిగాడే మల్ల పోలీసులతో దిగిండు. మమ్మల్ని పట్టుకపోయి దొరను చంపిన ఖూనీకేసు బెట్టింండ్రు. ఈడే పంతంబట్టి సాక్షాలు చెప్పించిండు. సత్తిరెడ్డికి, లచ్చుమ మ్మకు, లింగయ్యకు, నాకు జన్మ ఖైదైనది. ఆరేండ్లు జైల్ల వున్నంక పాల్టోళ్లు ఏంజే సింండ్రో ఎట్ల జేసింండ్రోగని మమ్ముల వదిలి బెట్టింండ్రు. బయటికొచ్చినంక జూస్తే అంత ఎనకటోలెనే వున్నది. ఏం జేస్తం" నిరాశతో అన్నాడు లతీఫ్.

"ఇప్పుడేం జేస్తున్నవ్ లతీఫ్‌బాయ్? "

"ఏముందమ్మ. కూలీ-నాలీ జేస్త. అదీ దొరక్కపోతే పట్నంబోయి రిక్షా దొక్కుత? "

"మీరెట్లున్నరు? ఈడనే వుంటున్నరా? "

"లేదు... పట్నంలోనే వుంటున్న. ఇక్కడ మనవాళ్ళ స్థూపం నిర్మించాం. ప్రతి సంవ త్సరం ఇదేరోజు వచ్చి ఒకసారి శ్రద్ధాంజలి ఘటించిపోతుంటాను. అందుకే వచ్చిన" అన్నది శకుంతలమ్మ.

"మా అదృష్టం. ఇట్లాగన్న మిమ్ముల జూస్నిం. పదమ్మా. మేం గూడా వస్తం. ఆ అన్నలకోసారి దండం బెట్టుకుంటాం" అన్నది లక్ష్మమ్మ.

ముగ్గురు కలిసి స్థూపంవైపు పోతు న్నారు. వారి వెనకాలే జనం కూడా కది లారు. ఊరికి దూరంగా పలుగురాళ్లబోటు. ఎర్రని మట్టితో భూమి, తళతళమెరిసే పలు గురాళ్లు తప్ప చెట్లెక్కడా లేవు. ఎత్తుమీద ఎర్రని స్థూపం. దానిపక్కనే ఒకేఒక మోదుగుచెట్టు అగ్గిపూవులతో ప్రకాశిస్తు న్నది. స్థూపంమీద అమరవీరులు రవి, యాదగిరి, మారయ్యా, గోపయ్యా, కిష్టయ్యా పేర్లు చెక్కివున్నాయి.

శకుంతలమ్మ తనతోపాటు తెచ్చిన ఎర్ర గులాబీలు స్థూపం ముందువుంచి నమస్క రించింది. లతీఫ్, లక్ష్మమ్మతోపాటు జనం గౌరవపూర్వకంగా వొంగి దండం బెట్టారు. శకుంతలమ్మ, లతీఫ్, లక్ష్మమ్మల, కళ్లముందు గతం కదలాడింది. ఐదు దశాబ్దాల వెనక్కు వెళ్ళి చూస్తున్నారు.

★ ★ ★

మసకచీకట్లు చెదురుతున్నయ్. కొద్దికొద్దిగా వెల్గు కన్పిస్తున్నది. కోడిపుంజులు కూస్తున్నయ్. పిట్టలు కిచకిచమంటూ చెట్లొదిలిపోతున్నయ్. కుక్కలు మొరుగుతున్నయ్. అవుదూడలు అరుస్తున్నయ్. నిద్రలేచి జనం పనులకు బోతున్నారు.

సూర్యుడు పొడిచాడు. ఎర్రని సూర్యకిరణాలు పడుతున్నాయ్. ఆ వెలుగులో పలుగురాళ్లు తళతళమంటున్నాయ్. గడ్డిమీద మంచుచుక్కలు ముత్యాల్లా మెరుస్తున్నాయ్. ప్రకృతి అందం కనబడుతున్నది. తడిసిన గడ్డివాసన, రకరకాల పూలవాసన లొస్తున్నాయ్. గువ్వలు కూస్తున్నాయ్. కోకిల రాగం తీస్తున్నది.

డొంకదారిన ముత్తయ్య వొంటరిగా వస్తున్నాడు. జుంపాల జుట్టు, తెల్లని అంగీ, పైజామా, చెవులకు పోగులు, చేతికి కడియం, నూగుమీసాలు, చేతిలో సంచి చకచక నడుస్తున్నాడు. కాళ్ళకిర్కు చెప్పులు కిర్రుకిర్రుమంటున్నాయ్. డొంకపక్క కంపకంచె, దానిమధ్య అక్కడక్కడ తంగెడు, గాదంగి, ఈతచెట్లున్నాయ్. ఒంటరితనం, కొత్త ప్రదేశం బిక్కుబిక్కుమంటు నడుస్తున్నాడు. కిర్కు చెప్పుల శబ్దం లయబద్ధంగా వుంది. వొంటరితనం పోగొట్టుకోవడానికి పాటందుకున్నాడు. ఆడుతూ పాడుతూ వస్తున్నాడు.

దారిపక్క పుట్టమీద త్రాచుబాము పడగ విప్పి చూస్తున్నది. ముత్తయ్య గుండె గుభేల్ మన్నది. పరుగు దీస్తున్నాడు. వెనక్కు చూస్తున్నాడు. కొంతదూరంబోయి వూపిరి పీల్చుకున్నాడు. ముందుకు చూస్తే దూరంగా వూరు కనబడుతున్నది. ఊరి కంటే ముందు ఒక తెల్లని మేడ కనపడుతున్నది. దారి పక్కన గుడిసెలు, మిద్దెలున్నయ్. వూరు దగ్గరి కొచ్చిందని వడివడిగా నడుస్తున్నాడు.



దొర గడిముందు పెద్ద ఖాళీస్థలముంది. మధ్యలో చెట్లున్నాయ్. గడిముందు దర్వాజా ప్రక్కన పెద్ద అరుగుంది. దాని కింద చిన్న అరుగులున్నాయ్. ఖాళీస్థలంలో ఎంతోమందిని హింసలు బెడుతున్నారు. కొందరి వీపులమీద బండలెత్తారు. కొందరిని గోడపక్కన వొంగబెట్టారు. గొల్ల మారయ్యను చెట్టుకు కట్టేశారు. ఒక పోరగాణ్ణి కోళ్లగుది వేశారు. కర్రలు పట్టుకొని దొర నౌకర్లు వాళ్ళకు కాపలా కాస్తున్నారు. శిక్షను పొందేవాళ్ళ ఆలు-పిల్లలు, చుట్టాలు దూరంనుండి కంటతడి బెడుతున్నారు. కొందరు ఏడుస్తున్నారు. కొందరు కుమిలిపోతున్నారు. మరికొందరు దిగాలుపడి చూస్తున్నారు.

దొర బయటికొచ్చే వేళయ్యింది. పట్వారి, పటేల్, షావుకారు, గ్రామపెద్దలొచ్చి చిన్న అరుగుమీద కూర్చుని దొర రాకకోసం చూస్తున్నారు. పెద్ద అరుగుమీద దొర "ఆరాం"చేర్ తెచ్చేడు నౌకరు. అది వూగుతూ ఎదురున్న వాళ్లను ఖబర్దార్ అంటున్నట్లున్నది. నౌకర్లు, మస్కూరి కొండడూ లోపలికి బయటికి తిరుగుతున్నారు. దొడ్డి దర్వాజ గుండా కల్లుకుండలు, యాటలు, కోళ్లు, సామానులు తీసుకుపోతున్నారు. కర్రబట్టుకొని నౌకరు బయటికొచ్చాడు. మరొకడు పాన్‌దాన్‌దెచ్చి కుర్చీ

దులిపి పక్కనపెట్టాడు. ఇంకోడు విసనకర్ర తీసుకొచ్చి పైపంచితో కుర్చీ దులిపి పక్కన నిలబడ్డాడు.

దొరవస్తున్నాడు.

"పహరా వుషార్" అన్నట్లు నౌకర్లు సైగ జేశారు.

★ ★ ★

దొర గడి గడపదాటాడు. ఎత్తుగా. లావుగా భయంకరంగా ఉన్నాడు. పెద్ద బొర్ర, ఫ్రెంచి మీసం, గళ్ళ లుంగీ, జుబ్బా లాల్చీ కళ్ళద్దాలు, కాళ్ళకు మేజోళ్ళు- నెరిసి నజుట్టు- కళ్ళల్లో క్రూరత్వం, చూపులో అహంకారం.

దొరను చూడగానే అక్కడున్న జనం సాష్టాంగపడ్డారు. పటేల్, పట్వార్లు, గ్రామ పెద్దలు ఒంగి సలామ్‌లు జేశారు.

దొర ఆరాం కుర్చీలో కూర్చున్నాడు. పటేల్, పట్వార్లు కూర్చున్నారు. జనం ఒక్క సారి గొల్లుమన్నారు.

"దొరా! నీ కాల్మొక్త దొరా!"

"నీ బాంచన్! రచ్చించండి దొరా!"

"పానంబోతుంది దొరా! నీ కాల్మొక్త- గులాపోన్ని"

"దొరా! దొరా! సచ్చి నీకడ్పున బుడ్త... కాపాడుండి దొరా"

"దండంబెడ్త... నా చర్మం వలిసి నీచెప్పులు చేస్త నా బిడ్డను కాపాడుండి దొరా!'

"ముసలోడు సస్తడు దొరా! గులాప్ దాన్ని! గులాప్‌దాన్ని! నీకంటే నాకు దిక్కోరు దొరా"

"తప్పయ్యింది దొరా! యింకెప్పుడు చెయ్య! నీకాల్మొక్తా దొరా!"

మొరబెట్టుకుంటున్నారు. సాష్టాంగ పడి దండంబెడుతున్నారు. గుండెలు బాదుకుంటున్నారు. పెద్దవాళ్లను చూసి, వాళ్ళ పిల్లలు ఏడుస్తున్నారు.

దొర తమలపాకు నములుతూ, అందర్నీ చూస్తున్నాడు. తలాడిస్తున్నాడు. కోపంతో కన్నెర్రజేస్తున్నాడు.

నౌకరు వెనకాల నిలబడి విసనకర్రతో వూపుతున్నాడు. మరొకడు చేతులు కట్టుకొని పక్కన నిలబడ్డాడు.

"సచ్చిపోత దొరా! నీ కాల్మొక్త బాంచన్" వీపున బండబెట్టిన ముసలోడన్నాడు.

"రాతిరి నించి కట్టేసింన్రు దండంబెడ్త. కాలు చేతులు పీక్కపోతున్నయ్ దొరా!" అన్నాడు చెట్టుకు కట్టేసిన గొల్ల మారయ్య.

దూరం నుండి అతని భార్య సాష్టాంగ పడి దండంబెడుతూ గోడుగోడున ఏడుస్తున్నది. ఆమెను చూసి ఇద్దరు పిల్లలు భయంతో ఏడుస్తున్నారు.

"ఖామూష్... యెవతిరా ఆ ముండ" గద్దించి అడిగాడు దొర.

నౌకరు రామిగాడు అంగలోబోయి కర్రతో ఆమెనొక్కటేశాడు. లబోదిబో మంటూ ఆమె దూరం జరిగింది. అక్కడినుండి మళ్ళీ మొరబెట్టుకుంటున్నది.

"దొరా! నీ కాల్మొక్త... పున్నెముంటుంది. మారాజులు. మాకు దిక్కోరున్నరు. దొరా! నీ కాళ్ళదగ్గర బతికెటోళ్ళం. మన్నించుండి దొరా" అంటున్నది.

"ఆ ముండ నోరు మూయించరా" కోపంతో అన్నాడు దొర. రామిగాడు రెండు దెబ్బలేసి కర్రబెట్టి తోసిండు. "నోరు దెరిస్తె సంపేస్త"నని హెచ్చరించాడు.

బండలెత్తిన ముసలోడి పెండ్లాం తల బాదుకుంటున్నది. దొరను వేడుకుంటున్నది. ముసలోడి ప్రాణం కాపాడుమంటున్నది. ఏడ్చిఏడ్చి ఆమె గొంతు పోయినట్లున్నది. అక్కడున్నోళ్ళంతా బాధలుపడే తమ వాళ్లను చూసి కన్నీరు పెడుతున్నారు. దొరను కనికరించమని దండాలు బెడుతున్నారు.

కనికరంలేని దొర కన్నెర్రజేశాడు, నౌకర్ల వంక జూసి.

"నఖ్రాల్ జేస్తుందేందిర! గోల చేసేటో

ళ్లను గొంతు పిసుకండిరా! నోరున్నదని కాకి గోల బెడుతున్నరు. అందర్ని తరిమెయ్యండిరా" హుకుం జేసిండు.

రామిగాడు, లచ్చుంగాడు కఱ్ఱలు దీసుకొని జనాన్ని తరిమేశారు. మొండికేసిన ముసలమ్మను లచ్చుంగాడు దూరంగా యీడ్చుకుపోతున్నాడు. తెగించి ధైర్యం చేసింది ముసలమ్మ. రెక్కబట్టి యీడ్చుకుపోతుంటే దొర వంక జూస్తూ అంది.

"పాపిస్టి ముండాకొడ్క- నా వుసురు తగిలిపోతవ్- పురుగులు బడిసస్తవ్. యిన్ని పాపాలు జేస్నివ్ గాబట్టే పిల్లాజెల్లా లేకుండ యినవ్" థూ- అని తుపుక్కున వుమ్మేసింది.

దొరకది వినిపించలేదు. కానీ- వింటే ఏమయ్యేదో లచ్చుంగాడి కెరికే. అందుకే "నోర్మూయ్యే ముసల్దాన. దొర వింటే సంపేస్తడు. నడువ్" అని దూరంగా దోసిండు.

ముసలమ్మను యీడ్చుకపోవటం బండలెత్తిన ముసలోడు చూశాడు. వీపున బండ బరువున్నది. వొంగి వుండి నరాలు పీకుతున్నయ్. బాధభరించలేకున్నాడు. మొత్తుకున్నా, మొరబెట్టుకున్నా దొర వినిపించుకోనందుకు మనసులో ఆవేశం రగిలింది. "నువ్వు మనిషివి కావురా! పశువ్వి. యేంజేస్ని. నన్నెందుకిట్ల యింసబెడ్తవ్" అని మనసులోనే తిట్టుకుని, తల ఎత్తి దొర వైపు చూశాడు. అతని కళ్లు అగ్నిగోళాల్లా వున్నయ్. ఆ చూపుల్లో ఆవేదన ఆవేశం నిండివుంది. వాటిని దిగమింగుతూ వినయంగా చేతులు జోడించి దొరకు దండం బెట్టబోయాడు. వీపుమీది బండ నేల బడింది. అతను తూలిపడ్డాడు. దొర మండిపడ్డాడు.

"చూస్తరేందిర! ముసలిముండాకొడుక్కు కండ్ల కావరమెక్కింది. బండబడేసి- దండం బెడుతుండు బాంచోత్. బడ్తెపూజ జేసి బండలెత్తరా!" అన్నాడు. దొర మాటకు ఎదురేముంది. ముసలోన్ని చితకబాది- బండ ఎత్తారు. ముసలోడు ఆయాసంతో మూలుగుతూ బండబరువు మోస్తున్నాడు.

చెట్టుకు కట్టేసిన గొల్లమారయ్య, "బాంచన్ దొరా! కాల్మొక్త" యేదో అనబోయాడు.

"నోర్మూయ్ లఫ్డీకొడ్క" దొర కోపంగా అన్నాడు.

మారయ్య మాట్లాడలేదు. దూరంగున్న అతని భార్య లింగమ్మా, పిల్లలూ గొల్లుమన్నారు. ఆమె దొరకు దండంబెడుతోంది. సాష్టాంగ పడుతోంది. నెత్తీ, నోరూ కొట్టుకుంటున్నది. దొర గుడ్లురిమాడు.

"ఆ లంజముండను దూరం పంపించరా! యెవడు చచ్చిండని గట్లేడ్నుతుంది బద్మాష్ ముండ. తన్ని పంపించండ్రా" అన్నాడు.

రామిగాడు లింగమ్మ చేయిబట్టుకొని గొర గొర యీడ్చుకబోతున్నాడు. లింగమ్మ మండిపడ్డది.

"ముట్టుకొని చెయ్యి బట్టుకుంటవేందిర ముదనష్టపోడ. ఏం తప్పు సేసిండ్రా నా మొగడు. ఎవరి సొమ్ముదిన్నడు? ముదనష్టపు ముండా కొడుకుల్లార! నాశనమైతర్రా! గొఱ్ఱెలు, మేకలు మందనంత మీ పొట్టల్నే బెట్టుకుంటిరి గదర? యింకేముందిర? యియ్యడాన్కి? ... మా పానాల్ దప్ప? సంపండ్రా! వూర్ల జనాన్నంత సంపి అందరి పిండాకూడు తినండిర" నోటికొచ్చినట్లు శాపనార్థాలు పెడుతోంది లింగమ్మ.

"నోర్మూస్కో- నీయమ్మ. నీ కూతలు దొరకినబడ్తె నర్కి పోగుల్ బెడ్తడు. నడువ్ నీయమ్మ" అంటూ బలంగా దూరం తోసేసిండు రామిగాడు.

పడిపోయిన లింగమ్మను చూసి పిల్లలు గొల్లుమన్నారు. లింగమ్మ లేచి నిలబడింది.

"పోతరా! మా వుసుర్దగిలి మీరు బోతరు. దొరోడు సెప్పినట్టు సేసి పాపమెందుకు సుట్టుకుంటర్రా! మీకు పిల్లజెల్లా లేర్రా! ఎందుకుర గిట్ల సేస్తరు? " తిట్టుకుంటూ

పిల్లల్ని తీసుకొని దూరం జరిగింది లింగమ్మ.

కాళ్ళ గుదిలో వున్న బిక్షంగాడు గిలగిల్లాడుతున్నాడు. వొంగబెట్టినోళ్ళంతా అల్లాడుతున్నారు. సందుగొందులో వుండి ఆడోళ్ళు కంటతడి బెడుతున్నారు.

మస్క్యారి కొండడొచ్చి, దొరకు సలాంజేశాడు.

"జంగడు దొర్కలేదు దొర"

"వాన్ని పట్టుక రాకబోతే నీ బొక్కలిర్గుతయ్" పాన్ వుమ్మేస్తూ అన్నాడు దొర. కొండడు వంగి సలాంజేసి దూరం జరిగాడు.

పటేల్ పాపిరెడ్డి లేచాడు. తలకు రుమాలు, చెవికిపోగు, చేతిలో పొన్నుకర్ర, సన్ననిమీసం, మనిషి బలంగా ఉన్నాడు.

"ఈ షావుకారు సంగతేం జేయమంటరు? " దొర నడిగాడు.

దొర పట్వారి వంకజూసి "రామారావు సాబ్ -ముసలోడి ఎకరం భూమి షావుకార్కు అప్పుకింద జమకట్టు" అన్నాడు.

రామారావు "జీసాబ్" అన్నాడు. షావుకారు దొరకు కృతజ్ఞతతో సలాం జేశాడు.

"ఈ గొల్లోన్ని యేంజేయమంటరు? " పటేల్ అడిగాడు.

"వీడ్కి మదమెక్కింది. మర్యాదగ చెప్పితె యింటడా? యిట్లనే సాయంత్రందాక వుంచుండి- వీడి మందను తోలుకొచ్చి మన మందలలో గలపండి" దొర తీర్పు జెప్పిండు.

కచేరి ముగిసింది. దొర లేవబోతుండగా- అందరూ లేచారు. దొర లోపలికి పోతే మా గతేందని- బాధపడేటోళ్ళు "దొరా! నీ కాల్మొక్త" అన్నారు ఒక్కసారిగా. వినిపించుకోకుండా దొర లేచాడు.

"నఖ్రాల్ జేస్తుండ్రు బాంచత్. నోరుదెరిస్తే... ఖబర్దార్" అన్నాడు పటేల్. అంతా నోళ్ళు మూసుకున్నారు. నిశ్శబ్దం. దొర గడిలోపలికెళ్ళబోతూ కిర్రుకిర్రుమనే నడక శబ్దం విని తిరిగి చూశాడు. అందరి చూపులు అటే మళ్లినయ్. కిర్రు చెప్పులతో ముత్తయ్య హుషారుగా పోతున్నాడు. దొర కళ్ళు పెద్దవి జేశాడు. కనుసైగజేశాడు. మస్క్యారి కొండడు ఒక్కంగలో బోయి ముత్తయ్య జుట్టందుకున్నాడు. ఒక తోపుతో అరుగుముందు పడేశాడు. తత్తరపడుతూ ముత్తయ్య తలెత్తి చూశాడు. అరుగుమీద రాక్షసుడిలా వున్న దొరనూ పక్కనున్న వాళ్ళ పరిస్థితీ చూశాడు. కొంపమునిగింది. ప్రమాద మొచ్చిందనుకున్నాడు భయంతో వణుకుతూ.

"సర్కార్ ముజేమాఫ్ కరో..." చేతులు జోడించి దండంబెట్టాడు.

"ఓరేయ్ రామిగా! యీ గాడిద కొడుకు కండ్లకావరం దించు. దొరంటేందో చూపించు" అన్నాడు దొర. రామిగాడు సందేహిస్తూ చింత బరికె అందుకుని ఎడాపెడా ముత్తయ్యను కొడుతున్నాడు. ముత్తయ్య లబో దిబోమంటూ పొర్లాడుతున్నాడు. దొరకు దండంపెడుతున్నాడు. కనికరించమని, దయదలచమని వేడుకుంటున్నాడు. ముత్తయ్య అలా బాధతో వుంటే పక్కన కూర్చున్న పటేల్,

"మదమెక్కితే చిన్న-పెద్ద కనబడ్తదిరా? " అన్నాడు.

"కిర్కు చెప్పులు తొడుక్కొని దొర ముందుగా నడుస్తవా? వొళ్ళు కొవ్వెక్కితే గిట్లనే అయితది" అన్నాడు షావుకారు.

"నాకెర్కలేదు నీకాల్మొక్త. తెల్వకజేస్ని దొ..!" ముత్తయ్య వణుకుతూ అన్నాడు.

చింతబరికె నుగ్గయ్యింది. రామిగాడు దీనంగా దొరవంక జూసిండు.

"ఓర్నీయమ్మ! యేందిరగట్ల చూస్తవ్? అలిసిపోయినవా? జాలికలిగిందా? బద్మాష్ముండాకొడక కానీ" హుకుం జేసిండు దొర.

"దొరా! వాడు రామిగాడి కాబోయే

అల్లుడు! నీకాల్మొక్తా” లచ్చుంగాడు వినయంగా చెప్పిండు.

“అరే లమ్డీకొడక! అసలు సంగతదా!... పటేల్ సాబ్... ముందు యీ బద్మాష్ సంగతి చూడు. అల్లుడని జాలిజూపుతున్నడు” దొర అన్నాడు.

పొన్నుకర్రతో పటేల్ రామిగాడి వీపు చితకగొట్టాడు. అలిసిపోయి, “యిప్పుడు గానీ- దొర వద్దనేవరకు వీడ్ని చితగ్గొట్టాలె. తీస్కో బరిగే” అన్నాడు పటేల్. రామిగాడు బరిగె తీసుకున్నాడు. కళ్ళు మూసుకొని ముత్తయ్యను బాదుతున్నాడు. చాలన్నట్లు దొర సైగజేసిండు. “లమ్డీకొడుక్కు. గుండుకొట్టించి -బొట్లు బెట్టి వదిలిపెట్టండి” అన్నాడు

“ఎప్పట్కీ గుర్తుంటది” అన్నాడు పటేల్.

★ ★ ★

ఆ ఊరు రామారం. వూరంతా దొరదే. వందలెకరాల భూములు, తోటలు, వందల కొద్ది జీవాలున్నయ్. పదిమంది ధనిక రైతులు, పటేండ్లున్నారు. నలుగురైదుగురు షావుకార్లున్నారు. మిగతా జనమంతా బీద రైతులు, కూలీలు, కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, గీత, నేత, గొల్లలు. అందరూ దొరకు, పటేండ్లకు వెట్టి జేస్తారు. వంతుల వారీగా వూడిగం జేస్తారు. కావలసినవన్నీ యిస్తారు. అది హక్కుగా అమలు జరుగుతున్నది. దొర చెప్పిందే న్యాయం. ఆయన మాటకు తిరుగులేదు.

దొర పేరు భాస్కరరావు- సర్కారు బిరుదుంది. ఆయనకిద్దరు భార్యలు. పెద్ద భార్య జానకమ్మ, చిన్న భార్య సుభద్రమ్మ. వాళ్ళను పేరుతో ఎవ్వరూ పిలవరు. పెద్దొరసాని చిన్నదొర్సాని అంటారు. పెద్దొరసాని గయ్యాళి. పిల్లల్లేరు. ఎత్తు- పొడవు, చామనచాయ, మధ్యవయస్సు, అందంగా ఉంటుంది. గడి లోపల పెత్తనమంతా ఆమెదే. దొర ఆమె మాట కాదనడు. నౌకర్లను, వెట్టి చేసేవాళ్లను బాధలు పెడుతుంటుంది! పనిలేకపోతే- బర్రెల్ని కడిగిస్తుంది. కట్టెలు కొట్టిస్తుంది. నీళ్ళు మోయిస్తుంది. గోడలు అలకమంటుంది. తప్పులుబట్టి తిప్పలు బెడుతుంది. శిక్షలు వేస్తుంది. ఆలు మగల తగాదాలు, అక్రమ సంబంధాలు, తిట్టుకున్నా, కొట్టుకున్నా- తీర్పు చెప్పేదామే. ఏదోరకంగా శిక్షలు వేస్తుంది. జుల్మానాలు వసూలు చేస్తుంది.

ఆమెకు పిల్లలు లేరని దొర రెండో పెండ్లి చేసుకోవాలనుకున్నాడు. పరాయిదొస్తే తన పెత్తనం పోతుందని తన చిన్నాయన బిడ్డనే తెచ్చి చేసింది పెద్ద భార్య జానకమ్మ. సుభద్రమ్మ అందంగా వుంటుంది. పెద్ద కళ్ళు, నిలువు ముక్కు, తెల్లని పలువరస, ఎర్రని రంగు, బక్కపలచగా వుంటుంది. ఇరవై ఏళ్ళ వయస్సు, మెత్తని మనసు. చూడముచ్చటగా వుంటుంది. ఎవరినీ నొప్పించదు. దొరసానని పెత్తనం చెలాయించదు. ఆమెను చూస్తే అందరికీ జాలేస్తుంది. పంజరంలో చిలక అనుకుంటారు. సానుభూతి చూపుతుంటారు. అరవై ఏండ్ల దొరకు పెండ్లామయ్యింది. ముద్దూ, మురిపంలేదు. ఆడబాప దప్ప పలకరించే వాళ్ళుండరు. దొరకు మనసైనప్పుడు గదిలోకి రమ్మంటాడు. రోజంతా ఆడబాపతో గడుపుతుంటుంది. లేకుంటే పుస్తకాలు చదవటం- పూలమొక్కల దగ్గర తిరగడం చేస్తుంది. పట్నం పోయినప్పుడల్లా కంసాలి శంకరయ్యా, అత్తరు, పౌడరు, పుస్తకాలు తెచ్చిపెడుతుంటాడు.

గడిలో ఎవరిదారి వాళ్ళది. దొర, పెద్దొరసాని, చిన్నదొరసాని, ఒకళ్ళ విషయం మరొకరు పట్టించుకోరు.

దొర వారానికోసారి పెద్ద గుర్రమెక్కి పట్నం వెళ్తాడు. ఒకటీ రెండు రోజులుంటాడు. విందులు, వినోదాలు, గానాబజానాతో గడిపివస్తాడు. అప్పుడప్పుడు బోగం సాన్లు వూరికొచ్చి పోతుంటారు. పండగల

ప్పుడూ, మరికొన్ని సందర్భాల్లోను దోస్తు లకు, దొర గడిలో దావతులు చేస్తుంటాడు.

గడిలో పనిచేసే నౌకర్లు చాలా మందున్నారు. పెద్దొరసానికి, చిన్నదొరసానికి ఆడబాపలున్నారు. దొరకు మంచి చెద్దలు చూడటానికి ఒక ఆడబాప ఉన్నది. వీళ్ళుగాక వంటవాళ్లు, వెట్టి చేసేవాళ్ళున్నారు. రామిగాడు, లచ్చుంగాడు దొరకు నమ్మకమైన నౌకర్లు. నీళ్లు తోడటానికి, కట్టెలు కొట్టడానికి, పాలు తీయడానికి యాదగిరి వున్నాడు. పొద్దున్నే వెట్టిచేసే ఆడ, మగ వస్తుంటారు. వాళ్ళందరిమీదా పెద్దొరసాని పెత్తనం చేస్తుంటుంది.

★ ★ ★

అర్ధరాత్రి దొడ్డిదర్వాజ కొట్టిన చప్పుడయ్యింది. టక్‌టక్‌మని మూడుసార్లు కొట్టిన శబ్దం విని పెద్దొరసాని వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా పటేల్ పాపిరెడ్డిని చూసి మూతిముడిచి, అలకతో వున్నట్లు మాట్లాడకుండ లోపలికి నడిచింది. పాపిరెడ్డి పిల్లిలా వెనక నడిచిండు.

దొరసాని తన గదిలోకిపోయి మంచం మీద కూర్చున్నది. పాపిరెడ్డి లోపలికొచ్చి పొనుగర్ర పక్కకు బెట్టిండు. రుమాలు దీసి గోడ చిలకొయ్యకు బెట్టిండు. తల నిమురుకుంటూ ఆమె వంక జూసిండు. ముసిముసిగ నవ్విండు.

"సిగ్గులేక ఎందుకు నవ్వు? " అన్నది దొరసాని.

పాపిరెడ్డి మాట్లాడలేదు. మళ్ళీ దొరసానే అన్నది.

"యియ్యాలెందుకు దారిదప్పినవ్? "

"యేంజేయమంటరు? రోజులు బాగుండ లేదు. అందరి చూపులు మనమీదనే వుంటున్నాయ్" పటేల్ అన్నాడు.

"అందుకేనా గుడిసెల్ల దూరుతున్నరు? "

"యేమిటో గమ్మత్తుగా మాట్లాడుతుండ్రు? "

"గమ్మత్తుగనే వుంటది. కర్రె రాములు గాడి పెండ్లం అంత అందంగుంటదా? "

"యెవతది? "

"యేమయ్యో! నీ బండారమంత నాకు దెల్సు... నువ్వేం జేస్తున్నవో నాకెర్కలేదనుకున్నవా? ఆ ముండకోసం ముస్కేసుకొని దాని కొంపలో దూరలేద? నువ్వు పట్టేలు వుగావచ్చు. వూరి విషయాలు నీకంటే నాకే ఎక్కువ దెల్సు. ఆవులిస్తే పేగులు లెక్క బెడ్త. నా సంగతి నీకింక తెలిసినట్లులేదు" అన్నది కొంచెం కఠినంగా.

పాపిరెడ్డి తలగోక్కుంటూ, మాట్లాడకుండ కూర్చున్నాడు.

"బెల్లంకొట్టిన రాయోలె కూర్చోక- అడిగిం దానికి చెప్పొచ్చు గదా? మంచోడివని మన సిస్తే యింత చులకనజేస్తవా? ఎందుకిట్ల జేస్తున్నవ్? " నిలదీసి అడిగింది.

"చెప్పినగద దొర్సానీ. వూర్లో అందరికి దెలిసినట్లున్నది. గుసగుసలు పెడుతున్నరు. యిప్పుడు గూడ యాదగిరిగాడు చూసిండు"

"అబ్బో! యెంత భయం. అయినా ఎవరికి దెల్వదని? నీడొంక తిరుగుడు మాటలు దప్పు? దొరకు దెల్వదా? నౌకర్లకు ఎరక లేదా? నాకు లేని భయం నీకెందుకు? కట్టు కథలెందుకు- దానిమీద మనసయ్యిందనరాదు"

"రామ! రామ! యేమిటో యియ్యాల యెట్లగో మాట్లాడుతున్నరు"

"మాటలుగాక యింకేం జేయను? నీక్కూడా లోకువైనగద? "

"ఛీ... ఛీ... యేమిటట్లంటరు? మీరంటే నాకెంత..."

"ఆ... మాయమాటలు చెప్పడం నేర్చుకున్నవ్. మాటలతో మాయజేస్తవ్? చేతలతో మురిపిస్తవ్. నిజం చెప్పు ఎందుకిట్ల నల్ల బూసైపోతున్నవ్" అనుమానంతో అన్నది.

"యేమిలేదుగాని, యియ్యాల చాలా

అందంగున్నారు? "

"అంటే ఇంతకుముందు బాగలేననే గదా''

"రామ! రామ! అన్నిటికీ గట్లంటే"

"మధ్యన ఆయనెందుకుగాని -రా" అని తలుపు మూసి, లైటు ఆర్పేసింది దొరసాని.

★ ★ ★

ఊరిబయట గూడెం గుడిసెల్లో గుడ్డి చమురుదీపాలు వెలుగుతున్నయ్. రామిగాడి గుడెసెలో విషాదం కనబడుతున్నది. బోడిగుండుతో మొగరానికానుకొని, మోకాళ్ళ మధ్య తలబెట్టుకొని కుమిలికుమిలి పోతున్నాడు ముత్తయ్య. అతనికెదురుగా గోడకానుకొని రామిగాడు కూర్చున్నాడు. పక్కన పొయ్యిదగ్గర అతని భార్య యల్లమ్మ కూర్చుని వంటజేస్తున్నది. ముత్తయ్య మరదలు రంగి తలుపుకానుకొని నేలను చూస్తూ దిగాలు పడుతున్నది.

"ముదనష్టపోడు. యింకెన్ని పాపాలు జేస్తడో? ఎన్ని పానాలు తీస్తడో? ఎంతమంది వుసురుబోసుకుంటడో? మంచిమంచోళ్ళు బోతున్నరు. యీడికెందుకు చావు రాదో? " అన్నది యల్లమ్మ.

ఎవ్వరూ మాట్లాడలేదు. మళ్లీ ఆమే అన్నది.

"అయినా ఆడ్నసేదెందుక్కు? నీకుండొద్దు. ఆ దొరోడు కొట్టమంటే గొడ్డును గొట్టినట్లు కొట్టడానికి నీకు చేతులెట్లొచ్చినయ్? అల్లుడికి మంచి మర్యాదజేస్నివ్? " కోపమంతా గిన్నెలమీద చూపింది.

రామిగాడు నిట్టూర్పు విడిచి, నిస్సహాయతను తెలుపుతూ.

"యేంజెస్త? దొరను ఎదిరించి బత్కుతమా? సూస్నివా యీ దెబ్బలు? " తన వీపు చూపుతూ అన్నాడు.

"యెంతకాలం గిట్లని? యియ్యాలిద య్యింది. రేపు నాతల నర్కమంటడు నర్కుతవా? " అడిగింది యల్లమ్మ.

"ఆ! నీతల నర్కకబోతే- నా తల బోతది. ఎవరో వోరు చావక తప్పదు గద? " రామిగాడు, అవసరమైతే తప్పదన్నట్లు అన్నాడు.

"సూడబోతే... గంత పని సేసేట్లున్నవ్. మనిషైనంక కొద్దిగనైన రోసముండాలయ్య. లేకపోతెందుక్కు? మనిషికి, పసరానికి తేడేమిటి? నీవోలెనే అందరు భయపడబట్టే దొరోడ్కి కిందమీద కనబడ్తలేదు... యేంజేస్తడు? సంపేస్తడు. గంతేగద? సద్దాం... గిట్ల బత్కేకన్న ఒక్కసారి సద్దాం" అన్నది యల్లమ్మ.

ముత్తయ్య తలెత్తలేదు. రంగి నేలమీద కాలు వేలుతో రాస్తూ, కన్నీరు పెడుతున్నది. రామిగాడు దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఆమె అనేదాంట్లో నిజమున్నదనుకుంటున్నాడు.

"సూడు! ఆ పిల్లగాడు యెట్ల బాధపడుతున్నాడో! చుట్టపుసూపు కొస్తె- అల్లుడికిట్ల య్యిందా? " అన్నది యల్లమ్మ వంట పూర్తిజేసి లేస్తూ.

"లేయ్యా! ఈ కొంపల్లగింతే! మా బత్కులేగింత? లే... లేసి కొద్దిగా ఎంగిలిపడు" అన్నది యల్లమ్మ ముత్తయ్యను బతిమాలుతూ.

ముత్తయ్య మరింత బాధపడుతున్నాడు. అతన్ని చూసి రంగి కంట తడిబెడుతున్నది.

"లే! ముత్తయ్య. పట్నంల పెరిగినోడివి? నువ్వొస్తున్నవని ఆ పిచ్చిదెంతో సంబరపడ్డది. తీరా వస్తే... అంత మా ఖర్మ... లే అయ్యా!నా మాటినిలే" అన్నది.

రామిగాడు లేచి ముత్తయ్య చేతులు బట్టుకొని లేవదీస్తూ,

"లే ముత్తయ్య. నువ్వు బాధపడ్తే మాకు బాదయితది! యియన్నీ మాకు మామూలైనయ్. యేంజేస్తం? మా రాతలు గిట్లనే వున్నయ్. నువ్వు బాధపడకు" అన్నాడు.

"అబ్బో! యిప్పుడు ప్రేమ బుట్టుకొచ్చింది! గప్పుడేమైనది? " యల్లమ్మ వెటకారంగా

అంది.

రామిగాడికి ఎక్కడలేని కోపమొచ్చింది. అసలే కుమిలిపోతుంటే మాటలతో చంపేస్తుందనుకున్నాడు.

"ఓ సేయ్! నీయమ్మ నువ్వు నోర్మూసుకుంటవా? నాక్కోప మొచ్చిందంటే నీయమ్మ..."

"దానికేం తక్కువ? నీకోపం తాపమంత గిక్కడే! ఆ దొరోన్ని జూస్తె వన్కుడు బుడ్తది" అన్నది యల్లమ్మ.

"ఇందాకట్నుంచి చూస్తున్న! యేందే? నోటికొచ్చినట్లు గూస్తున్నావ్? నీయమ్మ. యింకొక్క మాటన్నవో జాగర్త" కోపంతో అన్నాడు రామిగాడు.

అతనికోపం దెలుసు. అతని మనసు దెలుసు. అందుకే యల్లమ్మ శాంతింపజేయడానికి, ముసిముసిగా నవ్వుతూ అన్నది.

"ఆ! సంబరం సాల్లని! అల్లున్ని లేపు! ఎప్పుడు తిన్నడో ఏమో?" అన్నది. రామిగాడు బతిమాలుతూ బలవంతంగా ముత్తయ్యను చేతులు బట్టుకొని లేపిండు.

"బావకు నీళ్లియ్యమ్మా! కాళ్ళు చేతులు కడుక్కుంటడు" బిడ్డకు చెప్పింది యల్లమ్మ. రంగి, ఆనందంలో గబగబా వెళ్ళి పెద్ద చెంబుతో నీళ్లు దెచ్చి, సిగ్గుతో బావకు అందించింది. అంతకంటే ఎక్కువ సిగ్గుతో ముత్తయ్య చెంబందుకున్నాడు.

★ ★ ★

పొద్దున్నే - యెవరిపనులమీద వాళ్ళు పోతున్నారు. పిల్లలు ఆవులు, బర్రెలు తోలుకుపోతున్నారు. ఆడోళ్ళు వాకిల్లూడ్చుతున్నారు. ఇంట్లోనుండి చీపురు పట్టుకొని బయటికొచ్చింది లచ్చుమమ్మ. 20 ఏండ్ల వయస్సుంటది. అందంగున్నది. చీర మోకాళ్ళ దాకున్నది. చీర కొంగు బొడ్లో దోపుకొని కూనిరాగందీస్తూ వాకిలూడ్చుతున్నది. దారిన పోయేటోళ్ళను ఆప్యాయంగా పలకరిస్తున్నది. యెదురింట్లోనుండి నిద్ర కళ్ళు నలుపుకుంటూ బయటికొచ్చాడు తిర్పతయ్య. నిక్కరు, బనియన్, వేసుకున్నాడు. గిర్దావర్ క్రాపు చేసుకున్నాడు. గడ్డంమీసం మొలవలేదు. 15 ఏండ్ల వయస్సుంటది. లచ్చుమమ్మను చూసి పళ్లికిలించాడు. నడుం వంచి వాకిలూడ్చుతున్న ఆమె అందాన్ని చూస్తున్నాడు. కన్నుగీటుతూ, వెకిలి చేష్టలతో లచ్చుమమ్మను వేధిస్తున్నాడు. ఆమె వెనకాలే నడుస్తూ కొంగు లాగుతున్నాడు. లచ్చుమమ్మ వద్దంటున్నది, తప్పంటున్నది చీపురుతో కొట్టబోతున్నది. తిర్పతయ్య దూరంగా పోయి మళ్లొస్తున్నాడు. లచ్చుమమ్మ విసుగుతో:

"ఓరేయ్ తిర్పతయ్య! నీ తాట వలుస్త! అమ్మో! తిక్కలాయనకు యెక్కువయ్యింది" అన్నది తన పని చేసుకుంటూ.

తిరుపతయ్య చటుక్కున కొంగులాగి దూరంగా బోయిండు. లచ్చుమమ్మకు కోపమొచ్చింది.

చీపిరి చూపుతూ అన్నది, "నాక్కోపమొచ్చిందంటే సూడు. బారెడు పొద్దెక్కింది. పనిజేసుకోకుండా యేందిర నీ పరిహాసకం?"

మంగలి పిచ్చయ్య పొదిసంకనేసుకొని ఆదరాబాదరబోతున్నాడు. అతన్ని జూసి లచ్చుమమ్మన్నది. "సూడు పిచ్చయ్య మామా! యీ తిక్కలోడు పనిజేసుకోకుండా చిలిపి పనులు జేస్తున్నడు"

"అత్తవుగద! సర్సమాడుతుండు... యేందిర తిర్పతయ్యా అత్తని ఆడిస్తున్నవా? మీ అయ్య గడికి బోయిండురా?" అడిగిండు పిచ్చయ్య.

పిచ్చయ్య గొంతు విని లోపలినుండె:

"యెవరు పిచ్చయ్య బావా? వస్తున్న వుండు" అంటూ దుప్పటి కప్పుకొని నీరసంతో బయటికొచ్చిండు చాకలి నారయ్య.

"నువ్వింక గడికి బోలేదే! పొద్దుబోయింది. అగ్గిమీద గుగ్గిలమయితుంటది పెద్దొరసాని" పిచ్చయ్య అన్నాడు.

“రాతిరినుండి ఒకటే జరం. పానం బాగ లేదు. గడికి బట్టలు తీస్కపోలేదు. యెట్లనో? యేమో?”

“మరి గీన్ని బంపరాదే! సిన్నపిల్లగాడా? పెండ్లీడుకొచ్చిండు” తిర్పతయ్యను చూస్తూ అన్నాడు పిచ్చయ్య.

“గప్పుడు కుదుర్తది యీ తిక్కలాయన తిక్క. పంపే నారయ్యన్నా!” లచ్చుమమ్మ అన్నది.

“అసలే తిక్కలోడు. పెద్దొరసాని సంగతి దెల్వుగద! యీడే పిచ్చి పనులు జేస్తడో?



ఢే. ప్రమాదం దెచ్చుకుంటడోనని భయం!" నారయ్య అన్నాడు.

"మరెట్లనే! నాలుగు రోజులుబోతే అదే అలవాటైతది" పిచ్చయ్య చెప్పిండు.

"నిజమే! యేందిర తిర్పతయ్య- మామతో పోతావుర గడికి! లేకపోతే పానంమీదికొస్తది... బట్టలమూట దెచ్చిస్తవుండు" అని లోపలికెళ్ళిండు.

మూట తీసుకొని బయటికొచ్చిండు



నారయ్య.

తిర్పతయ్య భయపడుతూ దూరంగా నిల బడ్డాడు. తల గోక్కుంటూ అయిష్టంగా ఉన్నాడు.

"యినబడ్తలేదుర! అయ్య బిలుస్తుంటే- మూట దీస్కొని నడువు" గద్దించి అన్నాడు పిచ్చయ్య. తప్పదన్నట్లు వచ్చి బట్టల మూట చంకకేసుకున్నాడు తిర్పతయ్య.

"పిచ్చయ్య మామా ఈన్ని కాస్త జాగర్తగ సూడు. నోర్లేనోడు"

"గట్లనే... రారా తిర్పతయ్య" అని పిచ్చయ్య దబదబ నడుస్తున్నాడు. తిర్ప తయ్య అతని వెనకాలబోతున్నాడు. ,గడి దగ్గరికొచ్చింది. తిర్పతయ్యకు గడిలో ఎట్లుం డాలో చెప్పుతున్నాడు పిచ్చయ్య.

"పిచ్చి పనులుజేయకు. చెప్పింది జేయ్. గడికి పోయేటప్పుడు చెప్పులుండకూడదు. తలకు గుడ్డచుట్టుకోవాలె. తల దించుకొని, చేతులు కట్టుకొని అనిగిమనిగుండాలి" తిర్ప తయ్య సరేనన్నట్లు తలూపుతున్నాడు.

"ఇగో... ఇది దిడ్డి దర్వాజ. ఇక్కడ్నుండే పోవాలె. పెద్దొరసాని చెప్పిన పనులు జెయ్యాలి" ఏమి పనులు అని సైగతో అడి గిండు తిర్పతయ్య.

"బట్టలుతకాలె. కాళ్ళు పిసకాలె. పక్కలె య్యాలే. తానానికి నీళ్ల దోడాలె... యింకేం జెప్పితే గయ్ జెయ్యాలే... మంచిగజెయ్యి" అన్నాడు.

ఆలస్యమయ్యిందన్న భయంతో గడిలోపలికి అడుగుబెట్టాడు పిచ్చయ్య. తిర్ప తయ్య పులి బోనులోకి బోతున్నట్లున్నడు.

లోపల పూల మొక్కల దగ్గర వాంతిజేసు కుంటున్నది చిన్దొరసాని. అది చూసి పెద్దొ రసాని మండిపడుతున్నది.

"కక్కింది చాలు. యిక లోపలికిపో! పనోళ్ళు చూస్తే పరువుబోతది"

"యేమి తప్పు జేసిన పరువుబోవడానికి? ' కొంగుతో మూతి తుడుచుకుంటూ అడి గింది చిన్నదొరసాని.

అది దూరం నుండి గమనించిన పిచ్చయ్య, తిర్పతయ్య చేయిబట్టుకొని పక్కకు లాగాడు. ఇద్దరూ చప్పుడుగాకుండా గోడచాటున నిలబడ్డారు.

"నీ వాంతులు చూసి యేవి ళ్ళనుకుంటరు. జనానికేం దెలుసు? నువ్వు తిన్నది అరక్క కక్కుతున్నవని? " పెద్దొర సాని దెప్పిపొడిచింది. చిన్దొరసానికి కోప మొచ్చింది.

"నువ్వు గన్నవుగదా పదిమందిని చాలదా? "

"నేను కంటే నిన్నెందుకు దెచ్చేదాన్నే? నాకా అదృష్టం లేకనే నువ్వన్నా కంటవని సవతిని జేసుకున్న"

"సూటిపోటి మాటలతో ఎందుకిట్ల జంపు తవ్. పిల్లలు పుట్టకపోతే నా తప్పా? నీకెం దుకు కలగలేదో నాకందుకే! యిష్టమొచ్చి నట్లు అంటే పడుండటానికి నీ పనిమ నిషినికాను" అన్నది చిన్దొరసాని సుభద్రమ్మ కఠినంగా. ఇంతకు మునుపెప్పుడు పెద్దొర సాన్ని అట్ల ఎదిరించి అనలేదు.

"ఇప్పుడేమన్న నిన్ను? నోటికొచ్చినట్లు కూస్తున్నవ్? " నిలదీసి అడిగింది పెద్దొర సాని.

"నాకు నోరుంటే యిట్లెందుకుంట? నా బతుకెందుకిట్లయితది? "

"ఏమయ్యిందే నీకు? యేమి తక్కువ య్యింది? "

"అది నీకు తెలుసు... నాకు తెలుసు"

"ఏమిటే తెలిసేది? వొళ్లు పొగరెక్కి మాటకు మాటంటున్నావ్! మర్యాద లేకుండా నిన్నేంజేయమన్న? బరువులు మోయమన్ననా? బాధలు పడమన్ననా? తినమన్న, బిడ్డలకనమన్న. దానికింత రాద్ధాంత మెందుకు? "

వాదన చెయ్యడానికి చిన్దొరసానికి యిష్టం లేనట్లున్నది కోపం దిగమింగుతూ లోపలికె ళ్లింది. అది గమనించి పిచ్చయ్య, తిరపత య్యను దీసుకొని లోపలికి నడిచిండు.

# ఏరిన ముత్యాలు

1. ముందు వాస్తవాలేమిటో తెలుసుకో ఆ తరువాత నీ చిత్తం వచ్చినట్టుగా వక్రీకరించు.

-మార్క్ట్వేన్

2. ఈ ప్రపంచమనే ఉద్గ్రంథాన్ని మీరు తీవ్రంగా అధ్యయనం చేయాలి. మళ్లీమళ్లీ చదవాలి. దాన్నంతా కంఠస్థం చేయాలి. దాని శైలిని అర్థం చేసుకుని మీ సొంతం చేసుకోవాలి.

-లార్డ్ చెస్టర్‌ఫీల్డ్

3. సాహసం చేస్తే ఒక ప్రణాళిక ప్రకారం చేయాలి. అంతేకాని దూకుడుగా చేయకూడదు.

-జార్జ్ ఎం.పాటన్

4. పద్యముగాని, వచనముగాని నేనొకసారియే రాయుచుందును. రాసిన దానిని మరల దిద్ది రాయుట నాకు అలవాటులేదు.

-వీరేశలింగం స్వీయచరిత్ర

5. శాస్త్రీయ దృక్పథంలేని మతం గుడ్డిది.

-ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

6. అస్పృశ్యత మన సనాతన ధర్మానికి సంబంధించినదికాదు. ఇది మన జాతీయ సామర్థ్యాన్ని నాశనం చేసింది.

-స్వామివివేకానంద

7. నన్ను తాకకు అనేది మానసికమైన జబ్బు.

-స్వామివివేకానంద

8. శైలి అనగా గ్రాంధిక భాషలోగాని, గ్రామ్య భాషలోగాని లిఖించుట కాదు, నూతన భావాలను వెల్లడించుటకూడా శైలి అవుతుంది.

-చార్లెస్ మురేష్

9. రచించడం వలనే నీవు రచించడం నేర్చుకొంటావు.

-జాన్సన్

10. రచయిత కాదలుచుకున్న ప్రతివ్యక్తి ముందు ఉత్తమ పాఠకుడు కావాలి.

-బ్రైడన్

11. రచయితలు సదా తమ రచనా నైపుణ్యాన్ని, విధానాన్ని, పద్ధతిని అభివృద్ధి పరుచుకుంటూ ఉండాలి. నైపుణ్యం అనేది లేనిదే చివరకు చెప్పులు కూడా కుట్టలేరుకదా!

-గోర్కీ

సేకరణ:
జక్కల భరత్

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాస నకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూలై చతుర నవల బందూక్

..............................................................

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా : ..............................................................

..............................................................

..............................................................

..............................................................

పెద్దొరసాని చూసింది.

"యేందిరా! తెల్లారిందా! నవాబొచ్చినట్లొచ్చినవ్! యియ్యాల నీలగ్గమైతది వుండు. దొర కోపంగున్నడు పో. ఈడెవుడు? "

తిరపతయ్యను చూసి అడిగింది పెద్దొర సాని.

"చాకలి నారిగాడికొడుకు నీకాల్మొక్త. ఆడికి జరమొచ్చింది, యీడ్ని బంపిండు" వినయంగా వొంగి అన్నాడు పిచ్చయ్య. పిచ్చయ్యను అనుసరిస్తూ తిరపతయ్య దొర్సానికి దండంబెట్టాడు.

"ఊఁ వెళ్లండి" ఆజ్ఞాపించింది దొరసాని.

పిచ్చయ్య, తిరపతయ్య గబగబా లోపలికి వెళ్లారు.



ఎండ మండిపోతున్నది. వందలమంది స్త్రీలు దొర వరిపొలంలో నాట్లేస్తున్నారు. మగోళ్లు నారు అందిస్తున్నారు. రామిగాడు, లచ్చిగాడు, యాదగిరి అక్కడక్కడ గట్ల మీద నిలబడి కాపలా కాస్తున్నారు. పటేల్ పాపిరెడ్డి బావిగడ్డమీద చెట్టుకింద మంచమ్మీద కూర్చున్నాడు. నాట్లేసే స్త్రీల పసిపిల్లలు గట్టుపక్కన చెట్లకింద వదిలేసి వున్నారు. కొందరు పిల్లల్ని చీరతో వుయ్యాలలో వేశారు. పిల్లలు ఏడుస్తున్నారు. నాట్లేసే తల్లుల మనస్సంతా పిల్లలమీదనే వున్నది.

లచ్చుమమ్మ వారాలు తిరగని బిడ్డను గట్టుపక్క నొదిలేసి వచ్చింది. బిడ్డ ఏడ్పు విన్నది. కాలువ దగ్గర చేతులు కడుక్కొని పాలివ్వడానికి మునుములలో నుండి బయటికొస్తున్నది. గట్టుమీద నిలబడ్డ యాదగిరి చూసి అటకాయించాడు.

"యాడికి గట్ల బోతున్నవ్? "

"బిడ్డేడుస్తున్నది పాలిచ్చొస్తన్న" అన్నది లచ్చుమమ్మ.

"పాల్లేవ్ గీల్లేవ్. మునుములోకి నడువ్" అన్నాడు యాదగిరి కర్ర అడ్డం బెడుతు.

"నీకాల్మొక్తన్న పసిబిడ్డ. ఎండకు నోరెండిపోతది. యేడుస్తున్నదన్న" దండం బెట్టిందామె. యాదగిరి అటుయిటు చూసి,

"జల్ది నడువ్. దబ్బున్రా! పటేల్‌సూస్తే నీ పని నా పని అయితది" అన్నాడు కర్ర అడ్డం దీస్తూ.

చీరకొంగుతో చేతులు తుడుచుకుంటూ వరమ్మీద వడివడిగా నడుస్తున్నది. గడ్డమీదున్న పటేల్ కంటబడింది.

"యాడికిరా ఆ ముండబోతుంది? " బిగ్గరగా అరిసిండు.

"పిల్లకు పాలియ్యడాన్కి పటేలా" అంతే బిగ్గరగా చెప్పిండు యాదగిరి.

"దొంగముండలు యిప్పుడొచ్చింద్రు గప్పుడే షురూసేసింద్రా! అరేయ్ లచ్చిగా! ఆ ముండనెనక్కుదోలు" పటేలన్నడు.

లచ్చిగాడు అడ్డు తగిలిండు.

"నీకు దండంబెడ్తనే. పోరి సచ్చిపోద్ది. పున్యముంటదే లచ్చుమన్న. గిట్లబోయి గట్లొస్త" అన్నది.

"నన్నేం జేయమంటవ్. పటేల్ అన్నది యినబడలేద! నిన్నొదిల్తే నన్ను దంతడు"

"సూడన్న... ఆ పోరెట్లేడుస్తున్నదో! నీకు దండం బెడ్తనే"

"నీయమ్మ! నేనేం జేయనే" నిస్సహాయతను దెలిపిండు లచ్చిగాడు.

"యేందిర? అదేందో నఖ్రాల్ జేస్తున్నది. గట్లజెప్పితే యింటదా? " అని పొన్నుగర్ర దీసుకొని బిరబిర వస్తున్నాడు పటేల్.

"పోవే! మునుములోకిపో. పటేలొస్తుండు. వొళ్లంత వాయగొడ్తడు. అయిటంక నీ యిష్టం" లచ్చుంగాడన్నడు.

పాపిరెడ్డి రానేవచ్చాడు. బూతులు తిడుతూ కర్రతో లచ్చుమమ్మ పిర్రలమీద ఆ పక్క యీ పక్క వేశాడు. దెబ్బల బాధకన్న బిడ్డ ఏడుపు భరించలేకపోతున్నది లచ్చుమమ్మ. పటేల్ పాదాలమీదపడింది.

"పటేలా! కాల్మొక్త పటేలా, నీ బాంచన్. దినాలు నిండని పోరి. పానంబోతది. పాలిచ్చి జల్దొస్త"

"నీయమ్మ... నువు సచ్చినా బోనియ్యను. యెనక్కినడువ్... నీయమ్మ" కాలుతో తన్నిండు.

వరమ్మీదినుండి బురదపొలంలో పడింది లచ్చుమమ్మ. లేచి నిలబడ్డది. చేతులు జోడించింది.

"అటు యినుండి పటేలా! పోరెట్ల యేడుస్తున్నదో! సచ్చిపోతది పటేలా, నీ కాల్మొక్త, పున్యముంటది. నీ గులాపుదాన్ని కనికరించుండి" అన్నది.

"ఆ పోరికి పాలు తక్కువైనయో! నీ దగ్గర పాలెక్కువైనయో సూస్త. నిన్ను జూసి గాళ్లంత గిట్లనే సేయకుండజేస్త... ఓరేయ్ లచ్చుంగా... ఒక మోదుగాకు దొప్పకట్టి తేరా? " అన్నాడు.

"దండంబెడ్త పటేలా. అట్లబోయ్, గిట్లొస్త పటేలా? " ప్రాధేయపడుతున్నది లచ్చుమమ్మ.

లచ్చుంగాడు మోదుగాకు దొప్ప తెచ్చిండు. అది తీసుకొని పాపిరెడ్డి లచ్చుమమ్మకిస్తూ, "ఈ దొప్పలో నీ దగ్గరెన్ని పాలున్నయో పిండు. లచ్చుంగాడు తీస్కపోయి ఆ పోరినోట్లో బోస్తడు" అన్నాడు. లచ్చుమమ్మ నివ్వెరబోయింది. లచ్చుంగాడు అయ్యో పాపమనుకున్నాడు. ఆలస్యమైతే బిడ్డ పానం బోతది, తప్పదనుకున్నది లచ్చుమమ్మ. దొప్ప తీసుకొని వరమ్మీద దూరం జరిగి తిరిగి కూర్చుంది. కంట తడిబెడుతూ దొప్పలో చనుబాలు పిండుతున్నది. యీ ఘోరం యాదగిరి చూస్తున్నాడు. నాట్లేసే స్త్రీలందరు నడుములెత్తి నిలబడి కనివినీ ఎరగని ఘోరం చూస్తూ కంటతడి బెడుతున్నారు. మనసులోనే శాపనార్థాలు బెడుతున్నారు. దొప్పలో నుండి పాలు బొట్లుబొట్లుగా రాలుతున్నాయి. వాటితోపాటు ఆమె కన్నీరు చుక్కలు రాలుతున్నయ్. పాలన్నీ కారిపోతయెమోనని బిరబిరా వచ్చి పటేల్ చేతికందించబోయింది.

"అరే లచ్చుంగా ఇది తీస్కపోయి ఆ పోరినోట్లో పొయ్యి" అన్నాడు పటేల్. లచ్చుంగాడు, లచ్చుమమ్మ చేతిలోనుండి పాలదొప్పతీసుకొని పోతున్నాడు. లచ్చుమమ్మ దుఃఖంతో,

"లచ్చుమన్నా- నెమ్మదిగా తాపే... పొరబోతే పానంబోద్ది సచ్చి నీ కడుపున బుడ్త, పున్నెముంటదే" అన్నది. అతని వైపే చూస్తూ నిలబడ్డది. ఆమె దృష్టంతా బిడ్డమీదనే వున్నది.

లచ్చుమమ్మ కొంగుజారింది. ముడివేయని రవికను గమనించలేదు. ఎదురుగనిలబడ్డ లచ్చుమమ్మ రవికెలోపలి అందాన్ని చూస్తున్నాడు పటేల్. రెప్పార్పకుండా చూస్తు, గుటకలేస్తున్నాడు. లచ్చుమమ్మ అది గమనించలేదు. పక్కనున్న యాదగిరి పటేలు చూపుల్ని పసిగట్టిండు. అతని కళ్ల ముందునుండి లచ్చుమమ్మను తప్పించాలనుకున్నాడు.

"యేందే! యింక గట్ల జూస్తున్నావ్. నడువ్ మునుములోపలికి" అన్నాడు యాదగిరి బిగ్గరగా. పటేల్ తేరుకున్నాడు. యాదగిరి లచ్చుమమ్మను మరోసారి హెచ్చరించిండు. లచ్చుంగాడు బిడ్డనోట్లో నెమ్మదిగా పాలు బోసిండు. బిడ్డ గొంతు తడిసింది. ఏడుపుమానింది.

లచ్చుమమ్మ మునుపువైపు మళ్లింది. ఒక్కొక్క అడుగు ముందుకేస్తున్నది. కానీ

ఆమె చూపులు మాత్రం వెనకకు బిడ్డవైపు చూస్తున్నాయ్. బురద పొలంలో ఆమె అడుగులు బరువుగా పడుతున్నాయ్.

పటేల్ నిలబడ్డ స్త్రీలను జూశాడు.

"ఓసేయ్... మీరేందే సోద్యం జూస్తున్నారు. నీయమ్మ. నడుముల్లేపింద్రంటే బొక్కలిర్గుతయ్" బిగ్గరగా అరిచాడు.

అందరు నడుము లొంచారు. లచ్చుమమ్మ పోయి మునుములో కలిసి నడుము వంచింది. నాటు నాటుకు ఆమె కన్నీరు చుక్కలుగా రాలుతున్నది. నాట్లేసే స్త్రీలు పాటందుకున్నారు.

రాగి చెట్టెక్కేవు రాగాకు దెంచేవు
రాలిపోతవు ముండకొడుకో నారయ్యా
ఈత చెట్టెక్కేవు ఈతాకు దెంచేవు
ఇరిగిపోతవు ముండకొడుకో నారయ్యా
తాటి చెట్టెక్కేవు తాటాకు దెంచేవు
తరిగిపోతవు ముండకొడుకో నారయ్యా
వేప చెట్టెక్కేవు వేపాకు దెంచేవు
వొరిగిపోతవు ముండకొడుకో నారయ్యా
మర్రి చెట్టెక్కేవు మర్రాకు దెంచేవు
మాడిపోతవు ముండకొడుకో నారయ్యా
చింత చెట్టెక్కేవు చింతాకు దెంచేవు
చిరిగిపోతవు ముండకొడుకో నారయ్యా
మా వుసురు గొట్టుకొని నీ ఆలిపిల్లలు
మాయమైతరు ముండకొడుకో నారయ్యా

★ ★ ★

ఆ ఊర్లో సర్కారు బడిలేదు. లేకలేక ఒక ఖాన్గీబడి పెట్టారు. రెడ్ల పిల్లలు, షావుకార్ల పిల్లలు చదువుకుంటున్నారు. దూదేకుల దస్తగిరి చదువు చెప్పుతున్నాడు. ముస్లిమైనా అందులో దూదేకులోళ్లవి పేదోళ్లవి నాలుగైదు ఇండ్లున్నాయ్. దూది పని చేస్తుంటారు. అది లేనప్పుడు బీడీలు చుట్టి అమ్ముకుంటారు. దస్తగిరి కూడా అదే పని జేశాడు. అతనికి ఉర్దూ, తెలుగు భాష లొచ్చు. ఉర్దూకంటే తెలుగు బాగావచ్చు. కందపద్యాలు, సీసపద్యాలు, రామాయణం, భారతం చదివాడు. శతకాలన్నీ కంఠస్తం జేశాడు. ఇప్పుడు బడి పంతులయ్యాడు. పిల్లలకు నెలకొక రూపాయ తీసుకుంటాడు. లేకపోతే పంటలప్పుడు కల్లంకాడ ధాన్యం తీసుకుంటాడు. అతనికి ఉర్దూభాష పెద్దగా రాకపోయినా అది రాజభాష, మాతృభాష అని మోజెక్కువ.

ఊరిమధ్య తాటాకుల కొట్టంలో బడి ఉన్నది. చెక్కపలకలు, బలపాలు, శతకాలు తీసుకొని పొద్దున్నే పిల్లలొస్తారు. మధ్యాహ్నం అన్నానికి కొద్దిసేపు వదిలిపెడ్తాడు. సాయంత్రందాకా బడుంటుంది. పొద్దున్నే రాగానే ఇసుకలో గుణింతాలు దిద్దిస్తాడు. పిల్లలంతా పెద్దగా అరుస్తూ గుణింతాలు చెప్పుతుంటారు. తర్వాత కొందరికి అఆలు, కొందరికి లెక్కలు, కొందరికి శతకాలు చెప్పుతుంటాడు. మూడువైపుల మట్టి అరుగులమీద పిల్లలు కూర్చుంటారు. ఇంకోవైపు పెద్ద అరుగుమీద ఈత చాపేసుకొని దస్తగిరి పంతులు కూర్చుంటాడు. పక్కన చింతబరిసెలు పెట్టుకుంటాడు. కోపమొచ్చినప్పుడు, అల్లరిచేసినప్పుడు, చెప్పింది వొప్పజెప్పనప్పుడు వాళ్ల వీపులను చిట్లగొడుతుంటాడు. అలిసిపోయినప్పుడు అరుగుమీద గురకబెట్టి నిద్రబోతాడు. తీరికగా వున్నప్పుడు బీడీలు చుట్టుతుంటాడు.

పంతులంటే పిల్లలకు భయం. రకరకాల శిక్షలు వేస్తుంటాడు. చెవులు పిండడం, తొడపాశం పెట్టడం, గుంజీలు తీయించడం, గోడకుర్చీ వేయించడం, పెద్ద శిక్షయితే కోదండ మెక్కించడం చేస్తాడు. అతన్ని చూస్తే పిల్లలకు యముణ్ణి చూసినట్లుంటుంది. నిద్రలో కూడా కలవరిస్తుంటారు. పంతులొస్తున్నాడంటే అల్లరిజేసే పిల్లలు నోరు మూసుకుంటారు. పదిహేను రోజుల కోసారి ఏకాదశి రోజున శలవుంటుంది. పండుగలప్పుడు ఒకటి రెండు రోజులు శల

వులుంటయ్. ఏకాదశి ఎప్పుడొస్తుందోనని పిల్లలు ఎదురు చూస్తుంటారు. పంతులు వూరికి పోతే, జ్వరమొస్తే సెలవుంటుంది. అటువంటిది జరగాలనుకుంటారు పిల్లలు.

పత్రాలు రాయించుకోవడానికి లెక్కలు చూయించుకోవడానికి, వుత్తరాలు చదివించు కోవడానికి వూర్లో వాళ్లు పంతులు దగ్గరికొస్తుంటారు. గ్రామ పెద్దలు పంతులుతో కాలక్షేపం చేయడానికొస్తుంటారు. వచ్చి గంటలతరబడి లోకాభిరామాయణం మాట్లాడుకుంటుంటారు. అలాంటోళ్లున్నప్పుడు పిల్లలకు దెబ్బలు తప్పుతయ్. మాట ల్లోబడి పిల్లల గురించి పట్టించుకోడు పంతులు.

షావుకారు వెంకయ్య వచ్చాడు. అతన్ని జూసి రామిరెడ్డి పటేలొచ్చాడు. వాళ్లిద్దర్నీ జూసి మరికొందరొచ్చారు. వెంకయ్య, రామిరెడ్డి పంతులు పక్కన అరుగుమీదా, తక్కిన వాళ్లు దూరంగా కిందా కూర్చున్నారు.

పంతులు వెనక గోడకు నిజాం నవాబు బొమ్మున్నది. ఆ బొమ్మలో నిజాం నవాబు రెండుకళ్లల్లో ఒకదాంట్లో హిందువు మరో దాంట్లో ముస్లిం బొమ్మలున్నయ్. దాన్ని ఎగాదిగా చూసి షావుకారు వెంకయ్య అడిగాడు.

"యేంది మౌలిసాబ్! రాజుగారి కండ్లల్ల మనుషుల బొమ్మలేసింద్రు? "

"రాజుగార్కి హిందువులు- ముస్లింలు సమానమని, రెండు కండ్లలాంటోళ్లని అర్థం' ' చెప్పాడు పంతులు.

"నిజమే" షావుకారు వెంకయ్య తలూపుతూ అన్నాడు.

"చదువుకునే పోరగాళ్లంతా సంగం బెట్టింద్రట. గదేంది పంతులు? " రామిరెడ్డి అడిగాడు.

"సర్కార్‌మీద సవాల్ జేస్తుంద్రట. రాజొద్దు, నిజాం రాజ్యమొద్దంటున్నరట? నిజమేనా? " వెంకయ్య ప్రశ్న.

"పోరగాల్లేకాదు బావా! పెద్దోళ్లు గూడ వున్నరు" పంతులన్నాడు.

"మరిగీళ్లకు ఏం పోయే కాలమొచ్చింది? నాకు తెల్వకద్దుత? " కింద కూర్చున్న వ్యక్తి అన్నాడు.

"నవాబు మంచోడు `గాబట్టి సరిపోయింది, 'ఆయన కళ్లు దెరిస్తె ఏమైతరు? " షావుకారు అన్నాడు.

"నాశనమైతరు" రామిరెడ్డి అన్నాడు.

"నాశనమైతరో! దేశాన్ని నాశనంజేస్తరో! ఓరికెర్క" మళ్లీ కింద కూర్చున్నాయన న్నాడు.

"అదిగాదు మౌలిసాబ్! నాకు సమజ్ రాదు. రాజొద్దు, సర్కారొద్దు అంటే యింకేముంటది? " షావుకారు విచిత్రమన్నట్లు



నవ్వుతూ అన్నాడు.

"అదొక్కటేకాదు, కులంలేదు, గోత్రంలేదు అంటు ముట్టులేదు, మాలమాదిగ అందరు ఒక్కటే నంటున్నరటగ? గిదెక్కడి సోద్యమే వెంకయ్య మామా" రామిరెడ్డి అన్నాడు.

"యెట్లయితది బావా! నువ్వు నేనూ ఒక టైతమా! నువ్వు పటేలువు యీయన షావు కారు. ఆయన కంసలాయన, గాడు గొల్లోడు, నేను ముస్లింను, అందరం ఒక్కటెట్ల యితాం? ఈ ఐదేళ్లు ఒకటిగున్నయా? తేడా ఎందుకుబెట్టిండు దేవుడు? గట్లనే ఎవరిది వాళ్లకు నొసట రాసిండు దేవుడు. మనమొద్దంటే పోతయా? తుడిపేస్తే చెరు గుతయా?" పంతులు పరిష్కారం చెప్పిండు.

"యేందో అంత నడమంత్రపు బుద్ధులు... ఆళ్లకు దమాఖ్ ల్లేవు. యేంజేస్తం" షావుకారు నిట్టూర్పుతో అన్నాడు.

"సుట్టుపక్కలంతా సంగం బెడుతుంద్రట! మన వూరికి గూడ వస్తదేమో?" కింద కూర్చున్నాయన అన్నాడు.

"ఈడెవఢుండారు సంగం పెట్టడానికి?" గాబరా పడుతూనే. అన్నాడు షావుకారు.



"యేపుట్టలేపాముున్నదో యెవరికెర్క," రామిరెడ్డి అన్నాడు.

"గట్లయితే పుట్టలన్నీ దొర కాల్చేయడూ" అని పంతులంటే "గదీనిజమే" నని షావుకా రన్నాడు.

"చీకటయ్యింది వస్త పంతులూ" అని రామిరెడ్డి లేచాడు, అతనితోపాటే షావు కారు, మిగతావాళ్లు గుమ్మందాటారు.

అప్పటిదాకా చదువుమాని పిల్లలు వాళ్ల మాటలు వింటున్నారు. కొందరు నిద్రబోతు న్నారు. కొందరు పక్క పిల్లలతో ఆడుకుం టున్నారు.

ఒక్కసారి పంతులు గొంతు విప్పాడు. "అరేయ్ బద్మాష్ లుచ్చే, యేంద్రా! అప్ప ట్నుంచి చూస్తున్న చమ్డాలు దీస్త" కన్నెర్ర జేసి బెత్తం జూపాడు. పిల్లలంతా ఒక్కసారి గొంతు విప్పారు. కాకిగోలగా చదువుతు న్నారు. పంతులు బెత్తం బట్టుకొని ఒక్కొ క్కళ్ల దగ్గరికిబోయి పలకలు చూస్తూ రాసింది చూస్తున్నాడు.

"బద్మాష్... సువ్వర్కేబచ్చే అన్నం తింటుంద్రా! గడ్డి తింటుంద్రా! గప్పట్నుంచి చూస్తున్న.

పెద్ద మనుషులున్నరని వూర్కున్న! యేదిర రాసింది? యిప్పుడు జెప్పుత" అని చింతబరికెతో చర్రుచర్రుమని పిర్రలు వాయగొడుతున్నాడు. వాళ్లు లబోదిబో మంటున్నారు. అయ్యో! అమ్మో అని గోలబె డుతున్నారు.

"ఖామూష్. నోరుదెరిస్తే గొంతు పిస్కుత, మాటినబడ్తే పాణం దీస్త. ఖబ ర్దార్" అన్నాడు. పిల్లలు గడగడ వణుకుతు న్నారు.

రామిరెడ్డి భార్య సావిత్రమ్మ బడిలోపల కొస్తూ, "ఇంత చీకటయ్యింది, బడొదల్లేదు పంతులూ? " అంది. ఆమె గొంతు వినగానే చటుక్కున కొట్టడం ఆపిండు పంతులు. పిల్లలవంక జూసి నోరు దెరువద్దని, కళ్లు తుడుచుకొమ్మని సైగ జేశాడు. పిల్లలు నోరు మూసుకున్నారు.

బడి విడిచి పెట్టాడు. బిడ్డను తీసుకొని సావిత్రమ్మ గడపదాటింది. ఒక్కసారి ఆ బిడ్డ బిగ్గరగా ఏడుపు మొదలుబెట్టింది. సముదాయించుతూ సావిత్రమ్మ ఇంటికి తీసుకెళ్లింది. ఇంటికెళ్లిన తర్వాత దెబ్బలతో వాతలుబడ్డ బిడ్డ వొళ్లుజూసింది. ఆమెకు ఏడుపొచ్చింది. ఏడుపుతోపాటు పట్టరాని కోపమొచ్చింది.

"వాడి చేతులిరగ, సదువుజెప్పుండా! పిల్లల్ని సంపుతుండా! పాపిస్టోడు. పసిపిల్ల నిట్ల గొట్టడానికి వాడి చేతులెట్లొచ్చినయ్. ఆడపిల్లను కొట్టడానికి మనస్సెట్లొప్పింది. ముదనష్టపోడు. అయ్యో! అయ్యో! ఆడికేం పోయేకాలమొచ్చింది. ఊర్కో అమ్మ వూర్కో. ఆ బడొద్దు బండలొద్దు" అంటు న్నది. సావిత్రమ్మ మాటలు విని పక్కిం టామె తన కొడుకుని తీసుకొచ్చింది. వాళ్లి ద్దరు పంతులు కొట్టిన దెబ్బలు చూసి మండిపడుతున్నారు. ఇట్ల నలుగురైదుగురు తమ పిల్లల్ని తీసుకొని బజారుకొచ్చింద్రు. అందరు కలిసి ఆగ్రహంతో పంతులు సంగతి చూస్తామంటున్నారు.

చీకటి పడ్డాక పిల్లల తండ్రులొచ్చారు. భార్యల ఆవేశం చూసి పిల్లల దెబ్బలు చూసి పంతులెక్కడ? అని కర్రలు తీసుకొని బయల్దేరారు! పంతులు దస్తగిరి ఎక్కడో దాగాడు. తెల్లారేసరికి మూటాముల్లె సర్దు కొని పెండ్లాం పిల్లలతో వూరొదిలిపో యాడు.

దెబ్బలు తింటే తిన్నాంగనీ పంతులు పోయిండు, బడిలేదని పిల్లలు సంబరప డ్డారు.

★ ★ ★

ఒకప్పుడు బాగా బతికాడు నర్సయ్య. వూర్లోపెద్ద రైతుల్లో ఒకడు. పాలోళ్లతో భూమితగాదాల్లో పడి అప్పులకింద, దొరకు

ముడుపులకింద ఖర్చుబెట్టి చితికిపోయాడు. ముసలితనమొచ్చింది. కొద్దిగ మిగిలిన భూమి సాగు చేసుకుంటున్నాడు. అతనికొక్కడే కొడుకు వీరయ్య. అతని భార్య చనిపోయింది. పిల్లల్లేరు, వయసు నలభై దాటింది. ఆడదిక్కులేని ఇల్లు, వారసత్వం లేదన్న ఆలోచనతో కొడుక్కు రెండో పెండ్లి చేశాడు నర్సయ్య. పరాయిదొస్తే ఎట్లుంటుందోనని తన కూతురు బిడ్డను, మేనకోడలు వరసన తెచ్చి చేశాడు. చంద్రమ్మ, వీరయ్య వయసులో సగముంటుంది. అతని కండ్ల ముందే పుట్టి పెరిగింది.

పెండ్లయ్యి పదేండ్లయ్యింది, చంద్రమ్మ కాపురానికొచ్చి ఐదేండ్లయింది. అయినా పిల్లలు కలగలేదు. ఆ చింతతో ముసలాయనున్నాడు. దానికితోడు వూర్లో జనం చంద్రమ్మను గురించి నానా రకాలుగనుకుంటుంటే విన్నాడు. తన కోడలుకు చంద్రయ్యతో అక్రమ సంబంధమున్నదని తెలిసి భరించలేకపోతున్నాడు. ఆమె ఇంటినుండి కదలకుండా పొలంపోయినా వొంటరిగా బోకుండా జాగ్రత్తపడుతున్నాడు.

చంద్రమ్మ వయసులో వుంది. చాలా అందంగా ఉంటుంది. ఆమె అందం గురించీ, అక్రమ సంబంధం గురించీ ఆడోళ్లు గుసగుసలు బెడుతుంటారు.

అర్ధరాత్రి దాటింది, వూరంతా నిద్రలో వుంది. వీరయ్య కల్లం కాపలాకెల్లాడు. చంద్రమ్మ ఇంట్లో పడుకుంది. నర్సయ్య ఇంటిముందు మంచమ్మీద పడుకున్నాడు.

వెన్నెలరాత్రి. నర్సయ్యకు అనుమానమెక్కువ. నిద్రబోకుండా చంద్రమ్మకు కాపలాగాస్తున్నాడు. కళ్లుమూతబడుతున్నా, నిద్ర ఆపుకుంటున్నాడు. చుట్టకాలుస్తూ చుక్కలు లెక్కబెడుతున్నాడు. తెలియకుండానే కునుకుబట్టి, గురకబెడుతున్నాడు.

కొంతసేపటికి దిగ్గునలేచి కూర్చుని గుమ్మం తలుపు జూశాడు. గొళ్లెంబెట్టేవుంది. లోపలి తలుపు మూసేవుంది. ఫరవాలేదనుకున్నాడు. చుట్ట కాల్చడానికి పొగాకు కోసం చూశాడు. ఇంట్లోకి పోయి పొగాకు తేవడానికి, చంద్రమ్మను నిద్రలేపడానికి సందేహిస్తున్నాడు. తప్పదనుకొని వెళ్లి తలుపుగొట్టాడు. లోపలినుండి చంద్రమ్మ తడబడే గొంతుతో,

"యేమయ్యింది మామయ్యా! యేమికావాలె" అనడిగింది.

"పొగాకు తీస్కుంట, తలుపుదీ" అన్నాడు.

తలుపు తెరవకుండానే "తెస్తావుండు" అంది. నర్సయ్యకేదో అనుమానమేసింది.

"నేను దీస్కుంటగని తలుపుదెర్వు" అన్నాడు నర్సయ్య. తప్పదనుకొని చంద్రమ్మ తలుపు దీసింది. లోపల చీకటిగ వుంది. తడబడుతూ లోపలికిబోయిండు నర్సయ్య. గదంతా చీకటి. అగ్గిపుల్ల గీసి గదంతా ఓరగంట చూశాడు. ఆ గదికి ఇంకో దారిలేదు. ఒకటేదారి. సంతృప్తిచెంది ధాన్యం గూనలో పొగాకుకోసం చెయ్యి బెట్టాడు. ఉలిక్కిపడి బయటికొచ్చి గది తలుపు దగ్గరికేసి బయటినుండి గొళ్లెం బెట్టాడు. తలుపు కడ్డంగా మంచం లాక్కున్నాడు. ముతక పంచాంగం మొదలు పెట్టాడు. తెల్లారేదాకా జాగారం చేశాడు.

తెల్లారింది. జనం నిద్ర లేచారు.

నర్సయ్య పేరుపేరునా పక్కింటోళ్లను పిలిచాడు. జనం గుంపయ్యారు.

నర్సయ్య గుండెబాదుకుంటూ, తలగొట్టుకుంటూ...

"కోడలు నా కొంప ముంచింది. నా పరువు దీసింది. ఆ లంజకొడుకు మా సంసారంలో నిప్పులు బోసిండు. తలెత్తుకోకుండ జేసిండు" అని జరిగిందంతా చెప్పాడు. లోపల చంద్రయ్య వున్నాడని తెలిసి ఆడోళ్లు ముక్కున వేలేసుకున్నారు. రకరకాలుగా అనుకుంటున్నారు.

"ఇసంటోళ్లుంటే వూరంత చెడ్తది. ఆడికి సరైన బుద్ధి చెప్పాలె"న్నాడు ఒకాయన.

"పట్టుకొచ్చి గుంజకు కట్టేయండి" అన్నారు యింకొకరు.

నర్సయ్య తలుపుదీసి లోపలికి బోయి చంద్రయ్య జుట్టుబట్టుకొని గుంజుకొచ్చాడు. సిగ్గుతో తలదించుకొని నోరు మెదపకుండా వున్నాడు చంద్రయ్య. అక్కడున్న మగోళ్లు, పగ్గందెచ్చి చంద్రయ్యను మొగరానికి విరిచి కట్టారు. అతన్ని చూసి ఎవరికి తోచినట్లు వారంటున్నారు. లోపల చంద్రమ్మ దిక్కుతోచక కంటతడిబెడుతోంది.

ఇంటిముందు జనం సందడి చూసి వీరయ్య ఖంగారు పడుతూ గబగబా వచ్చాడు. అతన్ని చూసి ఆడోళ్లు పకపకమన్నారు. ఎందుకో అర్థంగాక లోపలికి అడుగుబెట్టాడు. గుంజకు కట్టేసిన చంద్రయ్యను జూశాడు. కొడుకును చూసి నర్సయ్య,

"వీరయ్యా! మన పరువుదీసిందిరా! ఈ ముండాకొడుకు మనకొంప ముంచిండురా!" అని తలగొట్టుకున్నాడు.

వీరయ్య నోరు మెదపకుండా గోడదగ్గర చతికిలబడ్డాడు. అతన్ని చూసి తలో మాట అంటున్నారు.

"ఈడు మంచోడైతే అదిగట్లెందుకు జేస్తది? "

"ఆడంగులోడు దానికి అలుసిచ్చిండు, అందుకే తెగించింది"

"వూరందర్కీ తెలుసు. యెప్పట్నుంచో జరుగుతుందేగదా? "

"అదేం జేస్తది! మగడు చేతగానోడైతే"

"వొల్లు బలిసి వీడు గిట్లజేసిండు. పెండ్లి పెటారుల్లేకుండ వున్నదిందుకే? "

"ఇసంటోడు వుంటే ఇల్లన్నీ నాశనమైతయ్"

"ఇసంటోన్ని నర్కిపోగులు బెట్టాలే"

"దాని మగడికిష్టమైంది, మనకెందుకు? "

"మరీగింత బరిదెగించిండ్రు... ఆవ్వా!"

"నాకెప్పట్నుంచో దెల్సు నాకెందుకని వూర్కున్న"

ఆ మాటలన్నీ విని వీరయ్యకు పిచ్చెక్కినట్లయింది. కోపంతో వూగిపోతూ లేచాడు.

"మీరంతా పత్తిత్తులైనట్లు నా పెండ్లమొక్కతే లంజరికం చేస్తున్నట్లు కూస్తున్నరు. మీ పెండ్లాల సంగతి మీ మగల సంగతి సూస్కోండి. నా పెండ్లం గురించి నా గురించి యింకో మాటంటే పుర్రెలెగురుతయ్! మీ మగలు ఏ కొంపల్లో దూరుతున్నరో దెలుసా? మీ పెండ్లాలు యెవరి పక్కన పడుకుంటున్నారో సూసిండ్రా! నోటి కొచ్చినట్లు కూస్తున్నరు. తమాషాజేస్తున్నరు" పెద్దగా అరిచాడు. నోర్లు మూసుకొని అంతా వెళ్లిపోయారు. వీరయ్య కుమిలిపోతూ కూలబడ్డాడు.

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు, బాధతో కుమిలిపోతున్న వీరయ్యా మస్కూరు కొండడు, రామిగాడు రావడం చూసి ఖిన్నుడయ్యాడు. నర్సయ్యకు మాత్రం సంతోషంగా ఉంది. దొర, చంద్రయ్యకు తగిన శాస్తిజేస్తాడనుకుంటున్నాడు.

చంద్రయ్యను, చంద్రమ్మను గడి దగ్గరికి పట్టుకుబోవడానికచ్చినామని కొండడు చెప్పాడు. రామిగాడు గుంజకున్న చంద్రయ్యను వదిలించి తాళ్లతోనే చంద్రయ్యను పట్టుకుబోతున్నాడు. నర్సయ్య లోపలికి బోయి జుట్టుబట్టి చంద్రమ్మను యీడ్చుకొచ్చాడు. అతని వెనకాల చంద్రమ్మ బలికి తీసుకపోయే మేకపిల్లలా తలదించుకొని పోతున్నది. నర్సయ్య, వీరయ్య వెంటబోతున్నారు. వూరి జనం వింతగా చూస్తున్నారు.

గడివెనక పెరట్లో పెద్దొరసాని కొలువుదీరివుంది. ఆమె తూగుటుయ్యాలలో వూగుతూ కచేరీ జరుపుతున్నది. కొద్దిగా దూరంగా కుర్చీమీద పటేల్ కూర్చున్నాడు. చంద్రయ్యను గోడదగ్గర నిలబెట్టాడు రామిగాడు. చంద్రమ్మ మరోపక్క నిలబడ్డది. వీరయ్య, నర్సయ్య దొర్సానికి దండంబెట్టి నిలబడ్డారు.

"చంద్రమ్మంటే ఇదేనా? " అడిగింది దొర్సాని.

"ఇదే... ఆడు చంద్రయ్య" అన్నాడు పటేల్.

"యేమిటో విచారించండి" పటేల్‌తో అన్నది దొర్సాని.

"యేముంది దొర్సానీ. ఎప్పట్నుంచో జర్గుతోందని వూరందర్కీ ఎర్కే... కానీ... యియ్యాలే దొరికింద్రు. రంకుతనం ఎంత కాలం దాగుద్ది దొర్సానీ... ఒరేయ్ నర్సయ్య... జర్గిందేందో దొర్సానికి సెప్పు" అన్నాడు పాపిరెడ్డి.

జరిగిందంతా వివరంగా చెప్పాడు నర్సయ్య.

"విన్నావా పటేల్‌సాబ్! వూర్ల గిట్ల జరుగుతుంటే యేంజేస్తున్నరు? ఈ ముండ మంచిదైతే వాడెందుకు జేస్తడు. ముందు దీనికి తగిన శాస్తి జరగాలి. వాడు చూస్తే దున్నపోతోలె వున్నడు. ముందు వాళ్ళ మదమనుచు" అన్నది దొర్సాని.

పటేల్ కర్రదీసుకుని చంద్రయ్యను చితకగొట్టాడు. చంద్రమ్మ దగ్గరికొచ్చాడు.

"లంజముండ... మొగడు సరిపోలేదే! మిండన్ని బెట్టుకున్నావ్ బద్మాష్‌ముండ... బరిదెగించినవ్. వూరనుకున్నవా? యేమనుకున్నవ్. పట్నం బోయి ముండల కొంపల్లజేరు. అన్ని కోర్కెలు దీర్తయే దొంగలంజ'

బూతులు తిడుతూ కొడుతున్నాడు. కసినంతా చూపుతున్నాడు. కారణం చంద్రమ్మకు దెలుసు. ఓసారి చెయ్యిబట్టుకుంటే చెంప పగలగొట్టింది. అప్పట్నుంచీ సమయంకోసం చూస్తున్నాడు పాపిరెడ్డి. యియ్యాల అవకాశం దొరికిందని కసినంతా చూపుతున్నాడనుకున్నది. దెబ్బలు భరిస్తున్నది. వీరయ్య భరించలేకపోతున్నాడు. ధైర్యంజేసి- పటేల్ కడ్డం నిలబడ్డడు.

"దొర్సానీ! నీకు దండంబెడ్త- చంద్రమ్మను కొట్టొద్దు. ఆ దెబ్బలు నేను తింట. దాన్ని దిలేయండి దొర్సానీ కాళ్ళు మొక్కుత" అన్నాడు వీరయ్య.

"యేందిరో! లంజరికం జేస్ని పెండ్లాన్ని యెనకేసుకొస్తున్నవ్. ఇదెక్కడి సంగతి? ఆశ్చర్యపడింది దొర్సాని.

"ఈడు మగోడైతే- అది గట్లెందుకు జేస్తది దొర్సానీ! తెలిసే వూర్కున్నడు. పెండ్లాన్ని ఆడి దగ్గర పడుకోబెట్టి వీడు బాయిదగ్గర పడుకుంటడు. ఎందుకో? ఏమో? తెల్వదు'' పటేల్ చెప్పాడు.

"తప్పు నాదే దొర్సానీ! అదేం తప్పు చేయలేదు. నిజం సెపుతున్న దొర్సానీ! యియ్యాల నోరుదెరిసి మాట్లాడుతున్న- మనసిప్పి సెప్తున్న. యీయ్యాల్టిదాకా నోరు లేనోన్నని జనమనుకుంద్రు. సేతగానోనన్నరు. ఎన్నన్నా వూర్కున్న. గనీ- యియ్యాల నిజం సెప్తున్నదొర్సానీ. కుండ బద్దలుగొట్టినట్లు సెప్తున్న. నా చంద్రమ్మ తప్పేమిలేదు. తప్పంత నాది దొర్సానీ..." ఆవేశంతో వూగిపోతున్నాడు వీరయ్య.

కొడుకు మాటలు విని నర్సయ్య కలవరపడ్డాడు.

"దొర్సానీ నీకు దండంబెడ్త. యీడికి పిచ్చెక్కింది. పిచ్చోడయ్యిండు దొర్సానీ! నీకాళ్ళు మొక్కుత. యేందేందో అంటున్నడు. నాకు భయమేస్తున్నది దొర్సానీ! నా కొడుకు పిచ్చోడయ్యిండు. నేనేం జేయను దొర్సానీ! నాకింక దిక్కోరు దొర్సానీ!" ఏడుపు మొదలు బెట్టిండు.

వీరయ్య తండ్రివంక కోపంగా జూసి. "ఓరేయ్ ముసలోడా! నాగ్గాదురా- నీకు పిచ్చెక్కింది. నన్ను నాశనం జేస్నివ్. దాని బతుకు నరకం జేస్నివ్! నన్ను జెప్పనీ- నువ్వు నోర్మూస్కో" అన్నాడు.

"దొర్సానీ... నీకు దండంబెడ్త... అంత విని నాయంజెప్పండి. తప్పయితే నాకు శిక్ష వేయండి. ఇది నా అక్క బిడ్డ. నా మేనకోడలు. సిన్నప్పట్నుండి యీ చేతుల్లో పెంచిన. నా కండ్లముందు పెరిగింది. నా బిడ్డలా అనుకున్న. నా పెండ్లం సచ్చిపోయినంక యింకో పెండ్లిచేసుకొమ్మని మా

నాయన- ఈ ముసలోడు బలవంతంచేసిండు. నా మాట వినకుండా మేనకోడలు వర్సనీ, రక్త సంబంధమని చంద్రమ్మతో నా పెండ్లి జేసిండు. దాని మెడలో పుస్తెగట్టిన గనీ- పెండ్లాంగా సూడలేకపోయిన. అదీ అంతే... చిన్న పిల్ల యెవరితో సెప్పుకుంటది? యెవరు దాని మాటింటరు? అందరం గలిసి దాని గొంతుగోసినం. అది ఏడిస్తే నేనేడ్చిన. దాని బత్కుబండలయ్యిందని తెల్సుకున్న. దాని మనసు దెల్సుకున్న. అది చంద్రయ్యకు మనసిచ్చింది. నావల్ల అదే సుఖం పొందలేదు. దాని జీవితమంత ఇట్లనే అయిపోతదనుకున్న. దాని సుఖం కోసం ఏమైనా సెయ్యాలనుకున్న దొర్సానీ. కానీ- మా ఇండ్లల్ల మారుమనుంలేదు. సేస్తే వొప్పుకోరు. కులంలనుండి ఎలేస్తరు. యేంజయ్యాల్నో తోయలేదు. తప్పో వొప్పో- నాయమో అన్యాయమో వాళ్ళిద్దర్నీ ఒకటి సెయ్యాలనుకున్న. అర్ధరాతిరి గుడికి దీస్కబోయి- దేవుని దగ్గర దండలేయించిన- యీ చేతుల్తో అచ్చొంతలేసి దీవించిన. లోకం దృష్టిలో నేను, చంద్రమ్మ భార్యాభర్తలం, కానీ దేవుడి దృష్టిలో చంద్రయ్యా, చంద్రమ్మ భార్యాభర్తలు. అయినా వాళ్ళు లోకానికి భయపడి మెసలుకున్నారు దొర్సానీ! అన్నీ దెల్సినోళ్ళు మీరే నాయం జెప్పండి. తప్పు నాదా! వాళ్లదా? నా తప్పు కేశిక్ష యేస్తరో యెయ్యండి. నన్ను సంపండి... నరకండి... గానీ ఆళ్ళనేం అనొద్దు దొర్సానీ. దండంబెడ్త..." వీరయ్య పసివాడిలా ఏడుస్తున్నాడు.

నర్సయ్య, అక్కడున్న వాళ్ళంతా నోరెళ్లబెట్టారు. దొర్సానీ, పటేల్ ముఖాలు చూసకున్నారు.

"ఇన్నవా పటేలా! కథ ఎంత బాగున్నదో!'' దొర్సాని ముసిముసి నవ్వుల్తో అన్నది.

"కదగాదు దొర్సానీ. నిజం సెపుతున్న దేవుడిమీద పమాణంచేసి చెప్తున్న" అన్నాడు వీరయ్య.

"కాలమిట్లున్నది... ఇట్లాగే చూస్తూ వూర్కుంటే యింకేమైతదో? " పాపిరెడ్డి అన్నాడు.

"సరే! అంత యిన్నరుగద! యింక ఫైసల చెప్పండి" దొర్సాని, పటేలును ఆజ్ఞాపించింది. పటేల్ పాపిరెడ్డి క్షణమాలోచించి,

"ధర్మందప్పి- ఆచారం మంటగలిపి తప్పుడు పనిచేసినందుకు వీరయ్యకు ఐదొందల జుర్మానా" అన్నాడు.

నర్సయ్య ప్రాణంబోయినట్లయ్యింది. "దండంబెడ్త దొర్సానీ! గంత అన్నాయం సెయ్యొద్దు. నా కొడుకు తిక్కలోడు ఆడికేం దెల్వదు. ఆడి మాటలుబట్టి జుల్మాన యెయ్యొద్దు దొర్సానీ. ఐదొందలెక్కడ దేను. వున్న రెండెకరాలమ్మినా అంత రాదు. యేడదేను దొర్సానీ? " వేడుకున్నాడు.

"మానం, మర్యాద బోయినంక బతుకెందుకురా! ఏ నుయ్యో గొయ్యో చూసుకో! లేకపోతే ఏ చెట్టుకైనా వురేసుకో" అన్నది దొర్సాని. "సరే... అసలోళ్ళ సంగతేమిటి? ' పటేల్ నడిగింది.

"వీళ్ళు వూర్లుంటే వూరికే అవమానం. చెరో రెండొందలు జుర్మానా యేసి వూరి నుండి ఎల్లగొట్టాలి" అన్నాడు.

"మరా పని వెంటనే చేయండి" తీర్పు చెప్పుతూ అన్నది దొరసాని.

కొండడు. చంద్రయ్య కట్లువిప్పాడు. వీరయ్య చంద్రమ్మను తీసుకొనిపోయి చంద్రయ్య చేతులు కలిపాడు. చంద్రయ్య, చంద్రమ్మ, వీరయ్యకు వొంగి దండంబెట్టారు. వీరయ్య నిండు మనసుతో ఆశీర్వదించాడు.

★ ★ ★

ఆరోజు రాత్రి వూర్లో యానాదోళ్లు భాగోత మాడుతున్నారు. దానికోసం గుంజలు పాతి, పరదాలు కట్టారు. పెట్రొమాక్సు లైట్లు బెట్టారు. రెండు దివిటీలు గూడ వెలిగించి చాకలి తిర్పతయ్య, పెద్దయ్య చెరో పక్కన

పట్టుకొని కూర్చున్నారు. పిల్లలు ముందు కొచ్చి కూర్చుంటున్నారు. స్త్రీలు దూరంగా గోడదాపున కూర్చుంటున్నారు. మిగతా వాళ్ళు అక్కడక్కడ కూర్చుంటున్నారు. పోలీసు పటేల్ పాపిరెడ్డి, పట్వారి రామా రావు, షావుకారు, ఇతర పెద్దలు అరుగుల మీద కూర్చున్నారు. దొరకోసం పెద్దరుగు మీద ఆరాం కుర్చీవేసున్నది. దొర రాక కోసం భాగోతులోళ్లు ఎదురుచూస్తున్నారు. మద్దెల దర్వులు వాయిస్తూ కాలం గడుపు తున్నారు. దొరను చూడగానే చీకట్లో వున్న అందరూ దండంబెట్టారు. దొర కూర్చు న్నాడు. దర్వాజాలోపలి పక్కన ఆరాం కుర్చీలో పెద్దొరసాని కూర్చున్నది. రాజు వేషం కట్టుకున్న కోటిగాడు దొరకు దండం బెట్టి:

"ధర్మదాతలు, మహానుబావులు శ్రీశ్రీశ్రీ భాస్కరరావు దొరవార్కి బహుపరాక్, బహుపరాక్" అన్నాడు. దొరను పొగిడాడు. తర్వాత పేరుపేరునా పటేల్ పాపిరెడ్డి, రామారావు, షావుకారు వెంకయ్య, పటేల్ నర్సిరెడ్డిని తలిచాడు. ఆట మొదలుబె ట్టారు. భక్తప్రహ్లాద... కథ జరుగుతున్నది. వేషాలొస్తున్నాయ్ పోతున్నాయ్. మధ్య మధ్య కేతిగాడొచ్చి నవ్వించిపోతున్నాడు. జనం లీనమై చూస్తున్నారు.

చిన్నదొరసాని బంగ్లామీద, పిట్టగోడ దగ్గర మంచమ్మీద కూర్చుని చూస్తున్నది. పక్కన నేలమీద ఆడబాప కూర్చున్నది. కబుర్లు చెప్పుకుంటూ ఆట చూస్తున్నారు.

"అమ్మా" అని దిగ్గున లేచింది చిన్దొర సాని.

"ఏమయ్యిందమ్మా? " ఖంగారుపడుతూ అడిగింది ఆడబాప.

చిన్దొరసాని వీపును చెయ్యితో రుద్దు కుంటూ, "యేదోభగ్గుమన్నది. తేలు కరిసిన ట్లున్నదే" అని గబగబా గదిలోపలికి బోయింది. ఆడబాప ఆమెకంటే ఎక్కువ బాధపడుతూ వెనకాలే వెళ్ళింది. చిన్దొర సాన్ని మంచమ్మీద పడుకోబెట్టి, లాంతరు వెలుతుర్లో తేలు కరిచిన చోటు చూసింది. ఎఱ్ఱగా కమిలినట్లున్నది.

"మంత్రమేసి పసరుబోస్తే దబ్బున తగ్గు ద్దమ్మ. లేకపోతే పోటెక్కి బాధ పెడ్తది. కంసలి శంకరయ్య మంత్రమేస్తడు. పసరు బెడ్తడు. పోయి పిలుచుకరానా? " అడిగింది ఆడబాప.

"ఈ రాత్రిపూట ఎక్కడికి పోతవు. వద్దులే. అదే తగ్గుతుంది"

"కిందనేవున్నడు. బాగోతం చూస్తున్నడు. పోయి పిల్చుకొస్త" అని దబదబా బయటికె ళ్లింది. చిన్దొరసాని "అమ్మో! అయ్యో" అంటు, మంచం దిగి అటుఇటూ తిరుగుతు న్నది. చికాకు పడుతున్నది.

కొద్ది సేపట్లో ఆడబాప కంసాలి శంకరయ్యను వెంటబెట్టుకొని వచ్చింది. శంకరయ్య చిన్దొరసానికి నగలు జేస్తుం టడు. పట్నంబోయినప్పుడల్లా పుస్తకాలు, అత్తరు, పౌడరు కావలసినవి దెచ్చిపెడుతుం టడు. చిన్దొరసానికి కనిపించే వ్యక్తి, మాట్లాడే మగమనిషి శంకరయ్య ఒక్కడే.

"యెక్కడ దొర్సానీ! తేలెక్కడ గర్చింది" శంకరయ్య వస్తూనే అడిగిండు. చిన్దొరసాని వేలుతో వీపుచూపింది.

"మంచమ్మీద పడుకోమ్మా! శంకరయ్య మంత్రమేసి... పసరుబెడ్తడు" అని ఆడబాప చేయిబట్టుకొని చిన్దొరసాన్ని పడుకోబెట్టింది.

శంకరయ్య మంత్రమేశాడు. జేబులో నుండి ఏదో ఆకుదీసి బాగా నలిపి, తేలు కరిచినచోట పసరు పిండాడు. ఆడబాప వంక జూసి "బాగా రాయాలె" అన్నాడు.

"రాయరాదు మరి" దొర్సాని అన్నది. శంకరయ్య సందేహిస్తున్నాడు. పిండిన పసరు శరీరంమీద కారిపోతున్నది. నెమ్మ దిగా చేయిబెట్టి రాస్తున్నాడు. మెత్తని శరీరం అందమైన ఆకారం శంకరయ్యను ఇబ్బంది పెడుతున్నాయ్. ఆమెక్కూడా అట్లాగే వున్నట్లున్నది. తేలు సంగతి మరిచి

పోయి అనుభూతిని పొందుతున్నట్లున్నది.

"యెట్లుందమ్మ! మంట తగ్గిందా! పోటె క్కలేదుగదా? " మంచం పక్కన కూర్చుని ఆడబాప అడిగింది.

"కొద్దిగా తగ్గింది. యింక కొద్దిగా పసరు బెట్టి రాయరాదు శంకరయ్య" చిన్దొరసాని అనగానే మరింత పసరుపిండి రాస్తున్నాడు శంకరయ్య.

"శంకరయ్య సమయానికి వుండబట్టి సరి పోయింది. లేకపోతే ఏమయ్యేది? అమ్మ గారు అసలే నాజూకు మనిషి. యింతనొ ప్పొచ్చిన తట్టుకోలేదు" ఆడబాప అన్నది.

"సరేగని... శంకరయ్యకు కొంచెం ఛాయ్ చేసుకరారాదు" అనగానే, అట్లాగేనని ఆడ బాప బయటికెళ్ళింది. ఒంటరిగా దొర్సాని పక్కన నిలబడి పసరు రాస్తున్నందుకు భయపడుతున్నాడు. లేచి నిలబడి "కొంచెం సేపట్ల అంత తగ్గిపోద్ది దొర్సాని" అన్నాడు.

"యింకా కొద్దిసేపు రాయరాదు శంక రయ్య" కొంటెచూపు చూస్తూ అన్నది చిన్దొ రసాని. శంకరయ్య కాదనలేక పోయాడు. మంచమ్మీదికి వొంగి నిలబడి రాస్తున్నాడు. దొర్సాని తిరిగి పడుకున్నది. పైట జారు న్నది. శరీరం నిగనిగలాడుతున్నది. శంకర య్యకు మతిబోయినట్లున్నది. అతని శరీరం వేడెక్కుతున్నది. చేతులు వణుకుతున్నాయ్. నెమ్మదిగా శంకరయ్య చేతిని బట్టుకున్నది దొర్సాని. అతని కళ్లల్లోకి చూస్తూ చేతిని తన శరీరమంతా తిప్పుకుంటున్నది. శంక రయ్య నెమ్మదిగా మంచం పట్టిమీద కూర్చొని రెండు చేతులతో ఆమె శరీరాన్ని తాకుతున్నాడు.

ఇద్దరూ మైమరచిపోతున్నారు. చాయ్ కప్పులతో వచ్చిన ఆడబాప ఇది గమనించి ఏమీ ఎరగనట్లు చప్పుడుచేస్తూ లోపలికొ చ్చింది. శంకరయ్య దిగ్గున లేచి నిలబ డ్డాడు.

"శంకరయ్య నువ్వు సమయానికున్నవ్. ఆకు కూడా యెంటనే దొరికింది. లేకపోతే" అన్నది ఆడబాప చాయ్ కప్పు అందిస్తూ.

చిన్దొరసాని లేచి కూర్చుంది.

"వద్దమ్మా లేవకు. కొంచెంసేపు అట్లాగనే పడుకో. యింకొద్దిగా పసరు రాయరాదు శంకరయ్య" కావాలనే అన్నది ఆడబాప. శంకరయ్య, దొర్సాని మనసుల్లో కూడా అదే వున్నది.

"కేతిగాడి వేషమొచ్చినట్లున్నది" ఆడబాపే అన్నది.

"వెళ్ళిచూస్తవా? " అడిగింది దొర్సాని. అవునన్నట్లు ఆడబాప తలూపింది.

"వెళ్లిచూడుపో" అన్నది దొర్సాని.

ఆడబాప తలుపు దగ్గరకేసుకుంటూ, "శంకరయ్య నువ్వు పోయేటప్పుడు పిలువు వస్త"నని వెళ్లింది. తలుపు దగ్గర పడగానే చిన్దొరసాని శంకరయ్య చేయిబట్టుకొని మీదికి లాక్కున్నది.



సా యంత్రం కావస్తున్నది. పశువులు మడికట్లలో మేస్తున్నయ్. పశువులగాసే పొరగాళ్లు బావిగడ్డ దగ్గర ఆడుకుంటు న్నారు. కల్లుగీయడానికి ఈతచెట్ల మట్టలు నరికున్నయ్. ఈత జగ్గలు సూర్యకాంతికి బంగారంవలె మెరుస్తున్నాయ్. ఒకడు బోయి, జగ్గదీసుకొని కిరీటంవలె పెట్టుకు న్నాడు. రాత్రి చూసిన భాగోతం గుర్తు చేసుకున్నాడు. తోచినట్లు పాట మొదలుబె ట్టాడు.

"ఇరన్న కౌసుడరా- నిన్ను
ఇర్సుక తింటనురా.
సిక్కవ్- దొరకవ్- యెక్కడున్నవుర.
బయటికి రార బొక్కలిరుస్త.
ఇరన్న కౌసుడరా..."

అది చూసి యింకో పోరగాడు చిన్న కిరీటంలాగ పెట్టుకొని గడ్డమీదికెక్కి,

"నారాయ్న! నారాయ్న. నారాయ్న" అన్నాడు.

"యేందిరంటున్నవ్" పెద్దోడన్నాడు.

"నారాయ్న! నారాయ్న" చిన్నోడు జవాబిచ్చాడు.

"గదే అనొద్దన్న. గాడి పేరంటే నిన్ను సంపుత" అన్నాడు పెద్దోడు.

"నారాయ్న! నారాయ్న! నారాయ్న"

"యాడుండురాగాడు? ఈడుండా! గాడుండా! యాడుండు? యీ సెట్టుమీదున్నడా! గా గట్టుమీదున్నడా? గీ బాయిలున్నడా? గా చెర్వులున్నడా? గీ పుట్టలున్నడా? " అని కర్రతో పుట్టమీద, చెట్టుమీద కొడుతున్నాడు పెద్దోడు.

దూరంనుండి బోయీలు మేనా మోసుకుంటూ పరుగుతో వస్తున్నారు. మేనా వెనకాల మంగలి పిచ్చయ్య చందుక నెత్తిన బెట్టుకొని మేనాతోపాటు వురుకుతున్నాడు. బోయీలు పిల్లబాటన లయబద్ధంగా గొంతులు కలుపుతున్నారు.

అహోం... హో... హోయ్... హోహో హోహోం

ఇరుకుల బాట హోం
పక్కన కంప హోం
తంగెడి చెట్లు హోం
సందున రాయి హోం
ఈదుల బాట హోం
పక్కన పుట్ట హోం
జారుడు బాట హోం
బాటలో బర్రెలు హోం

ఒక్కసారి మేనా మోసే బోయీలు ఆగిపోయారు. బాటకడ్డంగా బర్రెలు మేస్తున్నాయ్.

"ఓరేయ్... యెవర్రా నీయమ్మ. బర్రెల బాటలొదిలిపెట్టి యేం జేస్తుండ్రరరేయ్" ముందున్న చాకలి నారయ్య పెద్దగా కూత బెట్టాడు. ఆ కూత విని ఆడుకునే పోరగాళ్ళు అటు జూశారు. మేనాలోనుండి రెక్కదీసి పెద్దొరసాని తొంగిచూసింది.

"ఓమ్మో! సస్తి నీకాల్మొక్త..." అని పెద్ద పోరగాడు పొలాలెంటబడి వురుకుతున్నాడు. అతని వెనకాలె పోరగాళ్ళంతా అడ్డం దొడ్డంబడి వురుకుతున్నారు. చాకలి నారయ్య బర్రెల నదిలించిండు.

బోయీలు భుజం మార్చుకొని పరుగుతో రాగమందుకున్నారు.

★ ★ ★

నర్సిరెడ్డి పటేలంటే వూర్లో అందరికీ గౌరవమున్నది. పెద్దరైతుగా, దొర, పటేల్, పట్వారి, గ్రామ పెద్దలతో ఎదురుగా నిలబడి మాట్లాడే శక్తి అతనికున్నది. వంశపారంపర్యంగా వస్తున్న పటేల్‌గిరి కాదన్నాడు. అది పాపిరెడ్డి వశమయ్యింది. నీతీ, నిజాయితీగల మనిషిగా నర్సిరెడ్డి పేరు సంపాదించుకున్నాడు. ఆపదలో వున్నవాళ్ళను ఆదుకునే మనస్తత్వం. రాత్రనక, పగలనక అందరికి అందుబాటులో వుంటాడు.

ఇంటినుండి పొద్దున్నే బయటికెళ్ళబోతున్న నర్సిరెడ్డి కాళ్ళమీద బడింది ముత్తమ్మ.

"పటేలా! నా కొడ్కును కాపాడు పటేలా! ఆడ్ని సంపేస్తరు పటేలా!" అని మొత్తుకుంటున్నది.

"యేమయ్యిందే! లే... యేం జరిగిందో చెప్పు" అన్నాడు నర్సిరెడ్డి, కాలు వెనక్కు దీసుకుంటూ.

"నిన్న పెద్దొరసాని మేనలొస్తుంటే బాటల బర్రెలున్నయని- పశులగాస్తున్న పోరగాల్లను పట్టుకొచ్చి సావగొడుతున్నారు పటేలా నీ బాంచన్. మా పోరగాడ్ని గొడ్డును బాది

నట్లు బాదిండ్రు. కోళ్లగుదేసి ఎండల పండ బెట్టిండ్రు. అయ్యలేనోడు. ఆడొక్కడే నాకు దిక్కుపటేలా. ఆడికేమన్నయితే నేను బతక పటేలా! పున్నెముంటది. నా కొడుకును రచ్చించుండి పటేలా!"

"నన్నేం చేయమంటవే! ఇసువంటివి రోజూ మామూలేగదా!"

"అట్లంటే మాకింక దిక్కోరు పటేలా! యీవూర్ల పున్యాత్ములు, ధర్మాత్ములు మీరొక్కరే. ఎట్లగన్న నా బిడ్డను రచ్చించు పటేలా!" అన్నది రెండు కాళ్ళు పట్టుకుంటూ.

"సరే పద. ఏమిటో తెలుసుకుంట" అన్నాడు నర్సిరెడ్డి.

★ ★ ★

గోపాలరెడ్డి జిల్లాలో పేరున్న వకీల్ సంఘసంస్కర్తగా, ఆంధ్రమహాసభ నాయకుడిగా అంతే పేరు పొందాడు. గాంధేయవాదిగా హరిజనసేవాసంఘ్, ఖద్దరు ఉద్యమంలో పాల్గొంటున్నాడు. ఆయన కొక్కతే కూతురు శకుంతల. భార్య చనిపోయి చాలాకాలమయ్యింది. అప్పటినుండి తల్లీ తండ్రీ తానే అయి కూతుర్ను పెంచుతున్నాడు. ఆమె బి.ఎ. చదువుతున్నది. మంచి సంబంధం చూసి పెళ్ళిచేయాలనుకున్నాడు. కానీ, శకుంతల రవిని ప్రేమించిందని తెలుసుకొని అతని వివరాలు తెలుసుకున్నాడు. రవి తండ్రి నర్సిరెడ్డి తనకు సుపరిచితుడు. దూరపు బంధుత్వం కూడ వున్నది. రవి, శకుంతలతోపాటే చదువుతున్నాడు. ఈడూ- జోడూ బాగున్నదని, కూతురు యిష్టప్రకారం నర్సిరెడ్డితో మాట్లాడి సంబంధం ఖాయం చేశాడు. వచ్చే ముహూర్తాల్లో పెండ్లికి ఏర్పాట్లు చేస్తున్నాడు గోపాలరెడ్డి.

గోపాలరెడ్డికి పట్నంలో పెద్ద బంగ్లా వుంది. కారు, నౌకర్లు, అధికారుల్లో పలుకుబడి వున్నది. కూతురు చదువుకోసం పట్నంలో వున్నా, స్వంత వూరిలో భూములున్నయ్. యింకా విలువైన ఆస్తులున్నాయ్. వాటన్నిటికీ వారసురాలు శకుంతలే.

బంగ్లామీద వరండాలో కూర్చొని వీణ వాయిస్తున్నది శకుంతల. ఆకుపచ్చ చీర కట్టుకొని, ఎర్రని బొట్టు పెట్టుకున్నది. ఆమె కళ్ళు మిలమిల, పళ్ళు ముత్యాల్లా మెరుస్తున్నాయ్. నల్లని శిరోజాలు భుజమ్మీద వేలాడుతూ, గాలికి కదలాడుతున్నయ్. ఆమె రామచిలకలా ఎంతో అందంగా వుంది. వీణలో లీనమై వీనులవిందైన రాగాలు ఆలపిస్తున్నది.

రవి వచ్చిందామె గమనించలేదు. అతనామెకు అంతరాయం కలిగించదలుచుకోలేదు. తలుపు దగ్గర నిలబడి వీణానాదంతో తన్మయత్వం పొందుతున్నాడు. రవిని చూసి, శకుంతల ముఖంలో ఆనందం వికసించింది. వీణపక్కనబెట్టి దిగ్గునలేచి రవి దగ్గరకొచ్చి

"ఎంత సేపయ్యిందొచ్చి? " అన్నది.

"ఇంత గొప్పకళాకారిణివని తెలియదు" అన్నాడు రవి.

"యేదో కాలక్షేపానికి తప్ప కచేరీలు చేయడానికి కాదుగద? "

ఇద్దరూ మధ్య గదిలోకి నడిచారు. ఆ గదినిండా బీరువాల్లో పుస్తకాలున్నయ్. అందులో 'లా' పుస్తకాలు-. కొన్ని పౌరాణికాలు, మతగ్రంథాలు, రాజకీయ గ్రంధాలున్నయ్. గోడలకు గాంధీ, తిలక్, ఠాకూర్, వివేకానందుడు, గురజాడ, వీరేశలింగం, బుద్ధుడు, వెంకటేశ్వరస్వామి ఫొటోలున్నాయ్. ఒకపక్క వకీల్ దుస్తుల్లో గోపాలరెడ్డి ఫొటో వుంది.

రవి, శకుంతల సోఫామీద ఎదురెదురుగా కూర్చున్నారు.

"యేమైపోయినవ్ యిన్నిరోజులు? యెక్కడికి పోయావ్ చెప్పకుండ? " శకుంతలడిగింది. రవి సమాధానం చెప్పకుండా,

ఆమెను రెప్పార్చకుండా చూస్తున్నాడు.

"యేమిటట్ల చూస్తున్నవ్? ఎన్నడు చూడనట్లు? "

"ఈరోజు నువ్వు చాలా అందంగున్నవ్ శశీ"

"అంటే యింతకుముందు బాగలేనన్న మాట. నా అందం యిప్పుడు కనబడిందన్న మాట!" అన్నది శకుంతల. "ఇంతకు నేనడిగిందానికి సమాధానం చెప్పలేదు. వారం రోజుల్నుండి ఎక్కడికి పోయావ్? "

"పనిమీద వెళ్ళిన"

"యేం పనీ? చెప్పకూడని రహస్యమా? "

"నిజంగా రహస్యమే"

"యేమిటో అంత రహస్యం? నాకు తెలియకూడని రహస్యాలు కూడా వున్నయన్న మాట? "

"కొన్ని విషయాలు అంతే శశీ"

"నీకీమధ్య ఎక్కువయ్యింది"

"యేమిటది? "

"పొగరు" అని, నోరు జారినందుకు నాలుక కర్చుకొని "సారీ" అన్నది. రవి పెద్దగా నవ్వాడు. ఆమె నవ్వింది. నౌకరు చాయ్ దెచ్చి టేబుల్‌మీద పెట్టిపోయాడు. ఒక కప్పు దీసి రవికి అందిస్తూ మళ్ళీ అడిగింది శకుంతల.

"చెప్పు రవీ! యిన్నిరోజులు కనబడకపోతే నేనెంతో ఖంగారుపడ్డ"

"ఇకముందు నువ్వు ఖంగారు పడకుండా వుండాలనే..." చెప్పబోయి ఆగిపోయాడు.

"యేమిటో? నువ్వీరోజు వింతగా మాట్లాడుతున్నవ్! యిప్పుడే యిట్లుంటే ఆ తర్వాత ఎట్లుంటవో? " అన్నది.

"నీకో విషయం చెప్పాలని వచ్చిన. కానీ, నువ్వు నన్ను అపార్థంచేసుకుంటావేమోనని భయపడుతున్న" అతని ముఖంలో విచారం, మాటల్లో తడబడటం గమనించింది శకుంతల. యేదో చెప్పాలని వున్నా చెప్పడానికి సందేహిస్తున్నాడని అర్థంచేసుకున్నది.

"యెందుకట్లున్నవ్? యేమి జరిగింది? నా వల్ల ఏమైనా పొరపాటు జరిగిందా? నీ మనసుకు బాధ కలిగించిన్నా? చెప్పు రవీ! చెప్పకపోతే నాకెట్ల తెలుస్తుంది? " దగ్గరికెళ్ళి పక్కన కూర్చొని చేతులు బట్టుకొని బతిమాలుతున్నది. రవి నిట్టూర్పు విడిచి, ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"శశీ! నువ్వు నన్ను మరిచిపోవాలె" అన్నాడు.

శకుంతల గుండెలమీద బండ బడ్డట్లు అయ్యింది. నోట మాటరాక అతన్నే చూస్తూ వున్నది.

"అవును శశీ! నేను పెళ్ళిచేసుకోవద్దనుకున్న. రాజకీయాల్లో ప్రవేశించిన"

శకుంతల ముఖంలోని విషాదంపోయి-ఒక్కసారి ఫక్కున నవ్వింది. అతని బుగ్గమీద చిలిపిగా కొట్టి, "ఇది చెప్పడానికేనా యింత అవస్తపడ్డావ్? యిక నువ్వేం రాజకీయ నాయకుడివైతవ్? " అన్నది.

"అంతే కాదు శశీ! చదువు కూడా మానేసిన"

"అయ్యో పాపం! ఆ చదువేమన్నది? " అన్నది కొంటెతనంగా!

"నా జీవితాన్ని రాజకీయానికి, దేశానికే అంకితం చేద్దామన్న నిర్ణయం తీసుకున్న" అన్నాడతను.

"సరే! రాజకీయాల్లో చేరుతున్నవ్! చదువు మానేస్తున్నవ్. బాగానే వుంది. మరి పెళ్లి ఏమడ్డమొచ్చింది? రాజకీయాల్లో వున్నవాళ్లంతా పెళ్లిళ్ళు చేసుకోలేదా! పిల్లల్ని కనడంలేదా? మానాయన కూడా రాజకీయ నాయకుడే గదా? " అన్నది శకుంతల.

"కానీ- మా రాజకీయం వేరు"

"ఓహో అదా నీ అనుమానం. మా నాయనగారి వ్యతిరేక పార్టీ అన్నమాట. దానికి మా నాయన అంగీకరించడు. నేనొద్దంటాననా నీ సందేహం? "

"అది కాదు శశీ! నీకెట్ల జెప్పాలో నాకర్థం

గావడంలేదు"

"యీ చిక్కుముడులన్నీ వద్దు- చెప్పేదేదో సూటిగా చెప్పు! నేనంటే యిష్టం లేదా? అసలు పెళ్లిచేసుకోవడం యిష్టంలేదా! చెప్పు రవీ" ఆదుర్దాతో అడిగింది.

"కాదు శశీ! నేను పెళ్ళే చేసుకోవద్దన్న నిర్ణయానికొచ్చిన? "

"శహబాష్! మగ పురుషులు గదండీ! యేమైనా అనగలరు? యేదైనా చేయగలరు. ఆమాట ఎప్పుడో చెప్పితే సరిపోయేది గదా! ప్రేమన్నవ్? పెళ్లన్నవ్! నేను లేనిది నీకు జీవితమే లేదన్నవ్? కలిసి మెలిసి తిరిగినం! మన పెద్దలు అభ్యంతరం చెప్పక పెళ్లికి అంగీకరించి, అన్ని ఏర్పాట్లుచేస్తుంటే... యిప్పుడు మీరొచ్చి "నువ్వు నాకక్కరలేదు. పెళ్లే చేసుకోను" అంటే యేమన్నట్లు? దీన్నేమనాలె. మోసమా! దగా? నువ్వే చెప్పు రవీ" అన్నది ఆవేశంగా.

"నువ్వంటే నాకు యిష్టంలేక కాదు. వేరే వ్యక్తిగత స్వార్థంకాదు. మాది విప్లవ పోరాటం. చావో బతుకో తేల్చుకునే సాయుధ పోరాటం. ఆ పోరాటంలో నేనేమైనా కావచ్చు నా కారణంగా నీ జీవితం నాశనం కావడం నాకిష్టంలేదు. అందుకే... అందుకే శశీ! నేనీ నిర్ణయం తీసుకున్నాను" అతని కళ్లల్లో నీళ్ళు నిండినయ్. మాట గద్గద మయ్యింది.

రవి మనోగతం అర్థంచేసుకున్నది శకుంతల.

"రవీ... నాకు రాజకీయాలు తెలియవు. నీమార్గానికి అడ్డురాను. నీ యిష్టప్రకారం చెయ్. కానీ- దానికీ మన పెండ్లికి ముడిపెట్టొద్దు ప్లీజ్" ప్రాధేయపూర్వకంగా అన్నది.

"వద్దు శశీ! నన్ను అర్థంచేసుకో, నేను చెప్పేది నీ మేలు కోరే. నీవంటే నాకు ప్రాణం. నీవు సుఖంగా ఉండాలన్నదే నా కోరిక."

"జరిగింది మరిచిపోయి మరొకన్ని చేసుకొని సుఖంగా కాపురం చెయ్యమంటవ్. అది చెప్పడానికేగద నువ్వొచ్చింది? "

"అవును శశీ! చివరిసారిగా నిన్ను చూసి వీడ్కోలు తీసుకుందామని వచ్చిన. మాది ప్రతి నిమిషం మృత్యువుతో చెలగాటం- శత్రువుతో పోరాటం. ఆ పోరాటంలో నేనేమైనా బాధపడను. విప్లవానికి నా జీవితం అంకితం చేస్తున్నాను. అందువల్లనే నీకు బాధ కలిగిస్తున్నందుకు క్షమించు. మళ్ళీ కలుసుకునే అవకాశం వుంటుందో లేదో తెలియదు... వస్తాను శశీ" అని లేవబోతున్న రవిని ఆపి,

"ఈ నిర్ణయం ఎందుకు తీసుకున్నవని అడగను! నీ దారి నువ్వు చూసుకున్నవ్. యిక నా నిర్ణయం కూడా వినిపో... నీవు చెప్పినంత తేలికగా నిన్ను మరిచిపోయి మరొకర్ని చేసుకొని కాపురం చెయ్యడం జరగదు. పెళ్ళంటూ జరిగితే అది నీతోనే బతికినంత కాలం నీకోసం ఎదురుచూస్తుంటానన్నది మరిచిపోవద్దు" పట్టరాని దుఃఖంతో అన్నది శకుంతల.

రవి "వస్తాను శశీ" బరువైన మనసుతో అని, బయటికి నడిచాడు. గేటుదాకా శకుంతల అతన్ని సాగనంపి, అక్కడే నిలబడిపోయింది. కన్నీటితో వీడ్కోలు చెపుతూ అతను కనిపించేదాకా చూస్తూనే వున్నది.

అప్పుడే కోర్టునుండి వస్తూ గోపాలరెడ్డి కారు దిగాడు. కంట తడిబెడుతూ గేట్లో నిలబడ్డ కూతుర్ని వేగంగా వెళ్లిపోతున్న రవిని చూశాడు.

"యేమిటమ్మా! యేమిజరిగింది? దేనికి, రవి అంత హడావిడిగా పోతున్నడు? " అడిగాడు.

"దేశం పిలిచిందట! విప్లవం రమ్మన్నదట! అందుకే ఆ తొందర" అన్నది దుఃఖంతో.

"పోనీలేమ్మా! యెక్కడికి పోతడు. అదంత నేను జూస్తగని. నువ్వేం పరేషాన్ గాకు. పదమ్మా" అని కూతుర్ని సముదా

యిస్తూ ఇంట్లోకి తీసుకెళ్లాడు గోపాలరెడ్డి.

★ ★ ★

పట్నం పోయిన నర్సిరెడ్డి ఎండలో తిరి గొచ్చాడు. ఇంట్లోకి రాగానే శాంతమ్మ భర్త చేతిసంచి, కఱ్ఱ, కండువ అందుకుని చెంబుతో కాళ్ళకు నీళ్ళిచ్చింది. కాళ్ళు చేతులు కడుక్కుని నర్సిరెడ్డి బల్లెపీటమీద కూర్చున్నాడు. శాంతమ్మ గ్లాసుతో మంచి నీళ్ళు తెచ్చియిచ్చి భర్తకెదురుగా మొగరాని కానుకొని కూర్చుంది. అతను అలసటతో పాటు ఏదో విచారంగా వున్నట్లు గమనిం చింది.

"యేమిటండి అట్లున్నరు? ఏమ య్యిందీ? " నెమ్మదిగా అడిగింది శాంతమ్మ.

నర్సిరెడ్డి మాట్లాడలేదు. తలబట్టుకొని ఆలోచిస్తున్నాడు.

"ఒంట్లో బాగలేదా? అయినా యింత ఎండలో ఎందుకొచ్చిండ్రు? " అని దగ్గరికి పోయి వొంటిమీద చెయ్యిబెట్టి చూసింది. నర్సిరెడ్డి విసుగుతో చెయ్యి తోసేశాడు. భర్త మనస్తత్వం శాంతమ్మకు బాగా తెలుసు. ఎవరిచేతా మాటనిపించుకోడు. మాటంటే పడడు. అన్యాయమనుకుంటే ఎంతటివాళ్ల నైనా ఎదిరిస్తాడు. న్యాయానికి నిలబడ తాడు. పట్టుదలవస్తే ప్రాణానికి తెగిస్తాడు. ఎదుటివాళ్ళు బాధపడుతుంటే చూడలేడు. నలుగురికీ మేలు చెయ్యాలనుకుంటాడు. ఆరు నూరైనా నూరు ఆరైనా అన్నమాట మీద నిలబడతాడు. కోపమెక్కువ కానీ అది ఎంతోసేపుండదు. కల్మషం లేని మనిషి. ఏదో జరగకపోతే ఎందుకిట్లుంటాడు. ఏమి జరిగిందో తెలుసుకోవాలని శాంతమ్మ ఆదుర్దా పడుతున్నది.

"చెప్పరేమండీ... యెందుకట్లున్నరు? పోయిన పని అయ్యిందా? అబ్బాయి ఎప్పు డొస్తానన్నడు? " ప్రశ్నలు కురిపిస్తున్నది. నర్సిరెడ్డి కోపంతో,

"వస్తడు. తలుపు దగ్గర కాసుకకూర్చో" విసుగ్గా అన్నాడు.

"అయ్యో! ఎందుకంత కోపం? అబ్బాయి సంగతడిగితే ఎందుకంత మండిపడతరు? " అర్థంగాక అన్నది.

"నీ కొడుకు సంగతి నన్నడుగొద్దు"

"యేమయ్యింది? యేం జేసిండు? "

"నా పర్వుదీసిండు. యీ కొంపకు ముప్పుదెచ్చిండు" బిగ్గరగా అన్నాడు.

"యేమిజేసిండో చెప్పకుండా మీలో మీరు బాదపడితే నాకెట్ల దెలుస్తది? "

"రేపట్నుండి చాటింపేసి చెప్తతరు. అప్పుడినువు నీ కొడుకు ఘనకార్యం"

తల్లీ- తండ్రి ఘర్షణ పడుతుండటం విని లోపల్నుండి వచ్చింది సుగుణ.

"యేమయ్యింది నాయన. అన్నయేమ న్నడు? " తల్లి పక్కనే కూర్చుంటూ అడి గింది సుగుణ.

"మీ అన్న దేశాన్నుద్ధరించబోతుండమ్మా! పెద్ద మొనగాడైపోయిండు" ఆ మాటల్లో ఆవేదన కనబడింది.

"అసలు బుద్ధితక్కువ నాది. పెద్ద చదువు చదివిస్తే వుద్దరిస్తాడనుకున్న! కానీ ఇట్ల జేస్తడని కలలో గూడా అనుకోలేదు" విచారం వ్యక్తం చేశాడు.

శాంతమ్మకు అసలు విషయం తెలుసుకో వాలన్న ఆదుర్దా. భర్త విషయం చెప్ప కుండా మాటలనడం భరించలేక కొంచెం కఠినంగా అడిగింది.

"వాడేమి తప్పుజేసిండో చెప్పకుండ వూర్కెనే ఎందుకట్ల రుసరుసలాడతరు? "

"నీముద్దుల కొడుకు నిర్వాకం చూసి మురిసిపోదువులే!"

"మీరెప్పుడింతే. యే విషయం సక్కంగ జెప్పిండ్రు? నా కొడుకెప్పుడు తప్పుడు పని చేయడు"

"వాడు నీ కొడుకేనే! నా కొడుకైతే యిట్లెం దుకుజేస్తడు? చదువు మానేసి సంగంలో జేరిండు. సర్కార్‌మీద సవాలంటున్నడు. పెండ్లికి ఏర్పాట్లు చేస్తుంటే వాడు ఇల్లే వది

లిపెట్టిపోయిండు. ఆ అమ్మాయి శకుంతలకు అన్యాయం జేసిండు. గోపాలరెడ్డిగారికి అవమానం జేసిండు. నాకు తలవంపు జేసిండు. మన ఇంటి పరువు దీసిండు. ఇంకేం జెయ్యాల్నే"

బాధను వ్యక్తం చేస్తూ అన్నాడు నర్సిరెడ్డి.

"అన్నయ్యతో మాట్లాడినవా నాయనా? " అడిగింది సుగుణ.

"నాకెక్కడ కలిశాడమ్మా. ఎప్పుడో పట్నమొదిలి పోయిండట"

"మీరెన్నన్నా మన రవి తప్పుడు పని చెయ్యడండి? " భర్తను శాంతింపచేయాలని చూసింది శాంతమ్మ.

"తప్పో వొప్పో రేపటి నుండి తెలుస్తది. నలుగురు నానారకాలుగ అనుకుంటుంటే..."

"ఎవరా నలుగురు? మీదొర, ఆ పటేండ్లేనా? "

"వాళ్ళు దలుచుకుంటే ఏమైనా చెయ్యగలరు. నిన్నూ, నన్నూ వూర్లోనుండి తరిమేయగలరు. అప్పుడు ఇద్దరం చెరో చిప్పబట్టుకొని అడుక్కుతిందాం"

తండ్రి ఆవేదన, ఆవేశం అర్థం చేసుకున్నది సుగుణ. వాళ్ళిద్దరి మధ్య వాదన జరగకుండ నివారించాలనుకున్నది.

"అమ్మా నువ్వూర్కో! మాటకు మాటెందుకంటవు" అన్నది.

"దేవుడెట్లరాస్తె అట్లయితది, తప్పుద్దా" అన్నది శాంతమ్మ.

"ఊc అంటే దేవుణ్ణి అడ్డం బెట్టుకొస్తవ్? '
' అన్నాడు నర్సిరెడ్డి కొంచెం శాంతించి.

"మీరు మాత్రం! కష్టమొచ్చిన, నిస్టూరమొచ్చిన రామా, కృష్ణా అనరూ? " దెప్పిపొడిచింది శాంతమ్మ.

"మాటలు నేర్చినవ్" చిరునవ్వుతో అన్నాడు నర్సిరెడ్డి.

"మీరేమో నోట్లో వేలేసుకున్నరు? "

"చూస్తున్నవా సుగుణ! వింటున్నవా మీ అమ్మ మాటలు"

"నీకేం దెలుసే! మీ నాయన సంగతి. నేను గాబట్టి ముప్పయి ఎండ్లనుండి నెగుల్తున్న" కూతురు వంక చూస్తూ అంది శాంతమ్మ.

"అబ్బో ఎన్ని కష్టాలు పడ్డది. ఎంత భారం మోసిందనుకున్నవ్? అందుకేనే మీ అమ్మ నెత్తంత తెల్లబడ్డది" అన్నాడు నర్సిరెడ్డి చమత్కారంగా.

"ముసలోల్లయితుంటే తెల్లబడకుండ నల్లబడతదా? నా సంగతట్లుంచు మీ నాయన నెత్తిమీద జుట్టే లేదు. ఎందుకో తెలుసా? కోపమొచ్చిన తాపమొచ్చినా ఆ జుట్టుమీదనే చూపుతడు" అంతే చమత్కారంగా అన్నది శాంతమ్మ.

"నేను పీకేసుకున్ననో, నువ్వే లాగేసినవో? ఎవరికెర్క? " నవ్వుతూ అన్నాడు.

"సరేగని అమ్మా! నాయనకు అన్నం బెడ్తవా? లేదా? ముందు అన్నం బెట్టు. తర్వాత పోట్లాడుకుందురుగని" అన్నది సుగుణ లేస్తూ.

"అది తిన్నదిగదా! నా కడుపు నిండిందనుకుంటది"

"అవును పాపం! నిద్రలో వుంటే లేపి ముద్దలు తినిపించింది మరిచిపోయిండు మీ నాయన"

"అదెప్పుడో లే? " అన్నాడు నర్సిరెడ్డి.

"ఇప్పుడు తినిపించమంటడేమో? అడిగే" అన్నది శాంతమ్మ.

★ ★ ★

గడిలోపల పనోళ్లు వెట్టిపనులు జేస్తున్నారు. ఆడోళ్లు కుందెనలుబెట్టి వడ్లు దంచుతున్నారు. కారం గొడుతున్నారు. కొందరు జల్లెడ బడుతున్నారు. విస్తళ్లు కుడుతున్నారు. మగోళ్లు గోడలకు సున్నం గొడుతున్నారు. కట్టెలు పగలగొడుతున్నారు. బయటినుండి సామాన్లు మోసుకొస్తున్నారు.

పెద్దొరసాని అరుగుమీద తూగుటుయ్యాలలో వూగుతూ పనులు జేసేవాళ్లను గమ

నిస్తున్నది. ఆడబాప వెనక నిలబడి ఉయ్యాల వూపుతున్నది. కొద్ది ఎడమగా కుర్చీమీద పటేల్ పాపిరెడ్డి కూర్చున్నాడు. అయ్యోరు సీతయ్య కాగితం, పెన్సిల్ బట్టు కొని దొరసాని కెదురుగా నిలబడ్డాడు. మస్కూరి కొండడు కులపెద్దలను తీసుకొస్తు న్నాడు. వచ్చే కులపెద్దలు భయం భయంగా లోపలికి అడుగుబెడుతూ దొర్సా నికి వొంగి దండం బెడుతున్నారు. చేతులు గట్టుకొని దూరంగా నిలబడుతున్నారు.

పనివాళ్లు పనెలా జేస్తున్నారో చూసేటం దుకు దొర్సాని ఉయ్యాల దిగి కిందికొ చ్చింది. బియ్యం పట్టిచూసింది. అందులో పరిగె, పెద్ద చూసి భగ్గుమన్నది. ఆడోళ్లు హడలిపోతున్నారు. 'మంచిగ జేస్తం దొర్సాని కాల్మొక్త" అని బతిమాలుతున్నారు. కారంపొడి పట్టిచూసింది. వేలుతో నలిపి చూసింది. బిరుసుగ వున్నదని ఆగ్రహం చెంది- ఆ కారం ఎదురుగున్న ఆడోళ్ళ కండ్లల్ల జల్లింది. వాళ్ళు లబోదిబోమని మొత్తుకుంటున్నారు. ఏదో ఒక తప్పుబ డ్తది. తిట్లు, తన్నులు తప్పవన్నది పన్జేసే వాళ్ళందరికెరకే. ఊపిరి బిగబట్టుకుని శక్తిని కూడగట్టుకొని వేగంగా పనులు జేస్తు న్నారు.

యాదగిరి మొద్దులు పగలగొడుతు న్నాడు. దగ్గరికొచ్చి కట్టెలు చూసింది. యాదగిరి శరీరం చెమటలతో తడిసింది. బలమంతాబెట్టి గొడ్డలేసినా చెక్క పేడు రావడంలేదు. పచ్చి తుమ్మ మొద్దు ఖంగ్ ఖంగ్ మంటున్నది.

"ఏయిరా పొద్దట్నుంచి కొట్టిన కట్టెలు? " అన్నది. యాదగిరి మారుమాట్లాడకుండా మరింత బలంగా కొడుతున్నాడు. వరస పెట్టి అన్ని పనులు చూస్తూ అందర్నె గమ నిస్తున్నది. విస్తళ్లు కుట్టే ఆడోళ్ళ దగ్గరికొచ్చి ఆగింది. ఒక విస్తరితీసి వెనకముందు పరి శీలించింది. దానికి బొజ్జం గనబడింది. "ఏందే ముండ, కండ్లు కనిపిస్తలేవా? ఇది ఇస్తరా? జల్లడే? " అని విసిరి మొఖానగొ ట్టింది, పనులు చేసేటోళ్ళందరికీ హెచ్చరి కగా పెద్ద గొంతుతో.

"అందరు వొళ్ళు దగ్గరబెట్టుకుని పన్జే యండి. లేకుంటే దెబ్బుగద జాగర్త" అని పోయి ఉయ్యాలలో కూర్చున్నది. దొర్సాని కోపం అక్కడున్నోళ్ళంత చూస్తున్నారు. తమకేమౌతుందోనని గుబులు బడుతు న్నారు.

"సరుకులన్ని వచ్చినయా! అందరు మామూల్లు ఇచ్చిండ్రా" సీతయ్య నడిగింది దొర్సాని.

"ఏమొచ్చినయ్ దొర్సానీ! సావుకారు సర్కులొచ్చినయ్ గంతే" అన్నాడతను.

"మరీ పటేలేంజేస్తున్నడు? ఏమిటయ్యా నీ పటేల్‌గిరి గిట్లున్నది? "

"ఏంజేయమంటరు? ఇయ్యాల రేపని దాటేస్తున్నరు. గందుకే అందర్ని పిలిపిం చిన, మీరే అడగండి దొర్సానీ" పటేల న్నాడు.

"మంచిగజెప్తె యింటరా? నీ మెత్తదనం చూస్తె గట్లనే జేస్తరు" అన్నది. పటేల్ లేచి నిలబడ్డాడు. అందరివంక జూశాడు.

"యిన్నార్రా? దొర్సానేమంటున్నదో? దొంగముండాకొడుకుల్లారా పటేల్ పాపిరె డ్డంటే తమాషనుకున్నార్రా? సూపిస్త" అని బెత్తందీస్కొని వర్సబెట్టి కొడుతున్నాడు. "అయ్యో! అమ్మో" అంటున్నారుగనీ, మాట చెప్పడంలేదు. కొట్టి కొట్టి అలసిపోయి పటే లన్నాడు. "నీయమ్మ! మొండికేస్తున్నర్రా! వొళ్ళప్పగిస్తున్నరుగని నోర్దెర్వరేందిర? ఎన్నడులేదు. ఎందుకట్ల జేస్తున్నర్రా? " విసి కిపోయాడు పటేల్.

"దొర పరువు దీయాలనుకుంటున్నర్రా! దసరా పండగ వస్తుంది. ఇనాంలియ్యాలని తెల్వదురా! ఈసారి పట్నంనుండి చాలా మంది దోస్తులువున్నరని దొరవారు జెప్పిండ్రు. వాళ్ళందరికీ మంచీ చెడ్డ చూడొద్దా! మర్యాద చెయ్యొద్దా! ఒకరిద్దరు

గాదు వంద మందొస్తున్నారట. ఇయ్యాల్టికి యాటల్లేవు, కోళ్ళు లేవు, సరుకుల్లేవు, కల్లు సార సంగతేమిటో తెల్వదు. ఎట్లయిత దిరా? మీరట్లజేస్తే ఎట్ల జెయ్యాలో తెలవ దనుకుంటున్నరా? దొర మంచితనం జూసి నెత్తికెక్కుతున్నరా? నా సంగతి దెల్సుగదా: పాణాల్ దీస్త. ఏమనుకుంటున్నరో? " కోప మంత కక్కింది పెద్దొరసాని.

పటేల్ పెద్దగొల్ల లింగని దగ్గరకెళ్ళి బెత్తం చూపుతు గద్దించి అడిగాడు.

"ఓరే లింగ! అసలు సంగతేందో చెప్పరా? "



లింగడు ధైర్యంచేసి నోరువిప్పాడు, "నీ కాల్మొక్త. సెప్పడాన్కేముంది పటేలా? బాంచన్, యాడ్నుంచిదేను గన్ని యాటల్ని? " అన్నాడు.

"ఎక్కడ దెస్తనంటవేందిర కుక్కలకొడ్క. నఖ్రాల్ జేస్తున్నవ్. పుణ్యానికిస్తున్నావుర? మేపుకుంటలేవుర, పొరంబోకులు, బంజరు భూములల్ల- నీయమ్మ సొమ్మనుకున్నవుర



గాడ్డికొడక . పోగులుదీస్త ఏమనుకు న్నవో? " అని బెత్తమెత్తాడు పటేల్.

"కొట్టండి సంపండిగని నావల్లగాదు పటేలా" ఖచ్చితంగా చెప్పాడు లింగడు.

"నీకు మదమెక్కిందిర. కండ్లకావర మెక్కిందిర. ఇంతకుముందోసారి గిట్లనే జేస్నివ్. తన్నులు దిన్నవ్‌గని యాటనియ్యా లేదు నీయమ్మ. నీ సంగతి సెప్పుత వుండు"

అని పక్కనున్న గౌండ్ల భిక్షపతి నడిగాడు "నీ సంగతేందిర గౌండ్లోడ" అని.

"దండంబెడ్త పటేలా! ఎన్నడన్న కాద న్ననా? ఎట్లజెప్పితే గట్లజేస్నా. కానీ చెట్లెం డిపోయినయ్. కల్లెక్కడనుండి దేను పటేలా? " చేతులు జోడించి దండంబెట్టాడు భిక్షపతి.

"గదంత తెలువదు. కల్లుదెస్తవో? సారదె స్తవో! ఎట్లదెస్తవో ఏంజేస్తవో నాకెర్కలేదు. వచ్చే మెహమాన్లందర్కి మంచిగ జల్స జర్గాలె బస్. లేకుంటే నువ్వు బతికుండవ్"

భిక్షపతి మాట్లాడలేదు. పటేల్ పరేషాన యితుండు. తిట్టి కొట్టి విసిగిపోయిండు. దొర్సానితో అన్నాడు...

"లమ్డీకొడ్కులు నాటకమాడుతుండ్రు దొర్సానీ. అసలు కిట్కంత ఈ గొల్లోడి దగ్గరే వున్నది. ఈన్ని జూసి అందరు మొండికేస్తున్నరు. ఏంజేయమంటరు దొర్సాని? " అడిగిండు పటేల్.

"అదిగూడ నేను జెప్పాలా? ఆ లంజకొ డుకు ఒళ్ళు తాట వలిస్తే చెప్పినట్లింటడు" అన్నది. పాపిరెడ్డి గుడ్లు మిటకరించి లింగన్నని జూశాడు. చేతిలోని బెత్తం కింద బడేసి, కుర్చీదగ్గరున్న పొనుగఱ్ఱ తీసుకు న్నాడు. దగ్గరికిబోయి కఱ్ఱెత్తాడు.

లింగడు ఎత్తిన కఱ్ఱను బట్టుకుని పాపి రెడ్డి కళ్ళలోకి సూటిగా జూశాడు. అతని కండ్లు ఎఱ్ఱని నిప్పుల్లాగా వున్నాయ్.

పాపిరెడ్డి చేతులొణికినయ్. కఱ్ఱ కిందబ డింది. బిత్తరపోయి చూస్తున్నాడు.

లింగడు బొడ్లో దాచిన చీటిదీసి పటేల్ చేతిలో బెట్టాడు. ఎగాదిగా చూస్తున్న పటేల్ పరుగుతో బోయి దొర్సానికిచ్చాడు. ఆమె చూసి హడావుడిగా లోపలికి వురి కింది. దొర్సాని వెనక పటేల్ వురికాడు.

లింగన్న కెక్కడలేని ఆనందం కలిగి పక పకా నవ్వాడు. చీటి మహాత్యం తెలిసింది.

మీసం దువ్వుతూ అందరి వొంకజూ శాడు.

"లింగన్న యేమంత్రమేసిండో? ఏ తంత్రం జేసిండోనని వాళ్ళు ఆశ్చర్యపో యారు. అతని చుట్టుజేరి ప్రశ్నలవర్షం కురి పించారు. లింగన్న గర్వంగా మీసం మెలిబె డుతూ "సంగం చీటిచ్చిన" అన్నాడు.



పట్టెమంచమ్మీద పడుకొని పాన్ నము లుతూ ఆరాం చేస్తున్నాడు దొర. మంగలి పిచ్చయ్య కాళ్ళొత్తుతున్నాడు. పెద్దొరసానీ పటేలూ గాబరా పడుతూ రావడం జూశాడు దొర.

"ఏమయ్యింది? ఎందుకట్ల గఁబ్రాయిస్తు న్నారు? " తాపీగా అడిగాడు దొర.

"కొంపమునిగిందండి. మన వూర్లో కూడా సంగం బుట్టింది" ఆయాసపడుతూ చీటీ దొరచేతికిచ్చి మంచమ్మీద కూలబడింది దొర్సాని. చీటి చూసి దిగ్గున లేచాడు దొర. నిప్పుమీద ఉప్పులా అయ్యాడు. పటేల్ వంకజూశాడు. మంగలి పిచ్చయ్యకు అయో మయంగా వుంది. దూరంగా నిలబడి నోరు దెరిచి చూస్తున్నాడు.

"ఎక్కడుండాడు? " అడిగాడు దొర.

"ఆ డొక్కడుగాదు దొరవారూ! సూడబోతే వూరంత ఒక్కటైనట్లున్నది? " పటేల్ జవాబిచ్చాడు.

"చూస్త ఆ సంగం సంగతీ ఈళ్ళ సంగతీ చూస్త. అంతుదేలుస్త" దొర పళ్ళు పటపట కొరికాడు.

"ఏం జేస్తరో దొరవారు. లబ్డీకొడుకులు జిందగిలో మర్చిపోకుండా జెయ్యాలే" పటేలన్నడు.

"చీమల్లాగున్నాళ్ళు పాములైపోతున్నారు. ముందు ముందు ఇంకేమైతదో" గుబులుపడుతూ అన్నది పెద్దొరసాని.

మంగలి పిచ్చయ్య లోలోపల సంతోషపడుతున్నాడు.

"ఈ భాస్కరరావు దొర నెదిరించినోడు బత్కిబట్టగడ్తడా? వూర్ల వుంటడా? పెండ్లంతో కాపురం జేస్తడా! చూస్త. మీరేం ఫికర్ చెయ్యొద్దు. సాలోంకు ఏకేక్‌కూ ఖతం కరోంగ. సబ్‌కూ మార్‌డాలోంగా!" ఆవేశంతో వూగిపోతున్నాడు దొర.

"పాపిరెడ్డీ... పట్నంబోవాలె. కచ్చడం కట్టించు" అని పక్కగదిలోపలికి బోయాడు దొర.

★ ★ ★

దొర, చుడీదార్ పైజామా వేసుకున్నాడు. షేర్వానీ తొడుక్కున్నాడు. కుచ్చుటోపి బెట్టుకున్నాడు. అత్తరు బూసుకున్నాడు. అద్దంలో చూసుకున్నాడు. బెత్తం దీసుకున్నాడు.

నౌకరు కాళ్ళకు పాపోసులు తొడిగాడు. పెద్దొరసాని తిజోరిలోంచి రూపాయల కట్టలు దీసింది.

సేద్దార్ అబ్బాస్‌అలీ కచ్చడం గట్టి సిద్ధంగున్నాడు. దొర కచ్చడంలో కూర్చున్నాడు. అబ్బాస్‌అలీ తొట్టెలోకెక్కాడు. చెంద్రకోలతో కోడెల్ని చర్రు చర్రున కొట్టాడు. కోడెలు దవుడుదీస్తున్నాయ్. కచ్చడం ముందు మస్కూరి కొండడు పరుగుదీస్తున్నాడు. వెనకాల మంగలి పిచ్చయ్య చందుక నెత్తిన బెట్టుకొని వురుకుతున్నాడు. కచ్చడం కుదుపులతో వూగుతున్నది. దొర ఆలోచనలతో తూగుతున్నాడు. కోడెలు ఆయాసంతో నురగలు కక్కుతున్నాయ్. దొర ఆవేశంతో బుసలు కొడుతున్నాడు. కచ్చడం దుమ్ములో కనిపించకుండాబోయింది.

దొర పట్నం బోయాడనీ, పోలీసుల్ని దీసుకొస్తాడనీ వూరంతా పుకారు లేచింది. భయంతో వూరు వుడికిపోతున్నది. చుట్టుపట్టున జరిగే పోలీసు దాడులు, రజాకార్ల దుర్మార్గాలు వింటున్నారు. వూరూరా సంగపోళ్లు జెండాలు కట్టి, సంగం బెడుతున్నారని అనుకుంటున్నారు. వెట్టి చెయ్యొద్దనీ, పాతప్పులు కట్టొద్దనీ, లెవీగల్ల ఇయ్యొద్దని, దొరలు, జమీందార్ల, పటేల్, పట్వార్ల దౌర్జన్యం పోవాలని సంగపోళ్లు పోరాటం చేస్తున్నారని చెప్పుకుంటున్నారు. ఎక్కడ చూసినా ఇవే విషయాలు మాట్లాడుకుంటున్నారు. సంగపోళ్లు చెప్పేవి బాగానే వున్నయ్‌గానీ, దొరను ఎదిరిస్తే, సర్కారును కాదంటే బతకనిస్తారా? వూర్లో వుండనిస్తారా? అని సందేహిస్తున్నారు. రజాకార్లు రాక్షసుల్ని మించిపోయారనీ, ప్రాణాలు, మానాలు దీస్తున్నారనీ దోపిడీలు, దుర్మార్గాలు చేస్తున్నారనీ కథలుగా చెప్పుకుంటున్నారు. ఎప్పుడేమౌతుందోనని గుబులుపడుతున్నారు. దొర పోలీసులను తీసుకొచ్చి ఏంజేయిస్తాడోనని భయపడుతున్నారు.

పొద్దు బారెడెక్కింది. చెట్టుకింద కమ్మరి కోటయ్య కొలిమిదగ్గర కర్రులు, గడ్డపార్లకు మొనలు బెట్టించుకోవడానికి కత్తులు, కొడవళ్లకు పదును బెట్టించుకోవడానికి, గొడ్డళ్లకు సానబెట్టించుకోవడానికి వచ్చినవాళ్లున్నారు. కోటయ్య కొడుకు తిత్తులు ఊదుతున్నాడు. కోటయ్య కొలిమిలో పనిముట్లు పెడుతున్నాడు. కొలిమిలోని బొగ్గులు ఎర్రగ

మండుతున్నయ్. కోటయ్య ఎరుపెక్కిన

పనిముట్లను తీసి సమ్మెటమీద బెడుతు న్నాడు. ఎవరి పనిముట్టుకు వాళ్లు సమ్మెట దెబ్బలు వేస్తున్నారు.

రామయ్య కర్ర చేతబట్టుకొని ఆదరాబా దరా వచ్చాడు.

"కోటయ్య బావా! కర్రు మొన ఇరిగింది. అరక ఆపొచ్చిన, కాస్త జల్ది మొనబెట్టియ్యే" అని కర్రు అందించాడు. కోటయ్య కర్రును కొలిమిలో బెట్టి మామూలుగా పనిజేసు కుంటూ అడిగాడు.

"ఊర్కి బోయినవట ఎప్పుడొచ్చినవే? ఇప్పుడక్కడంత నిమ్మలమేనా? "

"ఏముంది. అంతా బూడిదజేసింద్రు. వూరంత ఆగమాగమయ్యింది. శానమందిని సంపింద్రు. కనిపించిన ఆడాళ్ళనందర్నీ ఆగంజేసింద్రు. నా బిడ్డ ఇక్కడుంది గాబట్టి గండం దప్పింది" అన్నాడు రామయ్య.

"ఈ రజాకార్లేందే గట్ల జేస్తున్నరు. ఆళ్లు మనుషులా రాచ్చసులా! గింత తెగబడ్డరు. గాళ్ళకు పెండ్లం పిల్లల్లేరా? ఈళ్లు గిట్ల జేస్తుంటే సర్కారేం జేస్తుందే సమజ్‌గాదు" కోటయ్య అన్నాడు.

"ఆళ్లు ఆళ్లూ ఒక్కటే. రజాకార్లను లేపింది సర్కారోళ్ళేనాయిరి. రజాకార్లు, పోలీసోళ్లు కలిసే చేస్తుంద్రు" రామయ్య చెప్పాడు.

"ఇగ మనకు దిక్కోరు? రాజే దొంగైతే రాజ్యమేడుంటది? " పక్కన కూర్చున్న రైత న్నాడు.

"సంగపోళ్ళనేదిగదే! వాళ్ళు మాత్రం వూర్కుంటున్నరా. దెబ్బకు దెబ్బ గొడుతు న్నరు. పోలీసోళ్ళను రజాకార్లను వూర్లల్లకు రాకుండ తరిమికొడుతున్నారు. ఆ వూర్లో రజాకార్లు చేసిందానికి వూర్కున్నరా! రజా కార్ల తానామీదబడి నలుగురైదుగుర్ని ఖతం చేసింద్రు. మిగిలినోళ్లు పారిపోయింద్రు. ఇప్పుడక్కడ సంగపోళ్ళదే రాజ్యం" వుషా రుగా చేపుతున్నాడు రామయ్య.

"మన వూరుదప్ప అన్ని వూర్లల్ల సంగమొ చ్చింది. దొరొల్లు, పటేల్లు పారిపోయింద్రు" చెప్పుకుపోతున్నాడు రామయ్య. అక్కడున్నో ళ్లుగాక దారినపోయేవాళ్లు గూడ నిలబడి వింటున్నారు. పొద్దొంక జూసి రామయ్య...

"పొద్దుబోతంది బావా! తొందరగా బోవాలె" అన్నాడు.

కోటయ్య కర్రుదీసి మొనబెడుతూ అన్నాడు...

"ఏందో యిదంతా! సర్కారేందో- రజాకా ర్లేందో- ఆ సంగమేందో? యేమైతదో!"

"అయ్యేదేమున్నది? బ్రహ్మంగారు చెప్పి నట్లే అయితది" ఇంటిముందు కూర్చుని హుక్కా పీలుస్తున్న కోటయ్య తండ్రి బ్రహ్మయ్య అన్నాడు.

"ఆకాశం ఎర్రనవును- ఆరుమతములు ఒక్కటౌను

సెప్పలేదనకపొయ్యేరు- నరులార గురిని

చేరి మొక్కితె బతకనేర్చేరు... ॥సెప్ప॥

సెప్పలేదంటనక పొయ్యేరు- తప్పదిదిగో

గురిని వాక్యము- తప్పుదోవల పోవు వారల

సప్పరించి మింగెశక్తులు... ॥సెప్ప॥"

రాగయుక్తంగా ఆలపించాడు బ్రహ్మయ్య.

"బ్రహ్మంగారు సెప్పింది తప్పుద్దా! పాపం బెరిగింది- గాబట్టే సంగమొచ్చింది" అన్నాడు.

"సూడబోతే గట్లనే అయ్యేటట్లున్నది" అన్నాడు రామయ్య కర్రు దీసుకొని వెళ్తూ.

★ ★ ★

చీకటిపడుతున్నది. ఇండ్లలో దీపాలు ముట్టిస్తున్నారు. పక్షులు గూళ్ళకు చేరుతు న్నాయ్. పనికిబోయిన జనం ఇండ్లకొస్తు న్నారు. పశువులు, జీవాల్ని తోలుకొస్తు న్నారు.

జై... బోలో స్వతంత్ర భారతికి-జై

ఒక్కసారి వూరంతా వినిపించింది. ఎక్క డివాళ్ళక్కడ ఆగిపోయారు. చెవులు పెద్దవి చేసి వింటున్నారు.

ఆంధ్ర మహాసభకు... జై

కమ్యూనిస్టు పార్టీకి జై

నినాదాలు మరింత దగ్గరగా వినబడ్డయ్. ఎన్నో గొంతులు కలిసి పలుకుతున్నాయ్. సంగపోళ్లు వచ్చారని జనానికి తెలిసిపోయింది. పిల్లలు అటువైపు పరుగెత్తుతున్నారు. ఆడోళ్లు ఇంటి గడప దగ్గరికి జేరారు. మగోళ్లు అక్కడక్కడ గుంపులు గుంపులు జేరుతున్నారు.

పెద్దొరసాని వులిక్కిపడ్డది. నౌకర్లు బిత్తరబోయి చూస్తున్నారు. పట్నంబోయిన దొర తిరిగి రాలేదు. పెద్దొరసాని గుండెదడ పెరుగుతున్నది. కాలు నిల్వడం లేదు. కర్తవ్యం బోధపడటంలేదు. నౌకర్లను పిలిచింది. రామిగాడు, లచ్చుంగాడు, యాదగిరి, దొరపనులు జూసే షబ్బీర్ పరుగెత్తుకొచ్చారు. పెద్దొరసాని గాబరా జూశారు. వూర్లోని నినాదాలు వింటున్నారు.

"ముందు దర్వాజ, యెనక దర్వాజ మూసెయ్యండి. దర్వాజల దగ్గర నిలబడండి. ఎవరొచ్చిన దర్వాజలు తెర్వొద్దు. ఊర్లో ఏదో అయ్యేటట్లుగున్నది. నాకు భయంగున్నది. దొరలేడాయే... నాకేం దోస్తలేదు. తొందరగా దర్వాజలెయ్యండి.... పటేల్ ఏమయ్యిండో సమయానికుండడు... ఒరేయ్ యాదిగా- తొందరగబోయి పిల్చుకరా!... ఒరేయ్ మీరు జాగర్తగుండండి... పొండి" అన్నది జానకమ్మ దొర్సాని. వాళ్ళు వెళ్ళిపోయారు. లోపల చాకలి నారయ్య లాంతర్లు వెలిగిస్తున్నాడు. పెద్దొరసాని గబగబా వచ్చి-

"ఒరేయ్... నారిగా. ఆటిని ఆర్పేయ్. ఇయ్యాల లాంతర్లొద్దు- కందిళ్లు చాలు" అంది.

"గట్లనే దొర్సాని" అని లేచాడు. లాంతర్లు దీస్కొని సామాన్ల గదిలోకి బోయాడు. కందిళ్లు దీస్కొని బయటికొస్తూ దొరసాని లాంతర్లు వద్దన్నదెందుకో అర్థంగాక తికమకపడుతున్నాడు. ఇంతలో... "జైబోలో స్వతంత్రభారతికి... జై..." అని వందల గొంతుల నినాదం విన్నాడు. సంగపోళ్ళొచ్చింద్రు- దొర్సాని బెదురుతున్నదనుకున్నాడు. మనసులో సంతోషంగా ఉన్నా పైకి వినయం చూపుతున్నాడు.

చిన్దొరసానికి యివేవీ పట్టినట్లు లేదు. మంచమ్మీద పడుకొని పుస్తకం చదువుతోంది. ఆడబాప ఖంగారు పడుతూ వచ్చి "అమ్మా... వూర్లకు సంగపోళ్ళొచ్చింద్రట" అన్నది. చిన్దొరసాని "ఎవరొస్తె మనకేమిటే? ఎందుకట్ల భయపడుతున్నవ్" అన్నది.

"కాదమ్మా! వాళ్ళు మామూళోళ్లు గాదు" అన్నది ఆడబాప.

"ఎవరైతేమే? మనషులేగద? "

"మనుషులేనమ్మా! కానీ- దొరలకు ఎతిరేకమట! గీళ్ళను జూసి దొరలందరూ పారిపోతుంద్రట? పెద్దొరసానికేం దోచడం లేదు. పిచ్చిదాన్లా కేకలు బెడ్తున్నది. బయటికి రామ్మా! మన జాగర్తలో మనముండటం మంచిది" అన్నది ఆడబాప.

చిన్దొరసాని పుస్తకం పక్కనపెట్టి మంచమ్మీదినుండి లేచింది.

"నేనేం తప్పుజేసిన్నే. నాకెందుకు భయం. నన్ను ఎవరేమంటరు? " ధీమాతో అన్నది చిన్దొరసాని.

"నిన్ను గాదమ్మా. దొరమీది కోపం నీమీద జూపిస్తరు! వద్దమ్మా!" అన్నది ఆడబాప. ఆమె అన్నదాంట్లో అర్థమున్నది. దొర భార్యనైనందుకు- మంచైనా- చెడ్డైనా తనకు భాగం తప్పదనుకున్నది. ఆడబాప వెనకాల పెద్దొరసాని చెంతకుజేరింది.

వూరంతా ఒకట్లైనట్లున్నది. వందల గొంతులు ఒక్కటై పలుకుతున్నాయ్. రాను రాను ఆ శబ్దం దగ్గర బడుతున్నది. ఎన్నడు లేనిది పెద్దొరసాని, చిన్దొరసానిని కౌగలించుకున్నది. భయంతో కంపించిపోతున్నది. చిన్దొరసాని, ఆడబాపలిద్దర్నీ దీసుకొని తన గదిలోకి పోయింది. పటేల్ పత్తా

లేకుండా పోయినందుకు మనసులోనే తిట్టుకున్నది.

సంగం సభ్యులు ఇద్దరిద్దరి చొప్పున వరుసగా నడుస్తున్నారు. ఖాకీ నిక్కర్లు, తెల్లని అంగీ లేసుకున్నారు. కొందరి భుజాలమీద తుపాకులున్నయ్. మరికొందరి భుజాల మీద గుత్పలున్నయ్. అందరూ కాళ్లు కలిపి నడుస్తున్నారు.

తెలుగుతల్లి బిడ్డలం
తెలంగాణ వీరులం
మాతృదేశ ముక్తికొరకు
పోరుసల్ప కదిలినాం
వెట్టిచాకిరి గట్టిపెట్టి
జబర్దస్తి నెగరగొట్టి
స్వేచ్ఛగాను బతుకుకొరకు
ఐక్యమయ్యి సాగుదాం
నిజామనగ ఎంతరా!
వాడి తాహతెంతరా?
ఖాసింరజ్వి ఎంతరా?
వాడి బిషాదెంతరా?
అందరం కలిసి తంతె
అంతుదొరక గుండురా ॥తె॥

పాట పాడుతూ, కదం కలుపుతూ వస్తున్నారు.

దళంముందు రవి వున్నాడు. దళంలో ముత్తయ్య, చంద్రయ్య, చంద్రమ్మ వున్నారు. వాళ్ళను జూసి జనమనుకున్నారు... "సంగపోళ్ళంటే గీళ్ళేనా? ఎట్లుంటరో అనుకున్నం" రవి- నర్సిరెడ్డి కొడుకని, పట్నంలో చదువుతున్నాడని, మంచి మనిషని వూరంతా దెలుసు. పెద్ద చదువు చదువుతున్నాడు, పెద్ద నౌకరి జేస్తాడని అందరు అనుకున్నారు. సంగంలో జేరిండంటే నమ్మలేక బోతున్నారు. ఆడోళ్లు- మగోళ్ళు గుసగుసలు బెడుతున్నారు.

రవిని జూసినాక యువకులకు ధైర్యమొచ్చింది. దళం వెనకాల నడుస్తున్నారు. పిల్లలు అందరికంటే ముందున్నారు. ఆనందంతో జైకొడుతున్నారు.

వాళ్ళను చూసి ఆడోళ్ళు మగోళ్లు అంతా కదిలారు. డప్పులు, కొమ్ములతో మాదిగ గూడెం లేచొచ్చింది. జై అంటే జై అంటున్నారు.

ఊరంతా తిరిగి గడిదగ్గరికి చేరారు.

గడి తలుపులు మూసేసున్నయ్. గడిలోపల చీకటున్నది. అది చూసి జనానికి మరింత ధైర్యమొచ్చింది. ఎన్నడు లేదు. గడితలుపులు, కిటికీలు మూసేసున్నాయ్. దొర, నౌకర్లు, రోజూ వుండే అట్టహాసం కనిపించడంలేదు.

గడి దగ్గరికి పోగానే ఒక దళసభ్యుడు చెట్టెక్కి నిటారుకొమ్మల్లో ఎర్రజెండా కట్టాడు. అందరూ ఆనందంతో "జై" అన్నారు. పటేల్, పట్వారీ పారిపోయారని చూసినోళ్లు చెప్పారు. దళసభ్యులు పోయి పటేల్, పట్వారి, షావుకారు ఇండ్లల్ల దస్త్రాలన్నీ మోసుకొచ్చారు. మంటబెట్టి వాటన్నిటిని తగలబెట్టారు. దొంగలెక్కలు, దస్తావేజులు తగలబడిపోతున్నయ్. అప్పుల పీడ బోతుంది- తమ భూములు తమకు దక్కుతాయని బాధలు పడ్డోళ్ళంతా అనుకుంటున్నారు. కొందరు మాత్రం ఇంకా దొర భయంతో గోడలచాటున, సందుగొందుల్లో వుండి చూస్తున్నారు.

తన కొడుకు రవి మరికొందరితో వూర్లో కొచ్చాడని, శాంతమ్మకు తెలిసింది. గడివద్ద సభ జరుగుతున్నదని- అందరు పోతుంటే తానూ పోవాలనుకున్నది. కానీ వచ్చినోళ్లకు అన్నంబెట్టాలని ఇంట్లోనే వున్నది. గబగబా అన్నమొండింది. కోడిగుడ్లు దెచ్చి కూరజేసింది. పచ్చి పులుసుజేసి తాలింపు బెట్టింది. కూతురు సుగుణతోపాటు గడి దగ్గరికి బోయింది. దూరంగా జనంలో నిలబడి చూస్తున్నది.

ఎదురుగా- దొర కూర్చుండే అరుగుమీద నిలబడి రవి మాట్లాడుతున్నాడు.

"సంగమంటే ఎవరో కాదు... మనమం

దరం కలిస్తేనే సంగం. ఆంధ్ర మహాసభ అన్నా, కమ్యూనిస్టు పార్టీ అన్నా, సంగ మన్నా ఒక్కటే. మనమంతా ఒక్కటిగా వుండాలన్నదే సంగం చెప్పేది. న్యాయం, ధర్మంకోసం పోరాడుతున్నది. దొరలు, దేశ ముఖ్‌లు, జమీందార్లు, జాగీర్దార్లు, పటేల్, పట్వారీలు, షావుకార్లు, ప్రజలను పీల్చి పిప్పి జేస్తున్నారు. బానిసలుగా చూస్తున్నారు.

దౌర్జన్యాలు చేస్తున్నారు. వెట్టిచాకిరి చేసిచేసి మన బతుకులన్నీ తెల్లారిపోతున్నాయ్. రైతులకు స్వంత భూముల్లేవు. రెక్కల కష్టం చేసేవాళ్ళకు తన్నులు, గుద్దులు లభి స్తున్నాయ్. వూరిలోని జనమంతా దొరలకు, పటేల్లకు, దోపిడోల్లకు వూడిగం చేస్తున్నారు. అది వాళ్ళ హక్కంటున్నారు. కాదంటే ఏమి జరుగుతుందో మీ అందరికీ తెలుసు. వాళ్ళకు ఎవడిచ్చాడీ హక్కు? కాయకష్టం చేసేవాళ్ళ కడుపులెండుతున్నాయ్. వాళ్ళకు మాత్రం బొర్రలు పెరుగుతున్నయ్. వెట్టిచా కిరి పోవాలి, దొరల, జమీందార్ల, గ్రామపె త్తందార్ల దౌర్జన్యం, దోపిడి అంతం కావాలె. వాళ్ళందరినీ పెంచి పోషిస్తున్న నిజాం నవాబు గద్దెకూలాలె. ప్రజల రాజ్యం రావాలె. అదే మనం కోరుతున్నది. దానికో సమే మన పోరాటం. న్యాయం మనది. ధర్మం మనది. భూములు దున్నేది మనం- పంటలు పండించేది మనం- కష్టం చేసేది మనం- కానీ- అనుభవించేదీ ఆ దొంగలు. ఎంతకాలమిట్ల బానిసలుగా బతుకుదాం? మనమంతా ఒక్కటైతే ఎవ్వరు మనల ఆప లేరు. ఇక్కడే చూస్తున్నారుగదా? దొర, పటేల్, పట్వార్లు ఎక్కడున్నరిప్పుడు? దొర గడి తలుపులు, కిటికీలు మూతబడ్డయ్. ప్రజాబలంముందు ఏ బలం నిలవదు. సంగం బుట్టింది- పోరాడుతున్నది మీ కోసం. తెలంగాణమంతట పల్లెపల్లెలో సంగం ఏర్పడింది. వెట్టిచాకిరి రద్దన్నారు- దొరల, పటేల్ల దౌర్జన్యాలు చెల్లవన్నారు. దున్నేవాడికే భూమికోసం పోరంబోకులు, బంజర్లు పంచుకున్నారు. పెత్తందార్లు దురా క్రమణ చేసి ఆక్రమించుకున్న భూములను స్వాధీనం చేసుకుంటున్నారు. మన పిల్లలకు చదువుల్లేవు. మనకు ప్రజాస్వామ్య హక్కు ల్లేవు. మాతృభాషలో చదువుకునే అవకాశా ల్లేవు. ప్రజల డబ్బుతో, ప్రభుత్వం పేరుతో నిరంకుశుడుగా నిజాం నవాబు వ్యవహరిస్తు న్నాడు. అతను ప్రపంచంలోకెల్ల ధన వంతుడు. ప్రజల గోళ్లూడగొట్టి వసూలు చేసే పన్నులతో కోటీలలో కులుకుతున్నాడు. అతని తాబేదారులుగా దోపిడి దొంగలంతా కలిసింద్రు. నవాబుకు మిలటరి, పోలీసు, ప్రభుత్వ యంత్రాంగమున్నది. అయినా ప్రజాబలంముందు నిలవలేకపోతున్నది. అందుకే మతపిచ్చితో, నవాబును రక్షించడా నికి, దోపిడిని నిలబెట్టుకోవడానికి రజాకార్ల మూక తయారయ్యింది. వాళ్లు ఆకస్మికంగా గ్రామాలమీదబడి ఎన్నో ఘోరాలు చేస్తు న్నారు. అమాయకులను చంపుతున్నారు. ఆడపడుచుల మానాలు దీస్తున్నారు. దొరి కిందంతా దోచుకొని వూర్లకు నిప్పుబెడుతు న్నారు. దెబ్బకు దెబ్బ తప్పదని 'సంగం' భావించింది. వూరూరా 'సంగం' బుట్టింది. పంచకమిటీలు ఏర్పాటు చేసింది. దొరల, జమీందార్ల, పటేల్, పట్వార్లను తరిమికొడు తున్నారు. గ్రామరక్షకదళాలు ఏర్పాటు చేస్తున్నారు. కర్ర, కత్తి, పలుగు, పార, వడి శెల, గుత్పలు బట్టుకొని రజాకార్ల వెంటబడి తరుముతున్నారు. ఆడవాళ్లు కూడా ఈ పోరాటంలో ముందున్నారు. కారం, రోకలి ఆయుధాలుగా చేసుకొంటున్నారు.

"త్వరలో మనకు విజయం లభించబోతు న్నది. ఈనాటినుండి మీరంతా సంగంలో చేరి, ఇక్కడ జరిగే దుర్మార్గాలను ఎదిరిం చాలె. రేపటినుండి వెట్టి చెయ్యొద్దు. జుర్మా నాలు కట్టొద్దు. సర్కారుకు లేవీగల్ల ఇవ్వొద్దు. పాతప్పులు, అక్రమవడ్డీలు, దొంగ దస్తావేజులన్నీ- ఇప్పుడే దగ్ధం చేశాం. వాటి

పీడ బోయింది.

"పోరాటంలో ఇబ్బందులు, కష్టాలు ఎదు ర్కొనక తప్పదు. త్యాగం చెయ్యకుండా ఫలి తాన్ని పొందలేం. ఎన్ని కష్టాలొచ్చిన, నష్టాలు జరిగినా, మీరంతా ఒక్కటిగా నిల బడి- 'సంగం' ఆశయాలతో పోరాడాలని కోరుతున్నాం. పిరికితనం వదిలి తలెత్తి తిర గండి. ఊడిగం మాని ఉద్యమం చేపట్టండి. మనకోసం కాకపోయినా మన తరం తర్వాత వాళ్ళైనా సుఖంగా బతకడానికి ప్రజారాజ్యం నిర్మిద్దాం.

విప్లవం వర్ధిల్లాలె"

అని రవి తన ఉపన్యాసం ముగించాడు. అందరు జై అన్నారు. ఊరి యువకులు దళసభ్యులతో కలుస్తున్నారు. రవిని, ముత్తయ్య, చంద్రమ్మ, చంద్రయ్యలను బంధువులు, స్నేహితులు పలకరిస్తున్నారు. అందరి ముఖాల్లో ఆనందం కనపడుతు న్నది.

శాంతమ్మ, సుగుణ రవి దగ్గరికొచ్చారు. రవి చిరునవ్వుతో ఆత్మీయంగా పలకరిం చాడు. ఇంటి దగ్గర అందరికి భోజనాలు ఏర్పాటుచేసిన సంగతి చెప్పింది. దళసభ్యు లందర్నీ ఆహ్వానించింది.

ఇంటికి వెళ్ళగానే, తల్లిని, చెల్లెల్ను దళస భ్యులకు పరిచయం చేశాడు రవి.

అందరు కలిసి పంక్తిభోజనం చేస్తు న్నారు. రవి పక్కన కూర్చుని శాంతమ్మ మాట్లాడుతున్నది. సుగుణ వడ్డన చేస్తు న్నది.

అప్పుడే ఇంట్లోకి వచ్చిన నర్సిరెడ్డి వాళ్లను చూసి నిర్ఘాంతపోయాడు. కోపంగాచూసి, మాట్లాడకుండా లోపలకెళ్లాడు. అతన్ని చూడగానే శాంతమ్మ అనుమానిం చింది-కోపంగా వున్నాడని. అసలే ఆవేశప రుడు. నోరుజారి ఏమంటాడోనని లోపలకె ళ్లింది.

"ఏమిటిదంత? ఎవరు వీళ్లు?" భార్యను నిలదీసి అడిగాడు నర్సిరెడ్డి.

"అబ్బాయితోపాటు వచ్చిండ్రు! అన్నం బెట్టకుండ ఎట్ల?" అన్నది శాంతమ్మ.

"వాళ్లెందుకొచ్చిండ్రో తెల్సా! ఈ వూరికి నిప్పుబెట్టడానికి. ఈ ఇంటి పరువుదీయడా నికి. నన్ను నలుగురిలో అవమానం పాల్జే యడానికి నీకొడుకు కంకణం కట్టుకున్నడే. అందుకే యీళ్ళందర్ని ఎంటేసుకొని వచ్చిండు. 'సంగం' బెట్టి వూరును వుద్ధరిం చడానికొచ్చిండు, రేపొద్దున దెలుస్తది...

వాడు నా కొడుకు కాదని నీకెప్పుడో జెప్పిన... వాడికి, నాకు ఏ సంబంధంలేదు. వాడి ముఖం కూడ చూడను. నాకు తెల్వ కుండా, ఇంటికి తీసుకొచ్చి ఆతిథ్యమిస్తు న్నవ్. నిన్నేమనాలె. వాడికి లేకపోయిన నీకు బుద్ధుండొద్దు?" ఆవేశంగా, బిగ్గరగా అరుస్తున్నాడు నర్సిరెడ్డి. అతనంటున్నందు కుగాదు. రవి, అతనితోపాటు వున్నవాళ్ళు వింటారేమోనని బాధపడుతున్నది.

"నెమ్మదిగా మాట్లాడండి. అబ్బాయి ఇంటడు" అన్నది నెమ్మదిగా.

నర్సిరెడ్డి గొంతు మరింత పెద్దది జేశాడు.

"విననీయే. వినాలనే అంటున్నా. సిగ్గూ శరం వున్నోడైతే ఇట్లెందుకు జేస్తడు"

"ఏమి జేసిండు! నా కొడుకేం తప్పు జేసిండు! మంచే జేస్తున్నడు.పది మందికి మేలు జేస్తున్నడు... ప్రతిదానికి నోరు పారే సుకోవడం నేర్చుకున్నరు. రాకరాక కొడు కొస్తే గిట్లనేనా మాట్లాడేది"

శాంతమ్మ సహనం కోల్పోయి కటువుగా అన్నది.

నర్సిరెడ్డి కోపం చల్లారింది. తనలోతాను గొణుక్కుంటూ ఇంటి వెనకకు పోయాడు. భోజనాలు ముగించుకొని దళసభ్యులు ఇంటి ముందుకెళ్ళారు.

రవి, అంతా విన్నా విననట్లే వున్నాడు.

తల్లికి, చెల్లెకు వీడ్కోలు చెప్పాడు. వెళ్లిపో తున్న కొడుకును ఆప్యాయంగా అడిగింది

శాంతమ్మ.

"మల్లెప్పుడొస్తవు నాయనా? "

"ఏమోనమ్మా! నాకు తెలియదు" అంటూ మరోసారి ఇద్దరికి చెప్పి బయటికి నడిచాడు రవి.

★ ★ ★

తెల్లారేసరికి అమీన్‌సాబ్ పోలీసు బలగంతో వచ్చి గడి దగ్గర మఖాం వేశాడు.

కచేరి మొదలయింది. అమీన్‌సాబ్, దొర పక్కపక్కన పెద్ద అరుగుమీద ఆరాం చేర్లలో కూర్చున్నారు. గ్రామ యువకులు సత్తిరెడ్డి, లతీఫ్, లింగయ్య, కిష్టయ్య, మారయ్య, గోపయ్యలను రెక్కలు విరిచి కట్టి నిలబెట్టారు. పోలీసులు మస్కూరి కొండని సహాయంతో ఒక్కొక్కర్ని పట్టుకొస్తున్నారు.

దొడ్డి దర్వాజ వెంట కోళ్ళు, యాటలు,కల్లుకుండలు గడిలోకి పోతున్నయ్. వెట్టివాళ్ళు పరుగులు దీస్తున్నారు.

మస్కూరు కొండడు నర్సిరెడ్డిని తీసుకొచ్చాడు. వస్తూనే నర్సిరెడ్డి అమీన్‌సాబ్‌కు, దొరకు నమస్కారంచేశాడు. అమీన్ సాబ్‌చెవిలో దొర ఏదో చెప్పాడు. అమీన్ సాబ్ గుడ్లురిమి చూసి, హంటర్ తీసుకొని టకటక కిందికి దిగాడు.

"నర్సిరెడ్డివి నువ్వేన్రా? "

"జీ హుజూర్.నేనే నర్సిరెడ్డిని"

"అరే బద్మాష్. ఏం పుట్కుపుట్టినవ్‌బే. కొడ్కును సంగంలోకి బంపినవ్. వూర్కి దోల్కొచ్చి జులూస్ దీయించినఫ్? ఎంద్కుబే... సర్కారంటే ఏమనుకున్నవ్ సాలే"

హంటరుతో చర్రుచర్రున కొడుతున్నాడు. నర్సిరెడ్డి చేతిలోని పొన్ను కర్ర దూరంగా పడిపోయింది. తల రుమాలు నేలబడింది. ఇంతవరకతను ఎవరి చేత మాట పడలేదు. ఏ అధికారం లేకపోయినా పోలీసు పటేల్ గిరికి వారసుడు, పెద్దరైతు, అందరికీ ఆప్తుడుగా వుండే మనిషి. ఈరోజు కొరడా దెబ్బలు తింటూ, అసభ్యకరమైన మాటలు పడుతున్నాడు. అతనికి తల గొట్టినట్లున్నది. అది చూస్తున్న జనం కళ్ళనీళ్ళు బెట్టుకుంటున్నారు. గుడ్లనిండా నీరు నింపుకొని, నర్సిరెడ్డి నెమ్మదిగా లేచి,

"ముజే మాఫ్‌కరో సర్కార్, నాకేం తెల్వదు. వాడికి, నాకు ఏ సంబంధంలేదు. వాడు సంగంలో జేరినంక నా కొడుకు కాదనుకున్న. నిజం చెపుతున్న సర్కార్" అన్నాడు.

నర్సిరెడ్డికి ఆ అవమానం చాలనుకున్నాడు దొర. అమీన్‌సాబ్‌కు కనుసైగజేశాడు.

"కబర్దార్. మల్లగిట్ల జేస్తే... యేం జేస్తనో... చల్... చలేజావ్" అన్నాడు అమీన్. నర్సిరెడ్డి కర్ర, రుమాలు తీసుకొని తలదించుకొని నెమ్మదిగా వెళ్ళాడు.

అమీన్‌సాబ్ రెక్కలు విరిచి కట్టిన వాళ్ళ వంకజూశాడు. పాపిరెడ్డి పటేల్ పక్కకుజేరి "ఈడే సర్కార్... వూర్కి లీడరయ్యిండు" సత్తిరెడ్డిని చూపిస్తూ చెప్పాడు.

"సాలే! నీకుభీ సంగం కావాల్రాబే. లీడర్‌గిరి జేస్తవ్! బాంచత్... సూపిస్త" కొరడాదెబ్బలతో సత్తిరెడ్డి వొళ్ళంతా కందిపోయింది.

"జులూస్ దీపిస్తవ్. గిప్పుడు నేను దీపిస్త సాలే"

సత్తిరెడ్డి దెబ్బల బాధకు మూల్గుతున్నాడు. కానీ నోట మాటెత్తలేదు. తర్వాత వరుసగా ఒక్కొక్కర్నీ చూపుతున్నాడు పటేల్.

"ఈడు కుమ్మరి కిష్టిగాడు.
ఆడు చాకలి సత్తిగాడు
గీడు గొల్ల లింగడు
యీడు గౌండ్ల గోపడు
గీడు మాల మారిగాడు
ఆఖర్న దూదేకుల లతీఫ్" అన్నాడు.

బూతులు తిడుతూ, రంకెలుబెడుతూ

అమీన్ కొరడాతో కొడుతున్నాడు. వాళ్ళు "అమ్మో! అయ్యో" అంటున్నారు. దెబ్బలు భరిస్తున్నారు. పడిపోయిన వాళ్ళను బూటుకాళ్ళతో తన్నుతున్నాడు. అలసి పోయి చివరనున్న లతీఫ్‌ను తీక్షణంగా చూసి...

"అరే సువ్వర్కా బచ్చ... ముసల్మాన్ పుట్కు బుట్టినవ్. సర్కార్ నెదిరిస్తవ్. సర్కార్ నెదిరిస్తవ్ సాలే.

యెందుకుబే... బోల్ సాలే.. లేకుంటే ఖైమజేస్త... బోల్..." దెబ్బలకు లతీఫ్ స్పృహదప్పి పడిపోయాడు. అమీన్‌సాబ్‌కు చెమట పట్టింది. అలసటొచ్చింది. ఆయాస పడుతూ జమేదార్ వంక జూశాడు.

"అరే లచ్చుమన్. యేసాలోఁకు అవర్ జరా కుషామత్‌కర్" అని చేతిలోని కొరడా అందించాడు. చెమటలు తుడుచుకుంటూ వెళ్ళి ఆరాం చేర్ల కూర్చున్నాడు. నౌకరు విస నకర్రతో విసురుతున్నాడు. లచ్చుమన్ తన పని తాను చేస్తున్నాడు.

దొర గడియారం చూసుకుని లోపలికి పోదామని అమీన్‌సాబ్‌కు సైగజేశాడు. ఇద్దరు లేచి లోనికెళ్ళారు.



గడిలో దివాన్‌ఖానా.

గోడలకు నవాబ్ ఫోటో, పులిచర్మం, జింక చర్మం, తుపాకి, డాల్‌కత్తి తగిలించి వున్నయ్. ఒకపక్క దొర కుచ్చుటోపీతో తీయించుకున్న ఫోటో వుంది.

గళ్ళ లుంగీలు, జుబ్బాలు వేసుకుని దొర, అమీన్‌సాబ్ ఎదురెదురుగా కుర్చీల్లో కూర్చుని వున్నారు. వాళ్ళ ముందు బల్ల మీద మాంసం కవాబులు, కోడికాళ్ళు, కార్జం ముక్కలు పెట్టున్నయ్. కొద్ది ఎడంగా నేల మీద కూర్చొని చప్రాసి కల్లుగ్లాసులు అంది స్తున్నాడు. మధ్యమధ్య చిన్న గ్లాసుల్లో సారా పోసియిస్తున్నాడు. బయట దర్వాజా దగ్గర నిలబడి యింకొకడు పంఖా గుంజు తున్నాడు. ఇద్దరూ మత్తులో తేలిపోతు న్నారు.

పక్కగదిలో పటేల్, పట్వారి, పోలీసోళ్లు జల్సాజేసుకుంటున్నారు. లోపల పెద్దొర సాని అందరికీ కావలసిన ఏర్పాట్లు తనిఖీ చేస్తున్నది.

మైకం కళ్ళు బలవంతంగా తెరుస్తూ అమీ న్‌సాబ్ అన్నాడు.

"హమారా! భాస్కర్రావ్‌సాబ్... కాస్త హుషార్‌గుండండ్రి"

"అచ్చాసాబ్" దొర అన్నాడు.

ఆడబాప విందుకు ఏర్పాటుచేస్తున్నది. పక్కన టేబుల్‌మీద రకరకాల వంటకాలు తెచ్చిపెడుతున్నది. అమీన్‌సాబ్ చూపులటు పడ్డాయ్. దొర గమనించాడు. ఆడబాప అందంగా ఉన్నది. తెల్లచీర, రవిక- సిగలో పూలు. ఓరగంట చూపులు. చూసి అమీన్ సాబ్‌కు ఎట్లెట్లో ఉన్నది.

"ఇయ్యాలిక్కడుండి ఆరాం దీస్కోండి" దొర అన్నాడు.

"అచ్చా! భాస్కర్రావ్‌సాబ్. మీరెట్ల జెప్తె గట్లనే" అన్నాడు అమీన్ ఆడబాపను చూస్తూనే.

"హమేషా నా మద్దత్ మీకుంటది. యెప్పుడు గావాలంటే గప్పుడు" అమీన్ అన్నాడు.

"షుక్రియా! ఇది మీ ఇల్లు అనుకొండి. వస్తు పోతుండండి"

"జరూర్ సాబ్"

ఇద్దరూ లేచి టేబుల్‌దగ్గరికి చేరారు. ఆడబాప ముసిముసి నవ్వుల్తో అమీన్‌సాబ్‌కు వడ్డిస్తున్నది. అతను రెప్పలార్పకుండా ఆమె అందాన్ని చూస్తున్నాడు.

★ ★ ★

జరిగిన అవమానానికి నర్సిరెడ్డి మానసికంగా కుంగిపోతున్నాడు. బల్లెపీటమీద పడుకొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అతన్ని చూసి శాంతమ్మ కుమిలిపోతున్నది. తన కారణంగానే జరిగిందని బాధపడుతున్నది. సుగుణమ్మ తల్లీ, తండ్రిని చూసి దిగులుపడుతున్నది. ఊరిజనం వచ్చి నర్సిరెడ్డిని పలకరించిపోతున్నారు. అతని మంచితనాన్ని కొనియాడుతున్నారు. దొరను, పటేల్‌ను దూషిస్తున్నారు. కొందరు బతిమాలుతూ, కంట తడిబెడుతున్నారు.

యువకులంతా రాత్రిపూట ఒక దగ్గరికి చేరుతున్నారు. ఊరంతా గుసగుసలు పెడుతున్నారు. నివురుగప్పిన నిప్పులా వూరున్నదని దొర గమనించాడు. వెట్టివాళ్ళు, పనిపాటలోళ్ళలో మార్పు చూస్తున్నాడు. అందర్నీ అనుమానిస్తున్నాడు. మంగలిపిచ్చయ్యతో గడ్డం గీయించుకోవడం, వాళ్ళు పట్టించుకోవడం మానేశాడు. బ్లేడుతో గడ్డం గీక్కుంటున్నాడు. బయటికెళ్ళడం, కచేరీ పెట్టడం, తిట్టడం, కొట్టడం తగ్గించాడు.

చీకటిపడగానే దొర, దొరసాన్లు గదుల్లో దూరి తలుపు లేసుకుంటున్నారు. రాత్రంతా పెట్రొమాక్సులైట్లు వెలుగుతున్నాయ్. ముందు దర్వాజ మూసేసి రామడు, సోమడు అక్కడే పడుకుంటున్నారు. వెనక దర్వాజ దగ్గర కొట్టంలో యాదగిరి, వంటశాల దగ్గర వంటవాళ్ళు, మధ్య హాల్లో చప్రాసీలు పడుకుంటున్నారు. ఆడబాపలు దొరసాన్ల గదుల్లోనే వుంటున్నారు. మధ్యమధ్య పెద్దొరసాని లేచి గడి అంతా తిరిగి చూస్తున్నది. నౌకర్లను జాగ్రత్తగా ఉండమని చెపుతున్నది. చిన్నదొరసాని అవేమీ పట్టించుకోకుండా, ఆడబాపతోపాటు తన గదిలో గురకబెట్టి నిద్రబోతున్నది.

దొర నిద్రలో వులిక్కిపడుతున్నాడు. కలవరిస్తున్నాడు. దిగ్గున లేచి కూర్చొని సిగరెట్లు వెలిగిస్తూ, గదంతా తిరుగుతున్నాడు.

కుక్కలు మొరగటం విని పెద్దొరసాని లేచి గబగబా దొర గదిదగ్గరికొచ్చింది. తలుపు గొట్టింది. దొర చేతిలోని సిగరెట్ పక్కన పడేసి ఖంగారుగా తలుపు దగ్గరికి చేరాడు.

మళ్ళీ తలుపుకొట్టి "నేనేనండి. తలుపు తీయండి" అన్నది.

ఆమె గొంతు విని తలుపు దీశాడు. గదిలో సిగరెట్ ముక్కలూ, మేల్కొని వున్న దొరనూ చూసి పరిస్థితి అర్థంచేసుకున్నది.

"నాకెందుకో భయంగుందండి"

"నాకు నిద్రపట్టలేదు"

"యేంజేద్దమంటరు? యియ్యాల నాకేదో పీడ కలొచ్చింది" అంది దొరసాని.

"అంత ధైర్యమెవడికుంది? గుండెలున్నయా ముండాకొడ్కులకు"

"యెక్కడో యెందుకు? లోపలున్న నౌకర్లనే నమ్మశక్యంగాకుండున్నది. యీళ్ళను నమ్ముకుంటే యేందో... నాకు భయంభయంగున్నది. మీరు పైకట్ల గనబడుతున్నరుగనీ మీరేం జేస్తున్నరో నాకు దెల్సు... యిట్లయితే యెట్లండి!"

"యేంజేద్ధమంటవ్" మంచమ్మీద కూర్చుంటూ సిగరెట్ వెలిగించాడు దొర.

ఆమె అతని పక్కకెళ్ళి కూర్చున్నది.

"గట్టి బందోబస్తు బెట్టించండి. పటేల్‌తో మాట్లాడి యేదైన చెయ్యండి"

"గట్లనే చేద్దాం"

"చేద్దాం చేద్దామంటే యెప్పుడండి? పటేల్‌ను పిలిపిస్త మాట్లాడి యెంటనే చెయ్యండి" బిర బిరా దొడ్డి దర్వాజవైపు వెళ్ళింది.

"యాద్గిరి. అరేయ్ యాద్గిరి" పిలిచింది.

కొట్టంలో నేలమీద పడుకున్న యాదగిరి దిగ్గనలేచి తలగుడ్డ చుట్టుకుంటుండగా మళ్ళీ పిలుపు.

"అరేయ్. యాద్గిరి..."

పెద్దొరసాని గొంతు విని బయటకొచ్చాడు. అరే, తురే అని తప్ప పిలవని దొరసాని పేరుబెట్టి పిలవడం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

"పోయి. పోలీసుపటేల్ను దొర పిలుస్తున్నాడని తొందరగ తీస్కరా" అన్నది. యాదగిరి దొడ్డిదారి తలుపులు దగ్గరేసుకుంటూ బయటికెళ్ళాడు.

దొరసాని కాళ్ళు గాలిన పిల్లిలా అక్కడే అటూ యిటూ తిరుగుతున్నది.

పటేల్ హడావిడిగా వచ్చాడు. అర్ధరాత్రి ఎందుకు పిలిచారోనని గాబరాపడుతున్నాడు. దొరసాని ఏమీ చెప్పకుండా లోనికి నడిచింది. పటేల్ ఆమె వెంటనే వెళుతున్నాడు. దివాన్‌ఖానాలో దొర ఆలోచనల్లో మునిగి తేలుతున్నాడు. పటేల్‌ను చూడగానే.

"ఊర్ల ఎట్లున్నది? " అనడిగాడు.

"అంత బాగనేవుంది" పటేల్ చెప్పాడు.

"ఆపోరగాళ్ళంతా రాత్రిపూట ఒక దగ్గర జమ అయితున్నరటగద? "

"ఆళ్ళబొంద. గాళ్ళేంజేస్తరు. మొన్నటి దెబ్బకు తిక్కగుదిరింది. యేదో బాగోతం ఆడ్తమని నేర్చుకుంటుండ్రట. గందుకే... గా సత్తిరెడ్డిగాడి యింటిదగ్గర జేరి మద్దెల దర్వులేస్తున్నరు"

"యేదర్వులో యేమో! యెవర్ని నమ్మాలో! యెవ్వర్ని నమ్మొద్దో తెల్వకుండుంది" దొరసాని అన్నది.

"గడి కాపల సంగతి? యెట్లజేస్తే బాగుంటది? " దొర అడిగాడు.

"వూరోళ్ళను నమ్ముకుంటే... దొర్సాని జెప్పినట్టు నాకు నమ్మకం కుదరటంలేదు"

"పట్నంనుండి ఇద్దరు ముగ్గురు అరబ్బులోల్లను దీస్కొస్తే యెట్లుంటది? "

"దొరవారు గది జెయ్యండి. భేషుగ్గుంటది. లమ్డీకొడ్కులు వణికిపోతరు"

"ఆళ్ళకు తోడుగా... ఇంకో ఐదురారు గుర్ని మంచోళ్ళను నువ్వుగూడ చూడు" దొరసాని పటేల్‌తో అన్నది.

"రేపే పట్నంనుండి అరబ్బులోల్లని బిలిపిస్త... దొర్సాని జెప్పినట్లు పక్కవూరోళ్ళను తీస్కరా... రాత్రిళ్ళు నువ్వుగూడా యిక్కడే వుండు. ఇంటిదగ్గర వంటరిగ యెందుకు? "

అది విని దొరసాని లోలోపలే సంబరపడింది. పటేల్‌వంక చూస్తూ, "దొర చెప్పింది యిన్నరా! నువ్వుగూడా యిక్కడే వుండి వాళ్ళను జాగర్తగా చూస్కో" అన్నది

"మీరెట్లంటె గట్లనే..." అన్నాడు పటేల్.

"గిది చెప్పదమనే రమ్మన్న... పొద్దున్నే ఆ పని చూడు" అన్నాడు దొర.

అలాగే అన్నట్లు తలూపి వెళ్ళిపోతున్న పటేల్‌ను యేదేదో గుసగుసలు బెడుతూ గేటుదాకా సాగనంపింది దొరసాని.

★ ★ ★

పున్నమి వెన్నెలకాస్తోంది. పొలాల్లో పురుగులు తీగరాగాలు తీస్తున్నాయ్. చెరువులో కప్పలు అరుస్తున్నయ్. ఎక్కడో నక్కలు కూస్తున్నయ్. ఊర్లో కుక్కలు మొరుగుతున్నాయి. చల్లని గాలిలో రకరకాల పూలవాసనలొస్తున్నాయి.

ఊరికి దూరంగా పొలాలమధ్య పెద్ద బావి, దానిపక్కనొక ఇల్లు. దానికెదురుగా పశువులకొట్టం. అక్కడొక కుటుంబం కాపురముంటుంది. ఇంటిముందు అరుగుమీద దళ సభ్యులు కూర్చున్నారు. వారికెదురుగా గ్రామ యువకులున్నారు. వాళ్ళు కొందరు రాళ్ళమీద, మరికొందరు తమ గొంగళ్ళు కిందపరుచుకొని కూర్చున్నారు.

అరుగుమీద దళ సభ్యులమధ్య కూర్చున్న రవి,

"అన్ని తెలిసినయ్. మీతో వూరు విష

యాలు, సంగం సంగతులు మాట్లాడదా మని వచ్చాం" అన్నాడు.

వెంటనే లింగయ్య, "యేం పార్టో పటేలా! గిట్లొస్తరు గట్లబోతరు. అయిటంక మా సంగతి సూడుండ్రి" తన గాయాలు చూపెడుతూ అన్నాడు.

"మీరెక్కడుంటరో? యెప్పుడొస్తరో? యీడ మాకు దిక్కోరు? " మారయ్య ప్రశ్న.

"వూర్ల వుండోళ్ళం. దొరను గాదని బత్కుతమా? పటేలా? " కిట్టయ్య అడిగాడు.

"పటేలా నీకాల్మొక్త కోప్పడొద్దు... తెల్వగడ్గుతా. వాళ్లతో కయ్యం బెట్టుకుంటే యేమైతం? వూర్లవుండనిస్తరా? " లింగయ్య సందేహం.

"సద్వు సంధ్యలేనోళ్లం. పొద్దున్లేస్తె ఆళ్ళ దగ్గర పని. మాకెందుకండి యీ గొడ్వలన్నీ? " గోపయ్య నిరాశ.

"మా నసీబుల గిట్లనే రాసుంది. అల్లా యెట్లరాస్తె గట్లయితది మనమేం జేస్తం? " లతీఫ్ వేదాంత ధోరణిలో అన్నాడు.

"మీరు జెప్తుంది బాగనే వుందిగనీ- దొర, పటేల్, పట్వారీలు వూర్కుంటరా? " సత్తిరెడ్డి సందేహం.

అన్నీ విన్న రవి అన్నాడు,

"ఇలా జరుగుతుందని తెలుసు. మీరడిగినవన్నీ వాస్తవాలే. ప్రతి గ్రామంలో ప్రారంభంలో జరుగుతున్నదిదే. ఆశయం సాధించడానికి కష్టాలు అనుభవించక తప్పదు"

"మా సంగతి గటుంచుండి. నర్సిరెడ్డి పటేల్ సంగతేంది? ఆ పటేలునెవరన్న పల్లెత్తు మాటన్నరా? దేవుడసుంటోడు. అసుంటోడ్ని గడికాడ్కి బిలిపించి, తుర్కభాషలో యెట్ల తిట్టిండు. యెట్ల గొట్టిండు ఆ అమీన్‌గాడు. ఆ పటేల్ యేంతప్పు జేసిండు? నువ్వు సంగంలో జేర్నివనే గద పటేల్‌కు గట్లయ్యింది? నీ కాల్మొక్త కోప్పడొద్దు. నర్సిరెడ్డి పటేల్‌కే గట్లయితే మా సంగతేంది? దానమ్మ. దెబ్బలంటరా! సిన్నప్పట్నుంచి ఆ దొరోడు, పటేలెన్ని గొట్ట లేదు? గిదో లెక్కాగని? యేందో పటేలా గిదంత మాకెందుకు సెప్పండి? " అన్నాడు లింగయ్య.

"మిమ్మల్ని భయపెట్టడానికే వాళ్ళట్ల జేస్తున్నారు. మీరు ధైర్యంగా వుంటే ఏమీ చేయలేరు" రవి అన్నాడు.

"ఇంకోమాట తెల్వకడ్గుత కాల్మొక్త..." లింగయ్య మాటకు మధ్యలో అడ్డుచెప్పి రవి అన్నాడు.

"ఆ బానిస తత్వమే మీరు మానాలి. బాంచన్- కాల్మొక్త అనే మాటలనొద్దు. మీరిట్ల అనబట్టే వాళ్ళు మరింత పెత్తనం చలాయిస్తున్నారు. లింగన్నా! మన పార్టీలో అటువంటి మాటలు అనొద్దు. యిక్కడ అందరు సమానమే"

"సరే పటేలా" అన్నాడు లింగయ్య.

అదిగో మళ్లీ అదే. దొర, పటేల్ ఎవ్వరు లేరిక్కడ. నా పేరు రవి. పేరుబెట్టి పిలువు" అన్నాడు రవి.

"గదెట్లయితది గని... సంగమంటే గాళ్ళకంత కోపమెందుకు? " లింగన్న అనుమానం వ్యక్తంజేస్తూ గొంగడి ముందుకు జరిపి కూర్చున్నాడు.

"మీరిట్లొచ్చిండ్రు గట్ల బోయిండ్రు తెల్లారే సరికి పోలీసులు దిగిండ్రు. దొర దల్సుకుంటే గట్లయితది? మరి మీరెక్కడుంటరో మాకేమెరక? " అడిగాడు మైసయ్య ముందుకు జరుగుతూ.

లింగయ్య మైసయ్య వంక కోపంగా జూసి, "యేందిర! గట్ల మీదిమీదికొస్తున్నవ్. కనిపిస్తలేదు. ముట్టుకుంటవేందిర నీయమ్మ కాస్త దూరం గూసోరాదు" అన్నాడు.

"యేంది గొల్లాయన గంత ఎచ్చులకుబోతవ్? గంత బయమైతే నువ్వే దూరం జర్గరాదు" మైసయ్య అన్నాడు.

"జర్గుత! జర్గుత. జర్గకేంజేస్త! నీయమ్మ నీకు యేతులెక్కువైనయ్" అని పక్కకు జరి

గాడు లింగయ్య.

"యేందిర మధ్యల మీగోల! నోర్మూస్కోని కూసోండి" సత్తిరెడ్డి కోపంగా అన్నాడు.

"మీరన్నది బాగానే వున్నది గని- గాళ్ళ ఎనకాల పోలీసులుంట్రి. సర్కారుండే... మనకోరున్నరు? " గోపయ్య ప్రశ్నించిండు.

"ఆళ్ళ దగ్గర తుపాకులున్నాయ్. మనకే మున్నయ్? " కిష్టయ్య అడిగిండు.

"దొర అరబ్బులోల్లను, గుండాలను గూడా దించుతున్నడట" మారయ్య అన్నాడు.

"నిజమే! వాళ్లను కాపాడటానికి సర్కారున్నది, పోలీసు మిలటరి బలగాలున్నయ్. వాళ్ళుగాక యిప్పుడు రజాకార్ల మూకగూడా వచ్చింది. వాళ్ళెందరున్నా ప్రజల శక్తి ముందు ఆగలేరు. వాడి బలగం డబ్బుతో కొనేవాళ్ళు. మన బలగం అవసరమైతే ఉద్యమం కోసం ప్రాణమిచ్చేవాళ్ళు. శత్రువును ఎదిరించడానికి మనం ఆయుధాలు పడుతున్నాం. సైన్యాన్ని తయారుచేస్తున్నాం. మన సైన్యమంతా ప్రజాసైన్యం. ప్రజలలోనుండి వచ్చేవాళ్ళే... వీళ్ళంతా ఎవరు? మీలాంటి వాళ్ళే... అందువల్ల మీరు పిరికితనం వదలాలె. త్యాగానికి సిద్ధపడాలె. మీరంతా ఐక్యంగా వుంటే దొర ఆటలు సాగవు" అన్నాడు రవి.

"మీరన్నట్లు... పైకి బింకంగున్నరుగని దొర, పటేల్లు వణుకుతున్నరు" గోపయ్య అన్నాడు.

"రాత్రిపూట నిద్రబోతలేడట!" కిష్టయ్య చెప్పాడు.

"బయటికిక్కూడ కనిపిస్తలేడు దొర" మారయ్య అన్నాడు.

"ఎందుకంటరు? 'సంగం' శక్తేమిటో దొరకు దెలిసింది అందుకే" అన్నాడు రవి.

లింగయ్య బిగ్గరగా అరిచి, లేచి గంతేసిండు. గొంగడి దులుపుతున్నాడు. పామో తేలో కరిసిందని అందరు లేచింద్రు.

లింగయ్య మైసయ్యవైపు కోపంగా చూస్తూ, "యేందిర మాలోడ! అన్నంత పన్జేసినవ్ గదర నీయమ్మ" అన్నాడు.

"యేంజేసిండే? " మారయ్య అడిగాడు.

"యింకేంజేస్తడు. ముట్టుకున్నడు. మైలబడేసిండు. నీయమ్మ గిప్పుడేం జెయ్యాలె" బాధపడ్డాడు లింగయ్య.

"గప్పట్నుంచి అంటనే వుండు. గట్లెందుకు జేసినవుర? " గోపయ్య అడిగాడు.

"నేనేం జేస్నీ, ఆయ్నే తగిలిండు" అన్నాడు మైసయ్య.

"యెన్కముందు సూడొద్దుర బాడ్కావ్" కోపం జేశాడు లతీఫ్.

"నీయమ్మ... అందరు నన్నే అంటరు. ఆ గొల్లాయన అల్వాంజేస్తుండెగనీ, నా తప్పేంది? " గట్టిగా అడిగాడు మైసయ్య.

దళ సభ్యులు వాళ్ళకు నచ్చజెప్పబోతుంటే రవి వద్దన్నాడు.

"పాణం బోయినట్లు జేస్తున్నవ్. ముట్టుకుంటే యేమయ్యింది? అయిన యాడముట్టుకున్న? యెక్కడ మైలయినదో సూపరాదు" మైసయ్య అడిగాడు.

"గట్ల నీల్గుతవేందిర? మైల కనబడ్తదా? '

"మరెందుకంటవ్! వూర్కోనే"

"గిట్ల ఎచ్చులకు బోతెనె దొర గట్లజేసిండు"

"నిన్నేం జేసిండో! అందరికి దెల్వదా? "

నీయమ్మ... ఒక్కటేసిన్నంటే దెబ్బకు సస్తవ్!" సమాధానం చెప్పలేక దుడ్డుకర్ర ఎత్తాడు లింగయ్య. అతని వెర్రి ఆవేశానికి మైసయ్యకు నవ్వొచ్చింది. వొంగి వీపు చూపుతూ "కొడ్తవా! కొట్టే నీయమ్మ ఏంజేస్త? నన్ను గొడ్తె నీ మైలబోద్దంటే కొట్టే" అన్నాడు.

లింగయ్యక్కూడా నవ్వొచ్చింది. దుడ్డుకర్ర దింపి,

"అది గాదుర! గీయాలప్పుడు తానమెట్ల జెయ్య. బట్టలేడదేను? " అన్నాడు.

"మొల పంచె, నెత్తిరుమాలే గద? గొంగ

డికి మైలే లేదుగద... ఓ పన్జెయ్యి. పంచూ డదీసి గొంగడి ముస్కేస్కొనిపోవే సీక ట్లోరు సూస్తరు" మైసయ్య సలహా చెప్పాడు.

"మైల బడేసింది గాక బరిబత్తల బొమ్మం టవ్... నీయమ్మ" అని గునుక్కుంటూ దూరం జరిగి కూర్చున్నాడు.

"యెట్లగో మైలబడ్డవ్‌గదే దగ్గర కూసో. యేమైతది? " లింగయ్యను ఏడిపించాలని అన్నాడు.

"కూసుంట కూసుంట" లింగయ్య అన్నాడు.

"అయిపోయిందా మీ తగాదా? " అడిగాడు రవి. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు.

"మైసయ్య ముట్టుకున్నాడని-లింగయ్య మైల పడ్డాడని-ఎంత హంగామా జేసింద్రో! మైసయ్య అన్నట్లు అంటెక్కడున్నది? మనిషిని మనిషి ముట్టుకుంటే తప్పా? అందరం మనుషులమే అందరి రక్తమొక్కటే మరెందుకీ తేడాలు? యెవరు కల్పించారు? మతమని, కులమని, అంటరానోళ్ళని, ముట్టరానోళ్ళని మనుషులమధ్య అంతరాలు కల్పించిందెవ్వరు? దేవుడు కాదు. మనుషులే. మనుషులంతా ఒకటిగా వుంటే తమ దోపిడి సాగదని, అధికారం వుండదని మనమధ్య విభేదాలు సృష్టించారు. లింగన్నా! నిన్నొక మాటడుగుతా! మైసయ్య ముట్టుకుంటే మైలబడి పోయావని యింత బాధపడ్డావు. కోపమొచ్చింది. కానీ, ఆ దొర తిట్టినా, కొట్టినా ఎన్ని బాధలు పెట్టినా నీకెందుకు కోపం రాలేదు? ఎందుకు తిరగబడలేదు? " అడిగాడు రవి.

"దొరకెదురు తిర్గితే వూర్కుంటడా? " లింగయ్య సిగ్గుపడుతూ అన్నాడు.

"కులాలు, మతాలు అంటూ ముట్టొద్దంటరా? దేవుడు చేసింది మనమెట్ల దీసేస్తం? " గోపయ్య సందేహం వెలిబుచ్చాడు.

"రాసింది, చేసింది దేవుడు కాదు. దేవుడి పేరుతో ఈ దోపిడిదార్లే. దేవుడంటే పేదోళ్ళకు భక్తి విశ్వాసం వుంటుందని వాళ్ళకు తెలుసు. అందుకే అవసరాన్నిబట్టి దేవుని పేరుజెప్పి మోసం జేస్తారు. కనిపించని దేవుణ్ణి అడగలేమని వాళ్ళకు దెలుసు. మరో విషయం దేవుడు నీతి, నిజాయితి, న్యాయం, ధర్మం బోధించాడంటారు. కానీ వాళ్ళు చేసేవన్నీ వాటికి వ్యతిరేకమైనవే! మనుషుల్లో కొందరు అంటరానోళ్ళు వుంటారని దేవుడెక్కడ జెప్పిండు? ... కాబట్టి మన సమాజంలో వున్న బానిస మనస్తత్వాన్ని పోగొట్టాలే. మూఢ విశ్వాసాలను అంతం చెయ్యాలె. అందరు మనుషులేనన్నది మన సిద్ధాంతం. కులాలున్నా, మతాలున్నా అవి వ్యక్తిగతమైనవి తప్ప మరో మనిషిని ద్వేషించడానిక్కాదు. మన పోరాటం వ్యవస్థ మార్పుకోసం. ఆ మార్పు కేవలం పరిపాలన, ప్రభుత్వం మాత్రమేకాదు, సంఘ దురాచారాలు నిర్మూలించాలి. సర్వజనుల సమానత్వం మన సిద్ధాంతం. ఆ లక్ష్యాన్ని సాధించడానికి విప్లవం రావాలి. ఆ విప్లవం విజయవంతం కావడానికి ఎన్నో త్యాగాలు చెయ్యాలి. దానికి మీలో ఎవరు సిద్ధంగా వున్నారు? చెప్పండి? " అడిగాడు రవి అన్నీ వివరించాక.

గ్రామ యువకులు తమ అంగీకారం తెలుపుతూ తలలూపారు. సత్తిరెడ్డి లేచి, "నేను, లతీఫ్, కిష్టయ్య, గోపయ్య, మారయ్య దళంలో చేరాలనుకున్నం" అన్నాడు.

అది విని లింగయ్యకు కోపమొచ్చి దబ్బున లేచాడు.

"నీయమ్మ. యేంది పటేలా. మీరంత మొనగాండ్లు. నేను పనికిమాల్నోన్ననుకున్నవా? " అన్నాడు.

"నన్ను పిరికోడనుకుంద్రా! నన్నెందుకు వదిలేసింద్రు? " మైసయ్య అడిగాడు.

"గట్లెవ్వరన్నరు? ఇప్పుడు సెప్పరాదుంద్రి!

కొంపేం మున్గింది" లతీఫ్ సర్దిచెప్పాడు.

"అందరం దళాల్లో జేర్తే వూళ్ళో ఎవరుం టరు? అందుకే మీరిద్దరు యీడ వుంటే మంచిదనుకున్న" సత్తిరెడ్డి సమాధానం చెప్పాడు.

సత్తిరెడ్డి అన్నది కూడా సమంజసమేనని అభిప్రాయపడి రవి, "దళాల్లో పనిచేయడం ఎంత ముఖ్యమో- గ్రామంలో దళసభ్యు లుగా పనిచేయడం అంతే ముఖ్యం. లింగ య్యలాంటి వాళ్లు ప్రజలమధ్య వుండటం, ఉద్యమాలు నడపటం అవసరం" అన్నాడు.

"గట్లైతే సరేగని, ముసలోల్లనుకున్నరేమో! పనికిరాననుకున్నరేమోనని కోపమొచ్చింది" లింగయ్య అన్నాడు.

రవి నూతన దళసభ్యులచేత ప్రతిజ్ఞ చేయించాడు. గ్రామసంఘ బాధ్యునిగా లింగయ్యను నియమిస్తున్నట్లు ప్రకటిం చాడు.

★ ★ ★

సుగుణకు పురిటి నొప్పులు రావడం చూసి, శాంతమ్మ ఆదరాబాదరా పోయి దేవ మ్మను పిలుచుకొచ్చింది. ఊర్లో మంత్రసా నిగా దేవమ్మకు పేరున్నది. ఆమె హస్తవాశి మంచిదని అందరూ అనుకుంటారు.

సుగుణది తొలికాన్పు. పురుడుబోసి తల్లినీ, బిడ్డను సారె, చీరెబెట్టి అత్తవారింటికి సాగనంపాలని తీసుకొచ్చింది శాంతమ్మ. బిడ్డకు పురిటిగండం తప్పి, మంచి మగబి డ్డను కనాలని మొక్కుకున్నది.

సుగుణ ప్రసవించింది. కోరుకున్నట్లే మగ బిడ్డ! శాంతమ్మ మురిసిపోయింది.

"గండం గడిచింది దేవమ్మా! నా బిడ్డకే మైతదోనని ఖంగారుపడ్డ. నీ రుణముంచు కోనులే దేవమ్మా" అన్నది శాంతమ్మ.

"నేజ్జేసిందేముందమ్మ! దేవుడి దయవల్ల మంచిగయ్యింది. పత్తెం మంచిగ జేయిం చుండ్రి" దేవమ్మ చెప్పింది.

"అసలది తింటేగదనే. పిడికెడు మెతు కులు తినదు. ఇప్పుడు బాలింతాయె! యేం జేస్తదో యేమో?" అన్నది శాంతమ్మ.

నర్సిరెడ్డి ఇంట్లో అడుగుపెడుతుండగానే శాంతమ్మ ఎదురుగా వెళ్లి ఆనందంతో "నీకు మనుమడు బుట్టిండు" అన్నది.

నర్సిరెడ్డి ముఖంలో సంతోషం వికసిం చింది.

"యేం దేవమ్మా! నా మనమడెట్లున్నడు?" అన్నాడు నర్సిరెడ్డి.

"అచ్చం మీపోల్కే పటేలా? అచ్చుగుద్దిన ట్లున్నడు. ముద్దుగున్నడు" దేవమ్మ అన్నది.

"తల్లీ బిడ్డ కులాసేగద?"

"దేవుడి దయవల్ల బాగున్నరు పటేలా"

"ఇనామేమిటియ్యమంటవ్?" బల్లెపీట మీద కూర్చుంటూ అడిగాడు నర్సిరెడ్డి.

"పుణ్యాత్ములు, వూరికే ధర్మాత్ములు, మీరు సల్లగుండాలె- గదేసాలు పటేలా!" అన్నది దేవమ్మ.

★ ★ ★

సాయంకాలం డప్పు చప్పుడయ్యింది. వూరిజనం చెవులప్పగించి వింటున్నారు.

మాదిగ వెంకడు డప్పు చాటింపు చేస్తూ బిగ్గరగా అరుస్తున్నాడు.

"ప్రజలందర్కీ తెలియజేసేదేమంటే- పొద్దున్నే గిర్దావర్‌సాబ్ వూర్లకొస్తుండు. రైతులందరు గడికాడ్కి దెచ్చి లేవీగల్ల గొల్వాలని సర్కార్ హుకుమయ్యిందహో! ఎవరెంత గల్ల బియ్యాలో పట్వార్‌సాబ్‌ను అడ్గి దెల్సుకోవాలహో! లేవీగల్ల గొల్వనోళ్ల ఆస్తులు జప్తుజేస్తరని సర్కార్ హుకుం జేసిందహో"

అలా వూరంతా తిరుగుతూ చెప్పుతు న్నాడు.

లేవీగల్లనగానే అందరి గుండెలదిరిపోతు న్నయ్. కరువురోజులు- తిండిగింజల్లేక జనం అల్లాడుతున్నారు. ఒక్కపూట తిండే కరువయ్యింది. జొన్నసంకటి, సజ్జన్నం, గంజినీళ్లు తాగుతున్నారు. రాత్రిపూట పెసర, కంది, వేరుసెనగ గుగ్గిళ్లు తింటు

న్నారు. అవీ లేనోళ్లు నీళ్ళతోనే కడుపు నింపుకుంటున్నారు. పసిపిల్లలు ఆకలికి అల్లాడిపోతున్నారు. వాళ్ళకోసం తవ్వెడు, సోలెడుంటే భద్రంగా దాచుకుంటున్నారు. వడ్లు బంగారం కంటే ప్రియమైనయ్. కొద్దో గొప్పో వున్నవాళ్లు ఇంట్లో పాతర్లుదీసి దాచి పెట్టుకుంటున్నారు. పసిపిల్లలు, బాలింతలు, జబ్బుతో వున్నవాళ్ళకోసం కొద్దికొద్దిగా వాడు కుంటున్నారు.

లేవీగల్ల ఎక్కడ తేవాలె? జనం రాత్రంతా నిద్రబట్టకుండా ఆలోచిస్తున్నారు.

నలుగురు జవాన్లతో గిర్దావర్ వూర్లోకొచ్చాడు. పెద్ద గుర్రంమీద గిర్దావర్‌సాబ్ వచ్చి గడిలో మఖాంపెట్టాడు. జవాన్లు, మస్కూరు కొండన్ని యెంటబెట్టుకొని వూరంతా తిరుగుతున్నారు. పొద్దెక్కినా లేవీ గల్ల రాలేదు. పట్వారీ, పటేల్ షావుకారు వెంకయ్య కొలత కుండబెట్టుకొని చూస్తున్నారు.

పొద్దెక్కింది. గిర్దావర్, పట్వారి, పటేల్, జవాన్లు, మస్కూరి కొండడు అంతా కలిసి ఇల్లిల్లూ సోదా జేస్తున్నారు. అద్దెడు, కుండెడుంటే బలవంతంగా ఎత్తుకుపోతున్నారు. ఆడోళ్లు మొత్తుకుంటున్నారు, మొరబెట్టుకుంటున్నారు. కాళ్ళావేళ్ళా బడుతున్నారు.

"పస్తుల్తో సస్తున్నం. బాలింతకోసమని కుండెడు నడ్లు దాసుకుంటే తీస్కపోతున్నారు"

"మా కొంపల మీదెందుకు పడ్తరు"

"పేదోళ్లమే దొర్కినమా"

"నోర్లేనోల్లమని యెందుకిట్లజేస్తరు?"

"సంపండి, కొట్టుండిగని యీ గింజలియ్యం" అంటూ అడ్డం నిలుస్తున్నారు.

గిర్దావర్ గుడ్లురిమాడు.

"సర్కార్ గల్లియ్యమంటే నఖ్రాల్ జేస్తుంద్రు. బాంచత్! గట్ట జూస్తరేందిర. గాళ్ళను దూరం జర్పుండి" అన్నాడు.

జవాన్లు ఆడోళ్ళ రెక్కలుబట్టి లాగేస్తున్నారు. ధాన్యం మూటలెత్తుకుపోతున్నారు. ఒక ఇంటిముందు నలుగురైదుగురు ఆడవాళ్ళు దర్వాజా కడ్డంగా నిలబడ్డారు. లోపలికి రానీయమన్నారు. జవాన్లు లాఠీలతో కొట్టి, పక్కకు గుంజేశారు. దిక్కుతోచక వాళ్లు లబోదిబోమంటున్నారు.

అదంతా చూస్తున్న సత్తిరెడ్డి లతీఫ్, కిష్టయ్య, గిర్దావర్ దగ్గరికెళ్లి యెందుకు జబర్దస్తీ చేస్తున్నారని అడిగాడు.

గిర్దావర్ కొరకొర జూసి, "మీరెవళ్లుబే. యెక్వతక్వ మాట్లాడ్తె బొక్కలిర్గుతయ్. చల్ సాలే" హంటర్ చూపుతూ అన్నాడు.

సత్తిరెడ్డి హంటర్ పట్టుకొని "మంచిగ మాట్లాడు. 'బే... గీ' అంటే మర్యాదుండదు" అన్నాడు.

అదిచూసి జవాన్లు సత్తిరెడ్డిని చుట్టేశారు.

లతీఫ్, కిష్టయ్య, సత్తిరెడ్డి చెయ్యిబట్టుకొని పక్కకు తీసుకెళ్ళారు. వాళ్లు పక్కకు తొలిగినా గిర్దావర్ హంగామా చేస్తూ- నోటికొచ్చినట్లు తిడుతున్నాడు.

ఎత్తుకొచ్చిన ధాన్యం కొలిచి బస్తాల్లో నింపుతున్నారు. షావుకారు వెంకయ్య బస్తాలకు గుర్తులేస్తున్నాడు. పట్వారి లెక్కబెడుతున్నాడు. బస్తాలన్నీ బండ్లకెత్తారు. గిర్దావర్ గుర్రమెక్కాడు. సైనోడు ముందు నడుస్తున్నాడు. బండ్లవెంట జవాన్లు, మస్కూరు కొండడు పోతున్నారు.

ఊరు బయట డొంకలో 'సంగం' యువకులు దండులా అడ్డం నిలిచిఉన్నారు.

"జర్గుండ్రి... రాస్తా యిడువుండ్రి... మజాక్ జేస్తుండ్రా సాలే! హత్కడీలేసి ఖైదులో బెట్టిస్త. చమ్డాలు వొలిపిస్తబే... ఓరనుకుంటున్నారు. గిర్దావర్‌సాబ్ మీద జులుంజేస్తరా?"

"ముందు బండ్లు వెనక్కుదిప్పండి" సంగం యువకులంతా ఒక్కసారిగా అన్నారు.

"దేన్కిబే... సర్కార్ గల్ల దీస్కబోతున్నం. జర్గుండ్రి. మంచిగ జెప్తున్న"

"మేము మంచిగనె చెపుతున్నం. బండ్లను

పోనియ్యం. యేంజేస్తరో సూస్తం" సత్తిరెడ్డి అన్నాడు.

"గట్లనా! గదిబీ సూస్త" గుర్రందిగి- జవాన్లను హుషారుజేశాడు.

జవాన్లు లాఠీలెత్తారు.

దానికి బదులుగా వందల కర్రలు లేచినయ్.

జవాన్లు లాఠీలు దింపారు. గిర్దావర్ నీళ్ల నమిలాడు.

"సర్కార్‌కు లేవీగల్ల యియ్యొద్దా! యియ్యబోతే గిట్లనేజేస్తం" అన్నాడు.

"ఉంటే యిస్తం- లేకుంటే యాడినుంచి దెస్తం"

"మరి గియ్యాడినుంచొచ్చినయ్? "

"అద్దెడు, కుండెడు వున్నోళ్ళయ్ తీస్కబోతున్నారు. ఆళ్ళ దగ్గర పుట్లున్నయ్. గయ్యేందుకు దీస్కపోరు? "

"యాడున్నయ్? "

"దొర-పటేల్-పట్వారి- షావుకార్ గరిసెల్లో"

"ఓరన్నరు? "

"మేమంటున్నం"

"సూపిస్తరా? "

"చూపిస్తం"

"గదంత నాకు దెల్వదు. జులుంజేస్తే ఖబర్దార్. గిర్దావర్‌సాబ్‌ను ఎర్కనేగద"

"యేసాబైతే మాకెందుకు! ముందు వెనక్కి నడువ్"

హద్దుమీరితే మర్యాద దక్కదని వాళ్ళ మాటలు బట్టి తెలుసుకున్నాడు.

బుకాయించాలని చూశాడు.

"గట్లయితే. దొర గరిసెల్ల వడ్లు సూపిస్తరా? " అన్నాడు.

"ఆ! సూపిస్తం"

"లేకుంటే యేమైతదో యెర్కనా? గప్పుడు సెప్త" అని వెనక్కి మళ్ళి బండ్లను వెనక్కి తిప్పుకున్నాడు. బండ్ల వెనకాల వూరేగింపుగా సంగం యువకులు రావడం చూసి, రైతులు కూడా కలిశారు. గడి దగ్గర బండ్లు విడిచి, గిర్దావర్ గడిలోకి దూరాడు. కొద్దిసేపటి తర్వాత బయటికొచ్చి,

"దొర సరేనన్నడు. సీకటయ్యింది. పొద్దున గర్సెలన్నీ జూపిస్తనన్నడు. నేను జూస్కుంట. ఇగ మీరుబొండి" అన్నాడు.

రైతులు వెళ్ళిపోయారు. సంగంవాళ్లు మాత్రం రాత్రంతా బండ్ల దగ్గర, గడిముందే కాపలాగాశారు.

★ ★ ★

బారెడు పొద్దెక్కింది. గిర్దావర్ గడిలో నుండి బయటికొచ్చి-

"సూస్కుందురు రండి. సానసాన సెప్పిండ్రుబే. గిర్దావర్ సాబంటే యేందో సూపిస్త- నడువుండ్రి" అన్నాడు హెచ్చరికగా.

పదిమంది సంగం యువకులు లోపలికెళ్ళారు. గరిసెలన్నీ ఖాళీగున్నయ్. దూరంగా ఆరాంచేర్లో కూర్చొని దొర విషపు చూపులు చూస్తున్నాడు.

సంగంవాళ్లు ఒకరి ముఖమొకరు చూసుకున్నారు. అక్కడక్కడ నేలమీద రాలిన వరి గింజలు చూశాడు లింగయ్య. వాటి ఆసరాతో నడిచాడు. వెనకాల కొట్టంలో వరిగడ్డితో కప్పిన కుప్పను చూసి, అంగలో వచ్చి సత్తిరెడ్డి చెవిలో చెప్పాడు.

రాత్రికిరాత్రే ధాన్యం తరలించాలనుకున్నాడు దొర. బయటికి తీసుకెళ్ళడానికి సాధ్యం కానన్ని పుట్ల ధాన్యం అది. పైగా బయట కాపలాలు అదంతా చూసి- గడిలోపలే మాయం జెయ్యాలనుకున్నాడు. రౌడీ గుంపు, జవాన్లు, నౌకర్లు కలిసి ధాన్యం కొట్టంలోకి మోశారు. గండం గడిచిందనుకున్నాడు దొర. కానీ కథ అడ్డం తిరిగింది. రహస్యం బయటపడింది. పరువుబోయింది.

ఇహ గుండాయిజమే మార్గమనుకొని, రౌడీగుంపును వుసికొల్పాడు.

వాళ్లు సంగంవాళ్ళమీద కుక్కల్లా పడ్డారు. సత్తిరెడ్డి, లతీఫ్,మారయ్యలతలలు పగిలి

నయ్. బూతులు తిడుతూ, కొడుతూ వాళ్ళను గేటు బయటికి తోసేశారు. అది చూసి బయటిజనం వుగ్రులైపోయారు.

ఆడ, మగ, పిల్లలు, పెద్దలు రాయి రప్ప తీసుకొని గడిమీదపడ్డారు. రౌడీలు దర్వాజా మూసుకున్నారు.

అరబ్బులు డాల్ కత్తులు తీసుకొని గడి మీదికెక్కారు.

వాళ్ళతోపాటు దొర తుపాకి తీసుకుని వున్నాడు.

అరబ్బులు కత్తులు తిప్పుతూ- కసర త్తులు చూపుతూ- భయంకరంగా అరుస్తు న్నారు.

రౌడీలు కర్రలు బట్టుకొని దర్వాజ వెనక నిలబడ్డారు.

జనం మరింత రెచ్చిపోయి ముందుకు దూసుకొస్తున్నారు.

గిర్దావర్, జవాన్లు ఎక్కడో దాగారు.

దొర మేకపోతు గాంభీర్యంతో తుపాకి చూపుతున్నాడు. మాటిమాటికి గడియారం చూసుకుంటూ- వూరి బయటికి చూస్తు న్నాడు. మోటారు శబ్దంవిని దొరకు ధైర్య మొచ్చింది. ఇట్లా జరుగుతుందని తెలిసే దొర పోలీసుపటేలును పట్నం పంపాడు. పోలీసు బలగంతో వస్తున్నాడని తెలుసు కుని జనం మీదికి తుపాకి కాల్పులు మొద లుపెట్టాడు.

జనంలో ముందున్న ఇద్దరు యువకులు గాయాలతో పడిపోయారు. పడిపోయినవా ళ్లను లింగయ్య, మారయ్య పక్కకు తీసుకె ళ్ళారు. జనం ఉద్రేకంతో ఉడికిపోతూ- చావో బతుకో తెలుసుకోవాలనుకుంటు న్నారు.

లారీనిండా పోలీసులతో పటేల్ వచ్చాడు. వచ్చి రావటంతోనే చందర్‌సింగ్ రివాల్వర్ తీసి కాల్పులు జరుపుతున్నాడు. అతనితోపాటు పోలీసులు.

గడిమీదున్న దొర చెల్లాచెదరైపోతున్న జనాన్ని గాయాలతో పడిపోయి గిలగిల్లాడు తున్న వాళ్ళను చూసి వెకిలిగా నవ్వుతు న్నాడు.

కాల్పులు లెక్కచేయక యువకులు ముందుకురుకుతున్నారు. సత్తిరెడ్డి, లతీఫ్, లింగయ్య, ముత్తయ్య వాళ్లను శాంతింపజే స్తున్నారు. నలుగురు అమాయకుల ప్రాణాలు పోయినవని తెలుసుకుని, ప్రతీ కారం తీసుకోవాలని వున్నా, నిరాయుధు లుగా అది అసాధ్యమనుకున్నారు. చనిపో యిన వాళ్ళ శవాలను, గాయపడిన వాళ్లను తీసుకొని వెళ్ళారు.

తన ప్రతాపానికి చందర్‌సింగ్ మీసం మెలిబెట్టాడు.

సమయానికొచ్చి ఆదుకున్నందుకు దొర కృతజ్ఞత చెప్పి- విందుజేస్తున్నాడు.

ఊరంతా అల్లకల్లోలమయ్యింది. ఏడ్పులు వినబడుతున్నాయ్. రామారంలో కాల్పులు జరిగి- నలుగురు మరణించారనీ, పోలీ సులు రాక్షసత్వం చేశారన్న వార్త చుట్టు పక్కల గ్రామాలకందింది. కర్రలు, వడిశె లలు, తీసుకొని రామదండులా జనం కది లొచ్చారు. ఊరిబయట గుట్ట దగ్గర కాపలా గాస్తున్నారు.

మత్తుగా తాగీ, తిని, అమీన్‌సాబ్, గిర్దా వర్ తమ బలగంతో బయల్దేరారు.

గిర్దావర్ గుర్రమెక్కాడు- జవాన్లు ధాన్యం బండ్లవెంట నడుస్తున్నారు. వాళ్ళకు రక్ష ణగా చందర్‌సింగ్ లారీ పోలీసులతో నెమ్మ దిగా పోతున్నది. కొందరు పోలీసులను దొరకు రక్షణగా వుంచిపోతున్నాడు.

అలాంటి సమయంలో ఒక్కసారిగా "జై" అన్న వందల గొంతులు విని వాళ్ళ గుండె లదిరాయ్. దిక్కులు చూస్తుండగనే వడిశె లల రాళ్లవర్షం పడింది. పోలీసుల మత్తుది గింది. చేతులొణుకుతున్నయ్.

గుట్టచాటునుండి జనం వడిశెలలు వేస్తు న్నారు. తుపాకులున్నా లాభం లేదనుకొని లారీదిగి పారిపోతున్నారు.

టోపీలు పడిపోతున్నయ్. బురదలో కాళ్లు దిగబడిపోతున్నయ్. కొందరు తుపాకులొదిలేసిపోతున్నారు.

గిర్దావర్‌సాబ్ గుర్రందిగి ఎక్కడో నతికాడు. అమీన్‌సాబ్ అటు ఇటు చూసి అడ్డదారి పట్టాడు. జనం కర్రలతో వెంటబడ్డారు. పారిపోయేవాళ్లను మరింత అదరగొడుతున్నారు. పొలిమేర దాటేదాకా వెంటబడి తిరిగొచ్చారు. బండ్లను వెనక్కు తిప్పారు. దారిలో గట్టు దగ్గర గడ్డిమేస్తున్న గుర్రం కనపడింది. గిర్దావర్ ఎక్కడని వెతికారు. పొదలచాటున నక్కలా కూర్చున్న వాణ్ణి బయటికి లాగారు. గిర్దావర్ కాళ్ళావేళ్లాబడి, చెంపలేసుకున్నాడు. చితకగొట్టి వదిలిపెట్టారు. లారీకి నిప్పుబెట్టారు.

అందరూ ఊరేగింపుగా వూరుజేరి చనిపోయినవాళ్ళకు కన్నీటి వీడ్కోలుతో అంత్యక్రియలు జరిపి- ప్రతీకారం తీసుకుంటామని ప్రతిజ్ఞ చేశారు

ఊరంతా ఒక్కటయింది. వెట్టికెవరు వెళ్లటంలేదు. జుర్మానాలివ్వటంలేదు. గడికెవరు పోవటంలేదు. దొర ఎవర్నీ పిలవటంలేదు. దొర, పటేల్, పట్వారీలను వెలివేసినట్లు చూస్తున్నారు. పోలీసులు, అరబ్బులు, రౌడీల రక్షణతో దొర గుబులు గుబులుగా ఉంటున్నాడు. మస్కూరి కొండడు, రాముడు , సోముడు, యాదగిరి మాత్రం పనికిపోతున్నారు. భయానికి పోతున్నారో భక్తికి పోతున్నారో, లేక రహస్యాలు తెలుసుకోవడానికి పోతున్నారోగానీ। మంగలి పిచ్చయ్య, చాకలి నారయ్య కూడా వెళుతున్నారు.

జనం రోజూ రాత్రిపూట వూరేగింపు జరుపుతున్నారు. జైకొడుతూ, పాటలు పాడుతున్నారు. అవి వింటూ దొర మండిపడుతున్నాడు- పళ్లు కొరుకుతున్నాడు. భయంతో వులిక్కిపడుతున్నాడు. వూరి పరిస్థితి చూసి పటేల్ పాపిరెడ్డి, పట్వారి రామారావు పిల్లా జెల్లాతో అర్ధరాత్రి వూరొదిలి వుడాయించారు.

తల్లిగారింటికి వెళ్లిపోతానని చిన్నదొరసాని గోలబెడుతున్నది. పట్నమెళ్ళిపోదామని పెద్దొరసాని దొర నడుగుతున్నది.

భయమున్నా ఆస్తంతా వదిలిపోతే ఎట్లా అనుకుంటున్నాడు దొర. పారిపోయాడన్న అవమానం రాకూడదనుకుంటున్నాడు.

★ ★ ★

"రజాకార్లొచ్చింద్రు"

"రజాకార్లొచ్చింద్రు"

"వుర్కుండి-"

"పారిపోండి"

అని సందుగొందుల గుండా పారిపోయే వాళ్ళు కేకలు పెడుతున్నారు.

మసకచీకటి తొలగలేదు. వూరు చుట్టూ రజాకార్లున్నారని క్షణంలో అందరికీ తెలిసింది.

ఆడాళ్లు భయంతో దిక్కులు చూస్తున్నారు. పసిబిడ్డల్ని గుండెలకద్దుకుంటున్నారు.

పిల్లలు తల్లుల చీరకొంగుల్లో తలదాచుకుంటున్నారు.

యువతులు దడదడ గొట్టుకుంటున్న గుండెలను అదిమిపట్టుకుంటున్నారు.

స్త్రీలు, మెడలోని మంగళసూత్రం, గొలుసులు, కమ్మలు చూసుకుంటున్నారు.

వయసులో వున్న మగోళ్లంతా వూరుదాటారు.

ముసలాళ్లు దిక్కుదోచకుండా ఉన్నారు.

వూరంతా అరుపులు, కేకలతో గోలగోలగా వుంది.

శాంతమ్మ పసిబిడ్డను సుగుణ చేతుల్లో పెట్టి, ఆ దుర్మార్గుల కంటపడకుండా పారిపొమ్మని ప్రాధేయపడుతున్నది. అర్థంగాక సుగుణ అయోమయంలో పడింది. వాళ్ళ కంటబడితే ప్రమాదమని తెలుసు.

తల్లిమాట కాదనలేక బిడ్డను తీసుకొని పక్కసందులోనుండి నెమ్మదిగా వూరు

దాటింది. నల్లని ఆకారాలతో పొంచివున్న రజాకార్లను కనిపెట్టింది. పచ్చిబాలింత చేతుల్లో బిడ్డ, కింద కంప- కట్టే, వెనక దుర్మార్గులు- ఆయాసంతో పరుగెడుతు న్నది. కొంత దూరంపోయి అలసి ఆగింది. వెనక్కు చూసింది. దూరంనుండి ఒకడు తనవైపు పరుగుతో వస్తున్నాడు. ఆమె గుండె ఝల్లుమన్నది. పరుగు దీస్తున్నది. బిడ్డ ఏడుపు ఎక్కువయ్యింది. వాడు దగ్గర య్యాడు. అడుగేయలేకపోతున్నది. పసిబిడ్డ తల్లిని, కనికరించకపోతడా అనుకొని ఆగింది. వాడు నల్లగా, పొట్టిగా దున్నపోతు లాగున్నాడు. ఆయాసంతో బుసలు కొడుతు న్నాడు.

"అన్నా దండం బెడత. పసిబిడ్డ తల్లిని. నన్నేమనకన్నా! పుణ్యముంటుంది. కావా లంటే నా నగలన్నీ యిస్త" అన్నది.

కొన్ని గజాల దూరంనుండే యివ్వమ న్నట్లు చెయ్యి చాపుతూ వస్తున్నాడు. సుగుణ బిడ్డను నేలమీద పడుకోబెట్టి నగ లన్నీ దగ్గరికొచ్చినవాడి చేతిలో పెట్టింది.

నగలతోపాటు చెయ్యందుకోబోయాడు.

సుగుణ విదిలించుకుని మళ్లీ పరుగుతీ సింది. వాడు వెంటబడుతున్నాడు. అక్కడ పసిబిడ్డ గుక్కబెట్టి ఏడుస్తున్నాడు. కొద్దిదూ రంలోని పెద్ద బావిగట్టుకు చేరి తిరిగిచూ సింది. వాడు తననొదిలేట్లు లేడనుకున్నది.

కళ్లు మూసుకొని బావిలో దూకింది.

వాడొచ్చి నీటిలో మునిగి తేలుతూ- సుగుణ శవంగా మారేవరకు చూసి వెన క్కుమళ్లాడు.

బిడ్డ ఏమయ్యిందోనని వెనకాలే వచ్చి శాంతమ్మ పసివాణ్ణి చూసింది. తీసుకొని గుండెలకద్దుకొని- తన బిడ్డకోసం వెతు కుతూ ఎదురుగా వచ్చే దుర్మార్గుణ్ణి చూసి వూపిరి సలపకుండా చెట్టుచాటున దాగింది.

అనుమానంతో వెళ్ళి చూసింది- శవమై తేలుతున్న బిడ్డను చూసి కెవ్వుమన్నది.

★ ★ ★

ఊరునిండా రజాకార్లు చేస్తున్న అరాచ కాలు లచ్చుమమ్మ గమనిస్తున్నది. ప్రజల హాహాకారాలు వింటున్నది. ఇంట్లోనుండి బయటపడాలని చూస్తున్నది.

బిడ్డను చంకనెత్తుకొని బెదిరిన లేడిలా నలుదిక్కులా తొంగిచూసింది. ధైర్యంచేసి గడపదాటుతుండగనే ఆ దుర్మార్గుల కంటబ డింది. గభాలున లోనికెళ్ళి తలుపేసు కుంది.

రజాకార్లు తలుపుబద్ధలుగొట్టి లోనికి దూరారు. లచ్చుమమ్మ కెవ్వుమన్నది.

ఆమె చేతుల్లోని బిడ్డను లాగి నేలకు విసి రికొట్టాడొకడు. ఒకే కేకతో మళ్ళీ నోరు మెదపకుండా ఆ బిడ్డ ప్రాణం విడిచింది.

మరొకడు లచ్చుమమ్మను గట్టిగా పట్టుకు న్నాడు. ఆమె గిలగిల్లాడుతూ గగ్గోలు పెడు తున్నది.

ఆమె ప్రయత్నం ఫలించలేదు. వాళ్ళ వెకి లినవ్వుల మధ్య నలిగిపోయింది.

ఒకరి తర్వాతొకడుగా నలుగురు కామాం ధులు కామవాంఛ తీర్చుకొని బయటికె ళ్ళారు. మానం పోగొట్టుకొని, ప్రాణంపో యిన బిడ్డను చేతుల్లోకి తీసుకొని విలపిస్తు న్నదామె.

గడిదగ్గర కూర్చున్న రజాకార్ల నాయకుడు పట్టుకొచ్చినవాళ్ళకు శిక్షలు విధిస్తున్నాడు. రజాకారుగా మారిన దస్తగీర్ వూరి విష యాలూ, వ్యక్తుల గురించి చెప్పుతున్నాడు.

నబీసాబ్‌ను, అతని కొడుకు ఆసిఫ్‌ను పట్టుకొచ్చిండ్రు. తన తమ్ముడు రజాకారుగా మారినందుకు నబీసాబ్ ఆశ్చర్యపోయాడు. రజాకార్ల నాయకుడు నబీసాబ్‌ను చూసి...

"అరేయ్... నువ్వు గూడ సంగంలో జేర్నివా? గదేందిబే! ముసల్మాను పుట్క బుట్టి గట్లెందుకు సేస్తున్నవ్ బేవకూబ్. నువ్వు ముసల్మానువు. నేను ముసల్మాన్, రాజు ముసల్మాన్, సర్కార్ అప్నా హైరే... తుజే మాఫ్‌కర్‌దేతాహూ! మాకు మద్దతు జెయ్యి" అన్నాడు.

"ముసల్మానైన- హిందువైనా మేమందరం పేదోళ్ళం. అందరం ఒక తీరిగనే బాధలుపడ్తున్నాం" నబీసాబ్ అన్నాడు.

"గయన్నీ నీకెందుక్కు- నువ్ మాదాంట్ల జేరు" దగ్గరిగా వచ్చి దస్తగీర్ సలహా చెప్పాడు.

"తూ! నువ్ గడ్డి తింటున్నవ్. మమ్మల్ని తినమంటవా? "

"అన్నవని సెప్తున్న అయిటంక నీ ఇష్టం. నీకొడుక్కు లతీఫ్ సంగంలో జేరిండని గీళ్లకు సెప్తె యేమైతదో యెర్కనా? "

"సంగమేం తప్పుజేసింది? గరీబోల్లకు నాయం జేస్తుంద్రు. దొర, పటేండ్ల జులుం పోగొడుతుంద్రు"

"అగ్గో! యీన్కిగూడ సంగపోళ్ల కూతలొచ్చినయ్!" అని అతని చెంపమీద ఛెళ్ళున కొట్టాడు.

"బచ్చాగాళ్లు లుచ్చాలయ్యింద్రు. నువ్వన్నయిను. ముసల్మాను పుట్కబుట్టినవ్ రజాకార్లల్ల జేరు. తల్వార్ బట్టు. జాగీరిప్పిస్త - దర్జాగ బతకొచ్చు సమజయ్యిందా? "

"రాజు ముసల్మానైతే- ముసల్మాన్లందరు రాజులైతరా? మరి ఈ దొర, పటేండ్లు గూడ ముసల్మాన్లేనా? "

అప్పటిదాకా పట్టించుకోని రజాకార్ల నాయకుడు గబుక్కునలేచి-

"అరే... హరామ్జాదే. గపుట్నుంచి సూస్తున్న సాలే... లెస్స మాట్లాడ్తున్నవ్? " అంటూ నబీసాబ్ గడ్డంపట్టి అటూ ఇటూ గుంజాడు.

దస్తగీర్ దగ్గరకొచ్చి యేదో చెప్పబోయాడు.

నబీసాబ్ తుపుక్కున అతని ముఖమ్మీద వూశాడు.

ముఖం తుడుచుకుని దస్తగీర్ కన్నెర్రజేశాడు. కర్రదీసుకుని నబీసాబ్ ఆసిఫ్‌ను ఎడాపెడా కొట్టాడు.

"సాబ్... యే బద్మాస్ మేరా బాయీహై... చెడిపోయిండు. లాకప్పులో బెట్టెగని యీళ్ళ మదం దిగదు" నాయకుడితో అన్నాడు.

రజాకార్లు వాళ్లందర్నీ లాక్కుపోయారు.

వూరిబయట చెట్లనీడన మరికొందరు మఖాంజేశారు. అమీన్ చందర్‌సింగ్, అతని పోలీసుబలగం రక్షణకోసం వున్నారు. జల్సా జేసుకుంటున్నారు. పక్కన గుర్రాలు దానా మేస్తున్నయ్.

పక్కనున్న గడ్డివాములో గలగలమన్న చప్పుడు వినబడ్డది. చందర్‌సింగ్ నులక మంచమ్మీదినుండి దిగ్గున లేచాడు. అటు ఇటు చూశాడు. భయంతో దయ్యమో, భూతమో, సంగపోల్లో అన్న అనుమానమేసింది. ఒక పోలీసుకు సైగ చేశాడు.

వాడితోపాటు ఒక రజాకారు కూడా బరిసెదీస్కొని గడ్డివాము దగ్గరికిపోయి భయం భయంగా కలయజూస్తున్నారు. మరోసారి గడ్డి కదిలింది.

రజాకారు కళ్లు మూసుకొని బరిసెతో బలంగా పొడిచాడు. కెవ్వుమన్న కేకతో తిరుపతయ్య బయటికొచ్చాడు. బరిసెదెబ్బతో జబ్బలోనుండి రక్తం కారుతున్నది. వాళ్ళను చూసి బిత్తరపోయి చూశాడు తిరుపతయ్య. అతని జుట్టుపట్టుకొని తీసుకుపోయి చందర్‌సింగ్ ముందుపడేశారు.

పేరుజెప్పమని, సంగపోళ్ళ జాడ చెప్పమని చందర్‌సింగ్ చిత్రహింసలు బెట్టాడు, కొట్టాడు, తిట్టాడు, సిగరెట్‌తో కాల్చాడు. తిరుపతయ్య తనకేమీ తెలియదని సైగలతో చెప్పాడు.

"నేనెవర్నో యెర్కేనా? చందర్‌సింగ్ పేరిన్నవా? గాన్నే నేను. నా పేర్జెప్తె లంగలు, దొంగలు గబ్రాయిస్తరు. గసుంటోన్ని- గిసుంటోన్ని గాదు- తాలూకంత హడల్. నువ్వేంది బే నఖ్రాల్ సేస్తున్నవ్. జబాన్‌దెర్వ్.. బోల్ సాలే... "

తన్నాడు, కొట్టాడు- విసుగెత్తిపోయాడు.

"నువ్‌గిట్ల సెప్పవ్" అని తిరుపతయ్య గొంతు గట్టిగా నొక్కాడు. ఊపిరాడక తిరుపతయ్య నోరు దెరిచాడు. చందర్‌సింగ్ అతని నాలుక పట్టేసి- బొడ్లోని బాకుదీసి కటుక్కున కోశాడు.

తిరుపతయ్య తల నరికిన మేకపిల్లలా గిలగిల్లాడుతున్నాడు. అమీన్‌సాబ్, అతని మూక పకపక నవ్వుతున్నారు.

తిరుపతయ్య కళ్లు ఎరుపెక్కినయ్. రక్తం మడుగులో తల్లడిల్లుతున్నాడు. వణుకుతున్న చెయ్యికి పెద్దరాయి తగిలింది.

దాన్ని బలంగా చందర్‌సింగ్ తలకు గురిపెట్టాడు. తల పక్కుమన్నది. "మర్గయా" అంటూ కూలబడ్డాడు.

పక్కనున్న మూక తిరుపతయ్యను బైనెట్లతో పొడిచి గడ్డివాములోకి తోశారు. నిప్పుబెట్టి నిలువునా కాల్చిచంపారు.

అలా సాయంత్రందాకా వూర్లో ఎన్నో ఘోరాలు చేశారు. మానాలు దీశారు. ప్రాణాలు తీశారు. పుస్తెలతోసహా దొరికిందల్లా మూట గట్టుకున్నారు.

పట్టుబడిన వాళ్ళను రెక్కలు విరిచికట్టి తీసుకుపోతున్నారు. పోతుపోతూ గుడిసెలకు నిప్పుబెట్టారు.

ఒక్కసారి వూరంతా భగ్గుమన్నది. ఎర్రని మంటలు లేచినయ్- నల్లని పొగలు కమ్మినయ్.

★ ★ ★

బూడిదైన ఇండ్లు, నిరాశ్రయులైన జనం- ఆప్తులను పోగొట్టుకున్నవాళ్లు- ఆస్తులు దోచుకోబడ్డవాళ్లు- మానాలు తీయబడ్డవాళ్లు- చిత్రహింసలకు గురైనవాళ్లు- బందీలుగా పట్టుకెళ్లబడినవాళ్లు- రకరకాలుగా రజాకార్ల దుర్మార్గాలకు బలైనవాళ్లు- యే వీధి చూసినా, ఏ ఇంట్లో చూసినా విషాదమే.

శాంతమ్మ పసిబిడ్డను చేతుల్లో బెట్టుకొని పుట్టెడు దుఃఖంలో మునిగున్నది. యేడ్చి యేడ్చి కన్నీళ్లు కూడా కరువైనట్లున్నయ్. దీనంగా, దిగాలుగా చూస్తున్నది.

గుడిసె గోడలమధ్య లచ్చుమమ్మ గుండెలు బాదుకుంటున్నది. పసిబిడ్డ ప్రాణం దీశారు. భర్తను కాల్చిచంపారు. ఆమె మానం దీశారు. ఇంకా తనకు మిగిలిందేమిటని విలపిస్తున్నది.

కొడుకుని పోగొట్టుకున్న చాకలి నారయ్య, అతని భార్య మతిపోయినట్లున్నారు.



జై అన్న శబ్దంవిని అందరిముఖాల్లో ఆనందం వికసించింది. ఇండ్లల్లోనుంచి బయటికొచ్చి దళానికి స్వాగతం చెపుతున్నారు.

30-40 మంది దళసభ్యులు- అందులో అయిదారుగురు స్త్రీలున్నారు. మగవాళ్లు ఖాకీనిక్కర్లు- షర్టులు వేసుకున్నారు. స్త్రీలు ఖాకీరంగు చీర, తెల్లని రవికలు ధరించివున్నారు.

వాళ్ళందరి భుజాలమీద ఆయుధాలున్నాయ్. కదంతొక్కుతూ, పదం పాడుతూ వస్తున్నారు. గ్రామయువకులు కాశెలు బిగించి, కర్రలు, గుత్పలు భుజాన పెట్టుకొని దళంతోపాటు నడుస్తున్నారు. పిల్లలు, పెద్దలు, ఆడ, మగా తేడా లేకుండా జనం వూరేగింపుగా వెనకాల వెళుతున్నారు. ఊరిలో వున్న డప్పులు, కొమ్ములు, బాజా భజంత్రీలు మోగుతున్నయ్. వందల గొంతులతో నినాదాలు మిన్నుముట్టుతున్నాయ్. అవి గడిలో ప్రతిధ్వనిస్తున్నాయ్.

దొర గుండె దడదడమంటున్నది.

జైబోలో స్వతంత్ర భారత్‌కీ... జై
ఆంధ్రమహాసభకీ జై
కమ్యూనిస్టు పార్టీకీ జై
బాలసంఘానికి జై
రైతు సంఘానికి జై
నినాదాలు- మధ్యమధ్య పాట.
"వేగరావోయ్ కార్మికా-
వేగరావోయ్ కర్షకా
కలిసి మెలిసి పలకవోయ్
అరుణ పతాకకు జై
జైజైజై అరుణ పతాకకు జై
కత్తులు దూసుకుపోయినా
నెత్తురుటేరులు పారినా
ఎత్తిన జెండా దించకోయ్
అరుణ పతాకకు జై... ॥జై॥

సందుసందూ తిరిగి ఊరేగింపు గడి వైపు సాగుతున్నది

గుడిసెలో గుడ్డిదీపం కాంతిలో దీర్ఘాలోచనల్లో వున్న లచ్చుమమ్మ ఆ గొంతులు విన్నది. బిరాన లేచి నడుము బిగించి సూరులో వున్న కొడవలందుకున్నది.

భద్రకాళిలా ఉగ్రరూపం దాల్చి జై అంటూ జనంలో కలిసింది.

దొర భయంతో వణుకుతున్నాడు. మాటలు తడబడుతున్నయ్. వణుకుతున్న చేతుల్తో తుపాకి తీసుకున్నాడు. నౌకర్లను, అరబ్బులను పిలిచి...

"గడి తలుపులు గట్టిగేయండి. గడి దగ్గరకెవడన్నొస్తే కాల్చేయండి. నరికి పోగుల్ బెట్టండి. సాలోఁకు హలాల్ కర్దో" అన్నాడు.

పిచ్చికుక్కలా అటు ఇటూ పరుగెడుతున్నాడు. దొరసాన్లు గజగజ వణుకుతు గదుల్లో దూరుతున్నారు. ఊరేగింపు మరింత దగ్గరికొచ్చింది. ఒక అరబ్బు దర్వాజ సందుల్లోనుండి చూస్తున్నాడు. రౌడీ ఒకడు గోడపైనుండి తొంగి చూశాడు.

వాళ్ళ గుండెలదిరినయ్. గుసగుసలు పెడుతున్నారు. దిక్కులు చూస్తున్నారు.

గడిగేటుముందు జనం 'జై' అన్నారు.

"అరె... అల్లా మర్గయా..." అంటూ అరబ్బులు వెనక గోడ దూకారు. వాళ్ళతోపాటు పోలీసులు వుడాయించారు. రౌడీలు దొడ్డిదర్వాజ తీసుకొని బయటపడ్డారు.

గేటు దగ్గర రామిగాడు నిలుచున్నాడు.

దొరను చూసి ముసిముసిగా నవ్వాడు. గేటు తలుపు తీయగానే జనం ఆవేశంతో ఒక్కసారి దూసుకొచ్చారు.

దొర ఎక్కడో దాగాడు.

దొరసాన్లు పడుతూ, లేస్తూ దొడ్డి ధర్వా



జనైపు పరుగుదీస్తున్నారు.

ఎదురుగా గండ్రగొడ్డలి పట్టుకొని అడ్డం నిలిచిన యాదగిరిని చూసి కెవ్వుమన్నారు. వణుకుతున్న చేతులు జోడించి దండంబెట్టారు.

యాదగిరి దర్వాజదీసి పక్కకు జరిగాడు. దొరసాన్లు అతనికి మరోసారి దండంబెట్టి చీకట్లో జారుకున్నారు.

దొరకోసం గడి అంతా వెతుకున్నారు జనం. ఒక గదిలో మంచంకింద దాగిన దొరను కనిపెట్టింది లచ్చుమమ్మ. అతని జుట్టుబట్టి బయటికి లాగి కొడవలెత్తింది.

ఆ దెబ్బను తప్పించుకున్న దొర దొడ్డిదారివైపు దవుడు దీశాడు.

ఎదురుగా పరశురాముడిలా నిలిచిన యాదగిరిని చూశాడు.

"దండం బెడ్తరా! నన్ను కాపాడు. చంపేస్తరు... నీకు దండం బెడ్త. నీకేం గావాలన్న యిస్త..."

చేతులు జోడించి ప్రాధేయపడుతున్నాడు. చెమటలు కారుతున్నయ్. కాళ్ళూ-చేతులు వణుకుతున్నాయ్. మాట పెగలటంలేదు. కళ్ళు బెదురుచూపులు చూస్తున్నాయ్.

యాదగిరి పెద్దగా నవ్వేడు.

"దొరా! యియ్యాలతో నువ్వు ఖతం" అని



గొడ్డలెత్తాడు.

దొర వెనక్కుమళ్ళాడు. అటువైపు లచ్చు మమ్మ కొడవలెత్తి కాళిలా చూస్తున్నది.

దూరంనుండి జనం "నరకండి- చంపండి- ఖతంకరో" అంటూ పరుగెత్తుకొ స్తున్నారు. వంటింటి కుందేలులా అయ్యాడు దొర. చెంపలేసుకుంటున్నాడు. ముక్కు నేలకు రాస్తున్నాడు. బాసలు చేస్తున్నాడు- ప్రాధేయపడుతున్నాడు.

"ఎన్ని ప్రాణాలు దీసినవ్- యెన్ని కొంపలు గూల్చినవ్. నువ్వు బత్కుంటే వూరు బాగుపడదు. నువ్వు చావాలి... నువ్వు చావాలి"

కసిగా ఒక్కవేటు వేసింది లచ్చుమమ్మ.

యాదగిరి గొడ్డలితో మరోవేటు వేశాడు. దొర తల తెగి పడ్డది. కోడిపుంజులా గిల గిల కొట్టుకొని ప్రాణం విడిచాడు. అది చూసి జనం సంతృప్తి చెందారు. విజయగ ర్వంతో జైకొట్టారు. గడిమీద జెండా కట్టారు.

జనాన్ని దళసభ్యులు శాంతింపజేశారు. అరుగుమీద నిలబడి రవి ఏదో చెప్పబోతుం డటం గమనించి జనం నిశ్శబ్దమయ్యారు.

"మీ ఆవేశం, దొరమీద మీకున్న కసి, ద్వేషం తెలిసింది. అతనెంత దుర్మార్గుడో అర్థమయ్యింది. కానీ, ఒక్క దొరపోతే, ఒక్క వ్యక్తిని చంపితే పరిస్థితులు మారవు. దోపిడి పోదు. వ్యవస్థ మారదు. మీ దొర కంటే దుర్మార్గులున్నారు. వాళ్ళను పోషించి, కాపాడే రాజరికం వున్నది. వాళ్ళకు అండగా మిలటరీ, పోలీసు, అధి కార యంత్రాంగమున్నది. దాన్ని సమూ లంగా నిర్మూలించాలి. అంటే నిజాము పాలనను కూలదోసి ప్రజారాజ్యం స్థాపిం చాలి. దానికోసమే మనపోరాటం. అది సాధించడానికి ఎన్ని త్యాగాలైనా చెయ్యాలి. అవసరమైతే ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధం కావాలె. సాయుధపోరాటంతో- దెబ్బకు దెబ్బ తియ్యాలె. ప్రతి మనిషి ఒక గెరిల్లా సైనికుడు కావాలె. స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు అందరూ విప్లవసైనికులు కావాలె" అన్నాడు.

ప్రజలు ప్రతిజ్ఞ చేస్తూ "జై" కొట్టారు.

యువకులు దళసభ్యులుగా చేరిపో యారు.

★ ★ ★

అర్ధరాత్రి కుక్కలు మొరుగుతుంటే నిద్ర లేచి తలుపుదీసి చూశాడు నారయ్య.

పక్కన పాడుబడిన గోడలముందు కుక్కలు గుంపుగాచేరి ఎడతెరిపి లేకుండా మొరుగుతున్నయ్. ఎవరినో చూసి, పసిగట్టి నట్లున్నయ్. నారయ్యను చూసి ధైర్యమొచ్చి నట్లు గోడల మధ్యకు దారిదీసినయ్. వాటి వెనకాలే అతను నడిచాడు. వెన్నెలరాత్రి, తెల్లని పిండివెన్నెల కాస్తున్నది. గోడదాపున నీడలో నక్కి కూర్చున్న దొరసాన్ల మీదికి కుక్కలు దూకబోతున్నయ్. దొరసాన్లు కెవ్వున అరుస్తూ, వెలుతురులో కొచ్చారు. వాళ్ళను చూసి నారయ్య అలవాటు ప్రకారం, "దండం బెడ్త దొర్సాని" అంటూ గబగబా కుక్కల్ని తరిమేశాడు.

వాళ్ళు గజగజ వణుకుతూ, ఏడుస్తూ చేతులు జోడించి నారయ్యకు దండం బెడు తున్నారు. క్షణకాలం నారయ్య అయోమ యంతో నిలిచిపోయి- తేరుకున్నాడు.

"రండి దొర్సాని- మీ పానాన్కి నా పాన మిస్త- బయపడకండి" అన్నాడు.

"నారయ్యా- నీకు దండంబెడ్త- మమ్మల్ని కాపాడు- నీకు పుణ్యముంటుంది- నీ మేలు ఎప్పుడూ మరిచిపోను" గద్గద స్వరంతో ఏడుపు నాపుకుంటూ పెద్దొరసాని అన్నది.

నారయ్య గుండె తరుక్కుపోయింది. మానవత్వం తొంగిచూసింది.

"రండి దొర్సానీ- మా ఇంటికి బోదాం"

దొరసాన్లు ఒకరి ముఖం ఒకరు చూసు కున్నారు.

"నన్ను నమ్మండి దొర్సానీ... మీకే ఆపద

రానియ్యి. పమానంజేసి సెప్తున్న రండి దొర్సానీ" నారయ్య వెనకాల భయం భయంతో నడుస్తున్నారు.

ఇంట్లో దీపం వెలుతురు గుడ్డిగా వుంది. మూలనున్న ఈత చాపదెచ్చి నేలమీదబరిచి- కప్పుకున్న దుప్పటి దులిపి దానిమీద పరిచాడు.

"గరీబోన్ని దొర్సానీ- దండంబెడ్త. కుర్చీల్లేవు, మంచంలేదు" అని చాప చూపుతూ కూర్చోమన్నాడు.

దొరసాన్లు చాపమీద దగ్గరగా ఆనుకొని కూర్చున్నారు. నారయ్య దీపం పెద్దది చేశాడు.

వాళ్ళకెదురుగా దూరంగా నిలబడి...

"దొర సచ్చిపోయిండు" అన్నాడు.

అది జరుగుతుందని వాళ్ళకు తెలిసో- లేక తమ ప్రాణాలు మిగిలాయన్న సంతృప్తోగాని వాళ్ళు ఆ వార్త విని చలించలేదు. దూరంగా చాపమీద ముసుగుబెట్టుకొని పడుకున్న నారయ్య భార్య మాత్రం దొర సచ్చిపోయాడని వినగానే దిగ్గునలేచింది.

"సచ్చిపోయిండా! పాపిస్టిముండాకొడ్కు- పీడ విర్గడయ్యింది. ఎందరి వుసురుబోసుకున్నాడు. సేస్ని పాపం వూర్కెనేబోతద! దేవుడు లేడు" అన్నది. కొడుకును తలుచుకొని ఏడ్పు మొదలుబెట్టింది.

కొడుకు తిరపతయ్య చనిపోయిన్పటి నుండి ఆమె మామూలు మనిషిగా లేదు. కొడుకును తలుచుకుని విలపిస్తున్నది. దొరసాన్లు తను ఇంట్లోనే వున్నారని తెలిస్తే... ఎన్ని మాటలంటుందో- ఏమి చేస్తుందోనని నారయ్య భయపడ్డాడు.

"సరేగని- నువ్వు నోర్మూస్కొని పడ్కో. అర్ధరాతిరి యేడ్పు మొదలుబెట్టినవ్. పడ్కో'' గద్దించాడు.

ఆమె నోరు మెదపకుండా ముసుగు బెట్టుకుంది. దొరసాన్లు గుండెలు లబ్ డిబ్ లబ్ డిబ్ మని వేగంగా కొట్టుకుంటున్నాయ్. బిక్కు-బిక్కుమంటున్నారు. కొంగుల్తో ఏడ్పును ఆపుకుంటున్నారు. నారయ్య ఏం చేస్తాడోనని అనుమాన పడుతున్నారు.

"దొర్సానీ- మీకేం బయంలేదు, కూసోండి. పెట్టడాన్కి ఇంట్ల ఏమిలేదు. మంచి నీళ్ళియ్యడానికి గాజుగ్లాసు కూడ లేదు. ఇప్పుడే వస్త" అని వెళ్ళబోతున్న నారయ్యతో తనకేమీ వద్దు, ఎక్కడికీ పోవద్దని కోరింది పెద్దొరసాని.

"దొర్సానీ! ఎన్నడు గడపదాటనోళ్లు- కాలు కిందబెట్టనోళ్ళు- కష్టం- కన్నీరు ఎర్గనోళ్లు మీరు. ఆపదలోనైన మా ఇంటికొచ్చిండ్రు"

"నారయ్యా! నిన్నెన్నో బాధలు బెట్టినమ్- అయన్నీ మర్చిపో నారయ్యా! మమ్మల్ని కాపాడు. నీకు దండం బెడ్త. నాకెందుకో భయంగా వుంది. నీ మేలెప్పుడూ మరిచిపోము" అన్నది పెద్దొరసాని చేతులు జోడించి. చిన్న దొరసాని వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ తాను కూడా చేతులు జోడించి ప్రాధేయపడుతున్నది.

"దొర్సానీ! గయన్ని యిప్పుడెందుకు? నా మాట నమ్మండి. కూటికి లేనోన్నైనా నీతిలేనోన్ని గాను. మీకే ఆపద రాదు. మిమ్మల్ని క్షేమంగా పంపిస్తా- పమానంజేసి సెప్తున్న దొర్సానీ" అన్నాడు విధేయతతో.

నారయ్య మాటలు వాళ్ళకు కొంత మనశ్శాంతి నిచ్చినయ్. కంటితడి తుడుచుకుంటూ సరేనన్నట్లు తలలూపారు.

"ఇప్పుడే వస్త దొర్సానీ. మీరు నిచ్చింతగుండండి" అని తలుపు దగ్గరేసుకొని బయటికెళ్ళాడు.

యేమి జరుగుతుందో? ఎలా బయటపడతమో? నారయ్య ఎక్కడి కెళుతున్నాడో? అని భయపడుతున్నారు. చిన్న శబ్దం విన్నా వులిక్కి పడుతున్నారు. ఇద్దరూ ఒకరినొకరు కౌగలించుకొని బిత్తర చూపులు చూస్తున్నారు.

బయట తలుపు తెరిచిన శబ్దం విని భయంతో దిగ్గున లేచి నిలబడ్డారు.

నారయ్య, అతని వెనకాల సత్తిరెడ్డి, లతీఫ్ రావడం చూసి, దొరసాన్లకు ప్రాణాలు పోతున్నట్లు అయ్యింది.

"మీకేం భయంలేదు. కూర్చోండి" సత్తి రెడ్డి అన్నాడు.

అది ఆజ్ఞలా భావించి దొరసాన్లు కూర్చు న్నారు. నారయ్య మరో దుప్పటి తెచ్చి నేల మీద పరిచాడు. సత్తిరెడ్డి, లతీఫ్ కూర్చు న్నారు.

"ప్రజలకు శత్రువు దొర. మీరు కాదు. పెద్దొరసాని ఎన్నో దుర్మార్గాలు చేసింది. అయినా ఆడమనిషిగా సంగం క్షమిస్తు న్నది. క్రూరుడైన దొరను ప్రజలు ఆవే శంతో చంపేశారు. మీరు గడికెళ్ళండి. మీకే ప్రమాదం రాదు. పొద్దున మీ భర్త అంత్య క్రియలు చేసుకోవడానికి మా సంగం తర పున కావలసిన సహాయం చేస్తాం" చెప్పాడు సత్తిరెడ్డి.

దొరసాన్లు చేతులు జోడించి- దుఃఖాన్ని ఆపుకుంటూ అన్నారు...

"వద్దు మేమిక్కడుండం"

"మరెక్కడికి బోతరు? " లతీఫ్ అడిగాడు.

"మా పుట్టింటికి పోతాం" చిన్న దొరసాని అంది.

"మీ ఇష్టం! అది కూడా ఒకందుకు మంచిదే. కొంతకాలం అక్కడుండి రండి. మీ ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తం. యీ రాత్రికే మిమ్మల్ని జాగ్రత్తగా మీ పుట్టింటికి సాగనంపుతం" చెప్పాడు సత్తిరెడ్డి.

సత్తిరెడ్డి, లతీఫ్ బయటికెళ్ళారు.

కొద్దిసేపట్లో కచ్చడం ఏర్పాటు చేసి, నారయ్య, లతీఫ్ మరో నలుగురు సంగం కార్యకర్తలతో దొరసాన్లను సాగనంపారు.

★ ★ ★

గ్రామంలో గ్రామరక్షణ దళం ఏర్పడింది. రజాకార్లు ఎప్పుడైనా దాడి చేయవచ్చునని రాత్రింబవళ్లు కాపలా కాస్తున్నారు. మిద్దెల మీద, రాళ్లు పోగుజేసుకొని పెట్టుకున్నారు. యువకులు గుత్పలు, వడిశెలలు సిద్ధం చేసుకున్నారు. స్త్రీలు, కొడవళ్లతోపాటు కారం పొట్లాలు కొంగున కట్టుకుంటు న్నారు. రాత్రిపూట దారుల్లో, మిద్దెలమీద వంతులవారిగా కాపలాలు కాస్తున్నారు.

ఊహించినట్లే- పట్టపగలు రజాకార్లు ఆక స్మికంగా దాడిజేశారు.

నాలుగువైపులనుండి వందమంది ఆయు ధాలతో దూసుకొస్తుంటే, రజాకార్ల దాడికి సూచనగా బురుజు దగ్గర గంటమోగింది.

స్త్రీలు, పురుషులు, పిల్లలు ఒక్కసారి బొలోమని లేచారు. వడిశెలలతో యువ కులు రజాకార్ల గుంపును బెదరగొడుతు న్నారు. రివ్వు రివ్వుమని వచ్చే వడిశెల రాళ్ళను జూసి రజాకార్లు బిత్తరబోయారు.

అటు ఇటు చూస్తుంటే గుత్పలు, కర్రలతో మరికొందరు, రాళ్ళతో కొందరు మీదబ డ్డారు.

స్త్రీలు గాలివాటం జూసి కారం గుప్పుతు న్నారు. రజాకార్ల కండ్లు మండుతుంటే గంతులేస్తున్నారు.

వందలమంది జనం తమను పిచ్చికుక్క లను కొట్టినట్లు కొడుతుంటే, దిక్కుదోచని రజాకార్లు పిక్కబలం చూపి పారిపోతు న్నారు. పారిపోతున్న వాళ్ళను జనం కేకలు- అరుపులతో హడలగొడుతూ తరిమి కొడుతున్నారు.

బతికితే బల్సాకు తిని బతుకొచ్చునని రజాకార్లు పారిపోతున్నారు. కొందరు తుపాకులొదిలేస్తున్నారు. మరికొందరి టోపీలు రాలిపోతున్నాయ్.

గ్రామప్రజలు వుత్సాహంతో వూరేగింపు జేశారు. సంగం బలమేమిటో వాళ్ళకు తెలి సింది. ఐక్యంగా వుంటే వచ్చే శక్తేమిటో తెలుసుకున్నారు.

గ్రామ కమిటీని ఎన్నుకొని- సమస్యల పరిష్కారానికి పూనుకున్నారు. పోరంబోకు, బంచరాయి పడవుభూములు, దొరలు, పటేళ్లు, షావుకార్లు ఆక్రమించుకున్న భూమి

లను లెక్కలుదీసి భూమిలేని పేదలకు పంచిపెట్టారు.

ఊరంతా ఒక్కటిగా- దోపిడీకి దూరంగా కొత్త జీవితాలు ప్రారంభించారు.

* * *

డ్రాయింగ్‌రూంలో కూర్చున్న శకుంతల ఆలోచనల్లో మునిగిపోయి తండ్రి వచ్చింది గమనించలేదు. కోర్టునుండి వచ్చిన గోపాల రెడ్డి షేర్వాని, టోపీ తీసి శకుంతల పక్క నొచ్చి కూర్చొని...

"ఎందుకమ్మ అట్లున్నవు. యేమిటి సోంచాయిస్తున్నవు?" అన్నాడు.

"ఏమిలేదు బాపూ!"

"భోజనం చేసినవా?"

శకుంతల మౌనం గమనించి అర్థం చేసుకున్నాడు.

"రెండు గొట్టింది. నా కోసం యింతెజార్ చెయ్యొద్దనన్నగదమ్మ!"

"ఆకలిగా లేదు..."

టేబుల్ మీదున్న పేపరు తీసి చూపిస్తూ అంది...

"ఈ వార్త చూసినవా బాపూ?"

"తెలుసు బేటీ- దినాం జర్గుతున్నదేగద!"

"ఇన్ని ఘోరాలు జరుగుతుంటే మీ పార్టీ యేమి జేస్తున్నది బాపూ?"

"యేమి జేస్తం బేటీ?"

"వాళ్ల రాక్షసుల్లా సర్వనాశనం చేస్తుంటే- మీ పార్టీ శాంతి శాంతని శాంతి జపం జేస్తున్నది అంతేనా? మీ శాంతి ఎవరిక్కావాలె?"

"యేమిటమ్మా! యియ్యాల రాజకీయాలు మాట్లాడుతున్నవ్?"

"రాజకీయాలు కావు- జీవితసత్యాలు బాపూ! రోజూ జరిగే ఘోరాలు వింటుంటే- చదువుతుంటే మనసు చలించిపోతున్నది. ఆనాడు రవిని అపార్థం చేసుకున్నాను. కానీ, ఇప్పుడు అతను తీసుకున్న నిర్ణయం ఎంత గొప్పదో అర్థం చేసుకున్న. రవి చెల్లెల్ను కూడా పొట్టన బెట్టుకున్నారు రాక్షసులు. అలాంటి వాళ్ళెంతోమందిని చంపారు. ఎంతకాలమిట్ల? కమ్యూనిస్టులు పోరాటం చేస్తూ- ప్రాణాలిస్తున్నరు. మీ పార్టీకిదేం పట్టినట్లు లేదు. స్వరాజ్యమంటరు. రామరాజ్యమంటరు! అంతా బూడిదైన తర్వాత మీరు సాధించేదేమిటి?" ఆవేశంతో అన్నది శకుంతల.

కూతురు ఆవేదన అర్థం చేసుకున్నాడు. ఆమె చెప్పేదాంట్లో యదార్థమున్నదన్న భావం అతని ముఖంలో కనబడింది. ఆమె తల నిమురుతూ అన్నాడు...

"అమ్మా శకుంతలా! వాళ్లు రాక్షసుల్లా ప్రవర్తిస్తున్నారని మనం అట్లాగే చేస్తే రక్తపాతం తప్ప యేమిటి? వాళ్ళ చేతుల్లో అధికారమున్నది. పోలీసులు, మిలిట్రీ ఇప్పుడు రజాకార్లు కూడా వచ్చేరు..."

"అందుకే బాపూ! యిన్ని అనర్థాలకు, అరాచకాలకు, దుర్మార్గాలకు కారణమైన నిజాం ప్రభుత్వాన్ని పడగొట్టాలి. అది మీ అహింసా సిద్ధాంతంతో సాధ్యం కాదు. విప్లవం ద్వారా, సాయుధ పోరాటం ద్వారానే సాధ్యమవుతుంది"

"యేమిటమ్మా! నీవూ రవి వాదనేనా..."

"అవును బాపూ. అప్పుడు రాజకీయాలు నాకంతగా తెలియవు. అందుకే రవిని అర్థం చేసుకోలేకపోయాను. అతని మనసు గాయపరిచాను. నేనెంత పొరపాటు చేశానో యిప్పుడు అర్థమయ్యింది..."

"బేటీ- యియన్నీ ఆలోచించి మనసు పాడు చేసుకోకు. ఏమి జరుగుతుందో? ఎలా జరుగుతుందో? అంతా ఆ భగవంతుడికే తెలుసు. రవితో నీ పెళ్లి జరిగి సుఖంగా కాపురం చేస్తుంటే చూడాలనుకున్న. కానీ... ఇలా జరిగింది. అమ్మా... నువ్వు కంటతడి బెడితే చూడలేనమ్మా! నీకంటే నాకెవ్వరున్నరు? నేను బతుకుతున్నది నీ కోసమే. వద్దమ్మా... నీ మనసు

పాడు చేసుకోకు తల్లీ" అని కూతురును ఓదార్చాడు గోపాలరెడ్డి.

చీకటి పడింది- చీకటితోపాటు నల్లని గుట్టలు, దట్టమైన అడవిలో దారీ, డొంకా లేని మార్గంలో దళం పోతున్నది. కొంతసేపటికి కుక్కలు మొరగటం విని వూరు దగ్గరికొచ్చామని తెలుసుకున్నారు.

ఊరుబయట బిచ్చగాండ్లు గుడిసెలేసుకున్నారు. గుడిసెలముందు గంజి కాచుకుంటున్నారు. ఆ మంట వెలుతురులోనే పనులు చేసుకుంటున్నారు. వాళ్ళ పక్కనున్న కుక్కలు అలికిడివినో, ఆకలితోనో అదే పనిగా అరుస్తున్నాయి.

దళం వూరిలోకి ప్రవేశించింది.

ఊరుమధ్య బంగ్లాముందు పెట్రోమాక్సు లైటు వెలుగుతున్నది. స్త్రీలు బతకమ్మ పండుగ జేసుకుంటున్నారు. తంగెడిపూలు, బంతిపూలు, గునుగుపూలు, జల్లెడిపూలు, రకరకాల పూలతో బతకమ్మలు పేర్చి ఒక్కొక్కరే తెస్తున్నారు. బతకమ్మల్ని మధ్యలో పెట్టి, వాళ్ళంతా వాటి చుట్టూ తిరుగుతూ చప్పట్లు కొడుతూ, అడుగులు కలుపుతూ బతకమ్మ పాట పాడుతున్నారు. వారిలో కొందరు పట్టుచీరెలు కట్టుకున్నారు. మరి కొందరు నేసిన చీరెలు కట్టుకున్నారు. కొందరి మెడల్లో బంగారుగొలుసులు, హారాలు, నడుముకు బంగారు వడ్డాణాలున్నాయ్. ఇంకొందరికి మెడలో నల్లబూసల గొలుసు- కాళ్లకు వెండికడియాలు మాత్రమే వున్నాయ్.

పెద్దవాళ్లు తలకొప్పు లేసుకున్నారు. యువతులు జడలేసుకున్నారు. అందరూ సిగల్లో పువ్వులు పెట్టుకున్నారు. వారు కట్టుకున్న రంగురంగుల చీరెలు, పెట్టుకున్న ఆభరణాలు లైటు వెలుతుర్లో తళతళ మెరుస్తున్నాయి.



వాళ్ళకు దూరంగా కూలీ నాలీ, అంటరాని స్త్రీలు, పిల్లలు నిలుచున్నారు. రెండు-మూడు గుంపులుగా యువకులు చేరి గుసగుసలు పెడుతున్నారు.

"జై" అన్న శబ్దం విని అందరూ వులిక్కి పడ్డట్లు అయ్యారు. స్త్రీలు-బతకమ్మ ఆట ఆపేసి పక్కకు జరిగారు. జైకొడుతూ, పాట పాడుతూ దళమక్కడికి చేరింది.

స్త్రీలు ఆడుకుంటున్న బతకమ్మ ఆటకు అంతరాయం కలిగిందని, దళంలోని మహిళాసభ్యులు గమనించారు. నినాదాలు ఆపి వాళ్ళ దగ్గరికెళ్ళి పలకరించి ఆట ఆడమన్నారు. స్త్రీలు భయంతో కొందరు, సిగ్గుతో కొందరు సందేహిస్తున్నారు. మహిళా దళసభ్యులు లచ్చుమమ్మ, చంద్రమ్మ వాళ్ళను వొప్పించి వాళ్ళతోపాటు బతకమ్మ ఆటలో చేరారు. చేతులు, కాళ్లు కదులుతున్నయ్ గానీ పాట రావడంలేదు. వారిలో ఎవ్వరూ పాట చెప్పడానికి సిద్ధం కాలేదు. చివరికి ఒక మధ్యవయస్సావిడ మొదలుపెట్టి మధ్యలోనే ఆపేసింది.

"నేను పాడనా? " అడిగింది లచ్చుమమ్మ.

అందరూ సంతోషంగా సరేనన్నారు.

"నాకు భక్తిపాటలు రావు పార్టీ పాట చెప్పనా? " అడిగింది లచ్చుమమ్మ.

అట్లాగే చెప్పమన్నారు.

లచ్చుమమ్మ కొంగు బొడ్లో దోపుకున్నది. శృతి పట్టి పాట అందుకున్నది.

భారతీ భారతీ ఉయ్యాలో మా తల్లి
భారతీ- ఉయ్యాల
మమ్ముగన్నా తల్లి- ఉయ్యాలో
మా తల్లి భారతి ఉయ్యాల
ఉయ్యాల ఉయ్యాల ఉయ్యాలో-
ఉయ్యాల పాడుదా మియ్యాలా ॥ఉ॥
నైజాము రాజ్యాన- ఉయ్యాలో
నల్లగొండా జిల్ల ఉయ్యాల
జనగామ తాలూక ఉయ్యాల
జరిగేటి కథ వినుడి ఉయ్యాల
దొరలు జమీందార్లు ఉయ్యాల
పటేల్ పట్వార్లు ఉయ్యాల

రాక్షసుల మించింద్రు ఉయ్యాల! ఎన్నో
ఘోరాలు చేస్తుంద్రు ఉయ్యాల ఉయ్యాల
యెట్టి బతుకులతోటి ఉయ్యాల! జనం
చితికిపోతున్నారు ఉయ్యాల
దోపిడీ దొంగలూ ఉయ్యాల ప్రజలు
దోచుకుంటున్నారు ఉయ్యాల
పానాలు దీసినా ఉయ్యాల
స్త్రీల మానాలు దోసినా ఉయ్యాల
అయ్యనీ బాంచనని ఉయ్యాల వాళ్లు
అలమటించగ జూసి ఉయ్యాల ఉయ్యాల
సంగంబు బుట్టింది ఉయ్యాల! ప్రజల
అండగా నిలిచింది ఉయ్యాల
దోపిడోల్లను తరుమ ఉయ్యాల
దండుగా కదిలింది ఉయ్యాల
అక్కలూ చెల్లెళ్ళు ఉయ్యాల మన
అన్నలూ దమ్ములూ ఉయ్యాల
కలిసికట్టుగ జనం ఉయ్యాల నేడు
కదులుతున్నారమ్మ ఉయ్యాల ఉయ్యాల
వూరూరు కదులుతూ ఉయ్యాల
ఉద్యమంగా లేచి ఉయ్యాల
తెలంగాణ మంతటా ఉయ్యాల పెద్ద
వెలుగొచ్చి నాదమ్మ ఉయ్యాల
నైజాం పాలనను ఉయ్యాల
నాశనం గావింప ఉయ్యాల
ప్రజల రాజ్యంకొరకు ఉయ్యాల ఈనాడు
పోరు జేస్తున్నారు ఉయ్యాల ఉయ్యాల
కట్టండి నడుములు ఉయ్యాల మీరు
పట్టండి కొడవళ్లు ఉయ్యాల
ఎత్తండి సుత్తెలు ఉయ్యాల
కొట్టండి ఒక్కపై ఉయ్యాల
రజాకారు గుండాల ఉయ్యాల మనం
తరిమి కొట్టాలమ్మ ఉయ్యాల
తెగువజూపి మనం- ఉయ్యాలో- ఆ
పోరు గెలవాలమ్మ- ఉయ్యాల
ఉయ్యాల ఉయ్యాల ఉయ్యాలో-
ఉయ్యాల పాడుదా మియ్యాల

ఉత్సాహం, ఉద్రేకంతోపాట ఊపందుకున్నది. సిగ్గూ, సందేహం వీడి అందరూ హుషారుగా అడుగులేస్తూ పాట పాడుతున్నారు.

దళసభ్యులు తమ ఆయుధాలను బతకమ్మల్లాగా మధ్యలో పెట్టి చుట్టూ తిరుగుతూ చుట్టు కాముడునేస్తూ స్త్రీలతోపాటు గొంతులు కలిపారు. పాట ఆటతో అక్కడున్న వాళ్ళ మనసులు కూడా వేడెక్కినయ్. పాట వింటూ పక్కను కూర్చున్న వృద్ధుల కళ్ళల్లో నీళ్లు తిరిగినయ్.

పాట ముగించి- లచ్చుమమ్మ అందరినీ జై కొట్టమన్నది.

ఆంధ్ర మహాసభకు జై... కమ్యూనిస్టు పార్టీకి జై- వూరంతా ప్రతిధ్వనించింది. పక్కనున్న ఎత్తయిన అరుగుమీద నిలబడ్డాడు దళనాయకుడు రవి.

"మీరు ఆనందంతో పండుగ జేసుకుంటున్నారు. మధ్యలో మీకు అంతరాయం కలిగించినందుకు క్షమించండి" అన్నాడు.

తర్వాత నైజాం పాలనలో, జరుగుతున్న ఘోరాలను వివరిస్తూ, వాటిని ఎదుర్కోవడానికి చేస్తున్న పోరాటం గురించి వివరించాడు.

"వెట్టిచాకిరి, దోపిడి, దౌర్జన్యాలు అంతం కావాలి. మనుషులుగా బతకడానికి- ప్రజా రాజ్యం స్థాపించడానికి మన పోరాటం సాగుతున్నది. వందల గ్రామాల్లో ప్రజలు దొరలు, దేశముఖులు, పటేల్ పట్వారీలను తరిమికొట్టి గ్రామ రాజ్యాలేర్పరచుకున్నారు. రజాకార్ల గుంపులను, పోలీసు బలగాలను తరిమికొడుతున్నారు. అక్కలు, చెల్లెళ్లు, అన్నలు-తమ్ములు- అందరూ సంగానికి అండగా నిలిచి పోరాటంలో పాలుపంచుకోవాలి" అన్నాడు.

జైజై నినాదాలతో సభ ముగిసింది. దళసభ్యులను ఇంటికొకరు భోజనానికి తీసుకెళుతున్నారు. ఒక యువకుడు రవిని తన ఇంటికి ఆహ్వానించాడు. అతనితోపాటు రవి ఆ ఇల్లు చేరాడు. ఊరు చివర బంగ్ల ఇంట్లో పెట్రోమాక్సు వెలుగుతున్నది. యువకుడు

బల్లెపీట చూపి రవిని కూర్చోమన్నాడు.

మధ్యవయస్సు స్త్రీ ఆప్యాయంగా రవిని పలకరించి, చెంబుతో నీళ్ల అందించింది. రవి చేతులు మాత్రమే కడుక్కుంటుండగా ఆమె...

"బూట్లు విప్పి కాళ్ల చేతులు కడుక్కో నాయనా- తొందరెందుకు? " అన్నది. రవి ఆమె మాట కాదనలేక బూట్లువిప్పి బల్లెపీట దగ్గరపెట్టి, కాళ్ల చేతులు కడుక్కున్నాడు. యువకుడు టవల్ తెచ్చి ఇచ్చాడు.

"రా నాయన! లోపలికిరా! అన్నం వడ్డించాను" అన్నది.

పీటమీద కూర్చున్న రవికి అన్నంలో నెయ్యి వడ్డిస్తూ అడిగింది...

"యేవూరు నాయనా మీది? "

రవి చిరునవ్వు నవ్వి... "ఏ వూరైతే ఏమమ్మా! అన్ని వూర్లు మావే"

"సూడబోతే పెద్దింటి బిడ్డలా వున్నవ్! కాపోల్లేనా? "

"ఆ కులాల పట్టింపు మాకు లేదమ్మ"

"మాట వర్సకడిగిన. కులాందేముంది నాయన. గునం పదానం"



రవి అన్నంముద్ద నోట్లో పెట్టుకోబోతుం డగా ఏదో అలికిడి వినిపించింది. అతను చేతిలో ముద్దతో తిరిగి చూస్తుండగా,

"ఏంలేదు నాయనా! దసరా పండగగద పిల్లలు టపాకులు కాలుస్తున్నారు" అన్నది. మళ్లీ తుపాకి శబ్దం- బూట్ల చప్పుడు విని రవి దిగ్గున లేచాడు. ఆమె గబాలున లోప లికిపోయి తలుపేసుకున్నది.

బూట్ల చప్పుడు ఎక్కువయ్యింది. రవి తుపాకి అందుకుని తలుపు దగ్గరికెళ్ళి చూశాడు. బయటినుండి గొళ్లెం పెట్టినట్లు గమనించి, బిరబిర మెట్లమీదుగా బంగ్లా ఎక్కాడు. చీకట్లో భూతాల్లా ఇంటిని చుట్టే సిన పోలీస్ బలగాన్ని చూశాడు. గోడచా టున మాటుపెట్టుకున్నాడు. వీధి తలుపు తీసుకొని పోలీసులు లోపలికొచ్చారు. ఇంటి యువకుడు దారిచూపుతూ మెట్లమీదుగా పైకిరావడం రవి గమనించి- తుపాకి ఎక్కు పెట్టాడు. మొదటి దెబ్బకే యువకుడు నేల కూలాడు. అతనితోపాటు ఒక పోలీసు భయంతో కిందికి దూకాడు. రెండువైపుల కాల్పులు సాగినాయ్.

రవివద్ద తూటాలైపోయినయ్. శత్రువుల తూటాలు దూసుకొస్తున్నాయ్. గబాలున బంగ్లామీదినుండి కిందికి దూకాడు. నాలు గువైపులనుండి కమ్ముకొచ్చిన పోలీసులు రవిని పట్టేసేరు. రెక్కలు వెనక్కి విరిచికట్టి, తన్నుతూ, గుద్దుతూ వ్యాన్‌లో ఎక్కించారు. సడక్ పక్కనున్న చిన్న బంగ్లా మిలటరీ క్యాంపుగా మారింది. చుట్టూ గోడలు, మధ్యలో చెట్లున్నాయ్. పెద్ద ఖాళీ స్థలంలో మిలటరీ లారీలు, గుర్రాలు- పట్టుకొచ్చిన జనంతో నిండివుంది. ఉక్కుటోపీల మిలట రీవాళ్లు పట్టుకొచ్చిన వాళ్ళను హింసలు పెడుతున్నారు. కొందరిని చెట్లకు కట్టేశారు. కొందరిని వొంగబెట్టి బండలెత్తారు. మరి కొందరి అంగీలు వూడదీయించి రేగికంప లోపడేసి బూటు కాళ్లతో తొక్కుతున్నారు. బాధలు భరించలేక వాళ్ల అరుపులు, కేకలు పెడుతూ, గిలగిల కొట్టుకుంటున్నారు. గుంపులు గుంపులుగా ప్రజలను తీసుకొ స్తూనే వున్నారు.

రవిని బంగ్లాలోపలి గదిలో దూలానికి వేలాడదీశారు. అతని శరీరమంతా గాయా లతో రక్తం చిందుతున్నది. హంటరు బట్టు కున్న మిలటరీ ఆఫీసరు కళ్ళెర్రజేసి-

"బోలో సాలే! నీ పేరేంది బే"

"రవి"

"సంగంలో లీడర్‌వా? "

"అవును"

"ఎంతమందిని ఖూనీ జేసినవ్? "

"నిర్దోషులెవ్వర్నీ చంపలేదు"

"అగ్గో! గట్లయితే ఇంకోల్ని సంపినవ్? "

"పోరాటంలో శత్రువును"

"ఓడుబే శత్రువ్! సాలే! సహీc సహీc బోల్‌సాలే! ఎంతమంద్ని సంపినవ్? "

"చనిపోయిన శత్రు శవాలను లెక్కబె ట్టలేదు"

"గిప్పుడు లెక్కబెట్టిస్త" మిలిటరీవాడు శక్తి నంతా చూపుతూ హంటర్‌దెబ్బలు కొడుతు న్నాడు. చర్రు చర్రుమని శరీరంపై బొబ్బలె క్కుతున్నా రవి ఓర్చుకుంటున్నాడు. అతని కళ్ళు ఆవేశంతో నిప్పులు గక్కుతున్నాయి. అలిసిపోయిన మిలటరీవాడు మళ్ళీ అడి గాడు.

"గుండాగర్దీ జేస్నివ్! దోపిడీలు జేసినవ్! పటేల్ పట్వార్ల ఖూనీజేసినవ్! గట్ల ఎన్ని జేసినవో మాకెర్కలేదనుకున్నవ్‌బే. ఇసా బంత మాకాడున్నది! బే..."

పటేల్ పాపిరెడ్డి చేతులు కట్టుకొని మిల టరీ ఆఫీసరుతో...

"సర్కార్! గట్ల శానజేసిండు. జమీన్లు గుంజుకొని పంచిపెట్టిండు. దస్త్రాలు తగల బెట్టిండు. జనాల్ని మాపైకి ఉసిగొల్పిండు సర్కార్" అన్నాడు.

"ఇన్నవా? గియన్నీ జేసినవ్... సజా ఏమైతదో ఎర్కనా? ఫాంసీకి సజా! బత్కా

లంటే సంగం గింగం చోడ్‌దో. సర్కార్‌కు సాయం జెయ్యి. సంగపోల్లేడుండరు- గాళ్ళ జాడసెప్పు. బత్కుతవ్. సర్కార్ యినాంబీ దొర్కుతది? "

"డబ్బుకు గడ్డితినేవాణ్ణి కాదు. ప్రాణానికి భయపడి ఆశయాన్ని అమ్ముకునేవాణ్ణి కాదు. అదిగో- కక్కిన కూటికి ఆశపడే ఆ కుక్కకేయండి- నాలుగు బొక్కలు" పాపిరెడ్డి వైపు చూస్తూ ఆవేశంగా అన్నాడు రవి.

"సూసిన్రా సర్కార్! మీ ముందల్నే గిట్లం టన్నడు. ఇంకా వీడి పొగరనగలేదు. వీడు బతికుంటే మా పాణాలు దీస్తడు సర్కార్!" పాపిరెడ్డి మొరబెట్టుకున్నాడు.

"అరే బద్మాష్. హడ్డీహడ్డీ తోడ్కే ఖైమా కరోంగ! బోలో సాలే" మిలటరి వాడు రాక్ష సత్వం జూపాడు.

సిగరెట్లతో వొళ్ళంతా కాల్చాడు. గోళ్ళల్లో గుండుసూదులు గుచ్చాడు. తల కిందుగా వేలాడదీసి మంటబెట్టాడు. ఎన్నోరకాల హింసలు బెట్టాడు.

ఎన్ని జేసినా రవి నోరు విప్పలేదు. బాధను భరిస్తూ చివరికి స్పృహ తప్పాడు.



రవి పట్టుబడ్డాడన్న వార్త విని శకుంతల కలవరపడింది. అతనికే హాని జరుగుతుం దోనని ఖంగారుపడుతున్నది. కన్నీరు పెడు తున్నది. అన్నం నీళ్లూ మానేసి ఆలోచి స్తుంది. కూతురును చూసి తండ్రి గోపాల్ రెడ్డి ఆందోళనపడుతున్నాడు.

"ధైర్యంగా వుండమ్మా! నేను చేయగల్గిన దంతా చేస్తున్నా! ఆ పైన భగవంతుడు న్నాడు" అంటూ ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించాడు.

"నాకెందుకో భయంగా వుంది బాపూ! రవి ప్రాణానికి ప్రమాదం జరగదు కదా? " అడిగింది శకుంతల.

"మామూలు కోర్టులోనైతే ఏదైనా చేయగ ల్గేవాణ్ణి. మిలిటరీ కోర్టులో విచారణ జరుపు తున్నారు. వకీళ్ళను యితరులను అనుమతి స్తలేరు. రేపో- మాపో జైలుకు తీసుకొస్తరని తెలిసింది. జైలుకు తీసుకొస్తేగని ఏ విషయం తెలియదు. నువ్వు పరేషాన్ కావద్దు బేటీ!"

"ఎలాగైనా ఒక్కసారి రవిని చూసే అవ కాశం చూడండి బాపూ!"

"అలాగేనమ్మా! నాకు మాత్రం తెలియదా అమ్మ? నువ్వు కంట తడిబెట్టొద్దు. నేను చూడలేనమ్మా!"

"రవి ప్రాణానికి ప్రమాదం జరిగితే నేను భరించలేను బాపూ!"

"ఆ సంగతి నాకు తెలియదా అమ్మ? అయినా! ధైర్యంగుండాలమ్మా! లే! లేమ్మా! లేచి అన్నం తిను!"

ఆమె చేయిబట్టి లేవదీశాడు గోపాలరెడ్డి.

★ ★ ★

మిలటరీ కోర్టులో ముద్దాయిగా బోనులో నిలబెట్టారు రవిని. హాలునిండా మిలటరీ అధికారులు, ప్రభుత్వం తరపు సాక్షులు ఉన్నారు.

జడ్జి స్థానంలో కూర్చున్న మిలటరీ అధి కారి రవివంక జూసి అడిగాడు...

"ఇన్ని ఖూనీలు ఎందుకుజేసేవ్? గిన్ని దోపిడీ లెందుక్కజేస్నవ్? "రవి హాలులో వున్న వాళ్ళందరినీ పరిశీలనగా చూశాడు. విచారణ ఎట్లుంటుందో ఎదురుగా కనిపించే పాపిరెడ్డి, యితర సాక్షులనుబట్టి అర్థంచేసు కున్నాడు.

"నేను ఖూనీలు దోపిడీలు చేయలేదు"

"మరెవరు జేసేరు? " జడ్జి ప్రశ్న.

"మీ సర్కార్! ఆ రజాకార్లు, జమీందార్లు-జాగీర్దార్లు- పటేల్, పట్వార్లు, దొరలు, వాళ్ళంతా ప్రజల ప్రాణాలు దీసింద్రు. మానాలు దీసింద్రు! యింకా రాక్షసులకంటే ఘోరంగా ప్రవర్తిస్తూనే వున్నారు" ఆగ్రహంతో అన్నాడు రవి.

"సర్కార్‌పై సవాల్ చేస్తున్నవా? "

"అవును. మా పోరాటం సర్కారుమీదననే"

"దానికి సజా యేమైతదో తెలుసా? "

దూరంగా నిలబడివున్న పాపిరెడ్డి...

"మామూలు సజాయేస్తే మల్ల మా పాణాలు దీస్తడు సర్కార్!" ఆదుర్దాగా అన్నాడు.

"అచ్చా! యేమిరా జులుం చేస్తవా? "

"జులుం మాది కాదు. మీ సర్కారు చేస్తున్నది"

"సూసింద్రా సర్కార్" పాపిరెడ్డి వినయంగా సలాంజేస్తూ జడ్జితో అన్నాడు. జడ్జి కోపంగా చూశాడు. పోలీసు అధికారివైపు చూస్తూ...

"యేం జేసింద్రు? సూస్తుంద్రా ఎట్ల మాట్లాడుతున్నాడో ముజ్రిమ్! మంచిగ సూస్కోలేదా? సేస్తే గిట్లెందుకు సేస్తడు? "

మండిపడ్డాడు.

అమీన్‌సాబ్ దిగ్గున లేచి రవి దగ్గరికెళ్ళాడు. రవి జుట్టుపట్టి గుంజుతూ "అబ్బే సాలే! మంచిగ సెప్తె సమజయితలేదు బే... నఖ్రాల్ సేస్తున్నవ్? అదాలతనుకున్నవా? నీయమ్మ! నీ ఇల్లనుకున్నవా? యేందిబే. సాబ్ అడిగిందాన్కి సరిగ్గ సెప్పు! లేకుంటే చమ్డాలు దీస్త బాంచోత్"

రవి కన్నెర్రజేసి వుద్రేకంతో వూగిపోయాడు.

"సాలే! సంబాల్కే బాత్‌కరో!" అన్నాడు.

జడ్జి అతని ధైర్యానికి ఆశ్చర్యపోయి "బేష్... ఖలేజా వుందిర నీకు" అన్నాడు.

"ఖలేజాలేని కల్తీ నాకొడుకులు వీళ్ళు-మేము విప్లవకారులం" అన్నాడు రవి ఎదురుగా వున్న వాళ్ళవైపు చూస్తూ.

"అబ్ బస్‌కరో బక్వాస్. ఇప్పుడు మేమేం చేస్తామో తెలుసా? " జడ్జి అన్నాడు.

"యేమిజేసినా ఫరవాలేదు"

"నువు సస్తవ్ మేం సూస్తం" వ్యంగ్యంగా అన్నాడు మరో అధికారి.

"నేనొక్కణ్ణి పోతే మా పోరాటం ఆగదు. నాలాంటివాళ్ళు వేలమంది పుడతారు"

రవి సమాధానం విన్న జడ్జి మండిపడుతూ ఇంగ్లీషులో అరిచాడు.

"ఈ నాన్సెన్స్ ఆపండి. తీర్పు చెప్పబోతున్నాను"

"అదెలా ఉంటుందో నాకు తెల్సు. ముందు నా మాట వినండి" రవి వుద్రేకంగా అన్నాడు. జడ్జి ఖంగుతిన్నాడు. హాల్లోనివాళ్లంతా నిశ్చేష్టులయ్యారు.

"మీ పాలన యింకెంతో కాలముండదు. మీ రోజులు దగ్గరపడుతున్నాయ్. దొరలు, దేశముఖులు, జమీందార్లు, జాగీర్దార్లు, పటేల్లు, పట్వార్లూ యింతకాలం దోపిడీ, దౌర్జన్యాలు చేస్తూ, ప్రజల రక్తం పీల్చేటోళ్ళు పల్లెలొదిలి పట్నాలకు పారిపోతున్నారు. పోలీసు, రజాకార్ల క్యాంపుల దగ్గర కుక్కల్లా పడుంటున్నారు. మీ మిలటరీ పోలీసు బలగాలు వూర్లకెళ్ళాలంటే వణుకుతున్నారు. రజాకార్లను ప్రజలు తరిమికొడుతున్నారు. రజాకార్ల రాక్షసత్వం, మీ నిరంకుశత్వం యిక చెల్లదు. తొందరలోనే నిజాం గద్దె కూలుతుంది. అదెంతో దూరం లేదు. అప్పుడు మీకూ, మీ చట్టాలకు ప్రజలు సమాధికడతారు. ప్రజారాజ్యమొస్తుంది. నా ఉద్యమం జయిస్తుంది. నా ఆశయం నెరవేరుతుంది. అందువల్ల నాకు చావులేదు. ప్రజల మనస్సుల్లో నేనున్నా లేకున్నా జీవించే వుంటాను. నాకు చావంటే భయం లేదు. కానీ మీరు కుక్కచావు చస్తారు. చరి

త్రహీనులైపోతారు. కాలగర్భంలో కలిసిపోతారు. ఇదే నా తీర్పు! మా విప్లవకారుల తీర్పు, ప్రజల తీర్పు" అని ప్రకటించాడు. వాళ్ల గుండెలదిరేటట్లు సింహగర్జనలా వినిపించింది రవి కంఠం.

తేరుకున్న జడ్జి,

"ముజ్రింకూ మవుత్‌కీ సజా దీ జాతి హై" అని ప్రకటించి దిగ్గున లేచి వెళ్లాడా జడ్జి.

రవి గొంతెత్తి బిగ్గరగా.

"విప్లవం వర్ధిల్లాలి"

"నిజాం నిరంకుశత్వం నశించాలి"

"కమ్యూనిష్టు పార్టీకి జై"

అంటూ నినాదాలు చేస్తున్నాడు. పోలీసులు అతన్ని యీడ్చుకొని పోతున్నారు. అతని గొంతు వినిపిస్తూనే వున్నది.

★ ★ ★

ఊరూరా జనం కదులుతున్నారు. జేజేలు కొడుతూ జెండా ఎగరేస్తున్నారు. యువతీ యువకులు దళాల్లో చేరిపోతున్నారు. కర్రలు, గుత్పలు పట్టుకుంటున్నారు. బాలబాలికలు బాలసంఘాలతో కదులుతున్నారు. దళ సభ్యులు గెరిల్లా శిక్షణ పొందుతున్నారు. అందులో చంద్రమ్మ, లచ్చుమమ్మమరి కొందరు మహిళలున్నారు. ఒక్కొక్క వూరు విముక్తి జరిగిపోతున్నది. విప్లవగీతాలు వీరుల త్యాగాలు వినబడుతున్నాయ్. పని పాటలవద్ద నాట్లేసే స్త్రీలు కూడా అవే పాటలు పాడుతున్నారు.

బందూకులు బట్టి గెరిల్లాయోధులు కదం తొక్కుతున్నారు.

★ ★ ★

రవిని చూడబోతున్నానన్న సంతోషంతో శకుంతల జైలులోపలికి అడుగుపెట్టింది. పోలీసు వెనకాలే రవి వున్న గది దగ్గరికి పోతున్నది. అతని గుండెలమీద వాలిపోవాలని, మనసులోని బాధను, భావాలను చెప్పాలనుకుంటున్నది. దూరం నుండి శకుంతల రాకను గమనించిన రవి ఆనందంతో వుప్పొంగిపోతున్నాడు. ఊహించని కోరిక నెరవేరుతున్నందుకు సంతృప్తి నొందుతున్నాడు.

జైలు సెల్ దగ్గరకొచ్చిన శకుంతల రవిని చూసి నిర్ఘాంతపోయింది. కాళ్ళకు, చేతులకు సంకెళ్ళతో బోనులో బంధించిన పులిలాగున్నాడు. ఇద్దరి మధ్య ఇనుపచువ్వలు అడ్డం ఉన్నయ్. శకుంతల నోటమాట రాలేదు. దుఃఖం ముంచుకొచ్చి ఒక్కసారి బావురుమన్నది. రవి, కటకటాలమధ్య నుండి చేతులు చాచి ఆమె చేతులు పట్టుకొని కళ్లల్లోకి చూస్తూ ఆప్యాయంగా పలకరిస్తూ,

"వద్దు శశీ! యేడ్వటానికేనా నువ్వొచ్చింది. నిన్ను మళ్ళీ చూస్తాననుకోలేదు. నాకెంతో ఆనందంగా వుంది. ఎందుకా కన్నీరు? వద్దు శశీ!" అంటూ ఆమె కంట తడి తుడిచాడు.

శకుంతల దీనంగా అతని కళ్ళల్లోకి చూస్తూ అలాగే నిలుచున్నది.

"చెప్పు శశీ! యెలావున్నావు? యేంజేస్తున్నావు? " రవి అడిగాడు. దుఃఖాన్ని దిగమింగుతూ గద్గత స్వరంతో ఆమె అంది.

"నాకేమయ్యింది? బాగానే వున్నా! కానీ నీవు" నోటమాట పెగల్లేదు.

"నాకు మాత్రమేమయ్యింది శశీ!... అప్పుడే చెప్పానుగదా! ప్రాణానికి తెగించే పోరాటంలోకి దిగుతున్నానని. విప్లవకారుడిగా నా కర్తవ్యం నెరవేర్చాను. మరణమంటావా? జీవితం శాశ్వతం కాదుగదా? ఎప్పుడైనా చావాల్సిందే. ప్రమాదంలోనో, అనారోగ్యంతోనో చచ్చేకన్నా వీరుడిగా చావడం మేలు కదా? దేశంకోసం, ఆశయంకోసం ప్రాణమిచ్చే అవకాశం అందరికీ దొరుకుతుందా? ఉరిశిక్ష పడిందన్న విచారంలేదు. చనిపోతానన్న భయంలేదు. పైగా గర్వపడుతున్నా, నువ్వు కూడా అలాగే భావించు శశీ!"

"ఇలా జర్గుతుందనుకోలేదు. నిన్నిలా

చూస్తాననుకోలేదు. ఎప్పటికైనా తిరిగొస్తావన్న ఆశతో ఎదురుచూస్తుండగా..." మాట రాక భోరున విలపిస్తున్నది.

"వద్దు శశీ! పసిపిల్లలా ఏమిటిది? ఎక్కువ సమయంలేదు. వున్న కాస్త సమయం నువ్వు ఏడుపుతోనే గడిపితే యిక మాట్లాడటానికేమీ మిగలదు" రవి శాంతింపచేయడం చూస్తూన్న పోలీసు జవాన్.

"జల్దీ... తొందరగా మాట్లాడండి" అన్నాడు.

శకుంతల దుఃఖాన్ని దిగమింగుతూ- కన్నీరు తుడుచుకున్నది.

రవి మనస్సు తేలికైనది. అతనే... ఆమె చేతులు నిమురుతూ.

"మరిచిపోయాను శశీ! కంగ్రాచ్యులేషన్స్ నువ్వు ఫస్టుక్లాసులో పాసయ్యావటగా?" అన్నాడు.

"ఇప్పుడా విషయమెందుకు రవీ? నన్నేదో మరిపించాలని పిచ్చిదాన్ని చేయడానికి కాకపోతే..."

"కాదు శశీ! నీ చదువు సద్వినియోగం కావాలని నీవు నలుగురికీ సహాయపడాలని నా కోరిక!"

"నాకే కోరికా మిగల్లేదు. నేను కోరుకున్నది నిన్నే. నువ్వే లేనప్పుడు..." యేదో అనబోయింది.

"లేదు శశీ! వైరాగ్యం వద్దు. నేను చెప్పింది విను. నా మాట కాదనవు కదూ?" ఆమె చేతులు గట్టిగా కదుపుతూ అడిగాడు.

"చెప్పు రవీ! నన్నేం చేయమంటావ్?"

"నా జీవితంలో ఆఖరికోరిక ఆచరిస్తావా?"

"నీకోసం ఏమైనా చేస్తాను. చెప్పు రవీ! సందేహం దేనికి?"

"నువ్వు పెళ్ళిచేసుకోవాలె. అన్నీ మరిచిపోయి సుఖంగా జీవించాలె. ఇదే నా కోరిక?"

అంత విషాదంలో కూడా నవ్వునాపుకోలేకపోయింది. ఫక్కున నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు? నేనన్నదాంట్లో తప్పేమన్నావుందా?"

"మన బంధం తీరిందంటవ్? నిన్ను మరిచిపోయి మరొకన్ని కట్టుకొని కాపురం చెయ్యమంటవ్? అది నాకు సుఖం కలిగిస్తుందని అనుకుంటున్నవ్? అంతేనా రవీ?"

కాస్త కటువుగా అన్నది.

"అవును శశీ! నామీద ఏమాత్రం ప్రేమ- గౌరవంవున్నా నా మాట కాదనకు" ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

కొద్దిగజాల దూరంలో నిలబడిన జమేదార్ చేతి కర్రతో నేలమీద చప్పుడు చేస్తూ,

"ఛలో... ఛలో... వఖ్త్ హోగయా?" అన్నాడు.

శకుంతల అతనివైపు జాలిగా చూస్తూ,

"భాయిసాబ్... ఇదే మా ఆఖరి కలయిక. కొంచెంసేపు మాట్లాడుకోనివ్వండి" అన్నది. జమేదార్ మాట్లాడకుండా పక్కకు జరిగి బీడి వెలిగించుకున్నాడు.

'శశీ! రేపోమాపో హైదరాబాద్ సెంట్రల్ జైలుకు తీసుకెళ్ళి ఉరిశిక్ష అమలుజరుపుతారట. నేను బతికుండేది యింకా కొద్దిరోజులే. యీ నాలుగు రోజులైనా నాకు మనశ్శాంతి వుండేట్లు చేయవా? నేను చెప్పినట్లు చేస్తానని మాటియ్యవా?"

అతని కళ్ళు చెమ్మగిల్లినయ్- ఆత్మీయత, ఆదుర్దా మాటల్లో కనబడింది. అది శకుంతల భరించలేకపోయింది. అతని చేతులు ముద్దాడుతూ- కళ్ళల్లో కళ్ళుబెట్టి అన్నది.

"నేను ఆనందంగా వుండటమే కదా నీవు కోరుకునేది? అయితే నా కోరిక తీరుస్తావా రవీ?"

"తప్పకుండా శశీ! కానీ... యీ స్థితిలో నేనేం చేయగలను? చేసిన వాగ్దానం ఎలా నిలబెట్టుకోగలను?"

తన నిస్సహాయతను వ్యక్తం చేశాడు.

"నీవు చేయలేనిది? సాధ్యంకానిది నేనెలా

అడుగుతాను రవీ? "

"అయితే చెప్పు. అంతకు మించిన ఆనందమేముంటుంది? తప్పక చేస్తాను" ఆమె చేతులు గట్టిగా పట్టుకొని వాగ్దానం చేశాడు.

శకుంతల ముఖంలో సంతోషం తొంగిచూసింది. గుండెలవద్ద దాచుకున్న మంగళసూత్రం తీసి అతని చేతులో పెట్టింది.

"ఇది నా మెడలో కట్టండి" అన్నది.

రవి నిర్ఘాంతపోయాడు.

"ఈ మంగళ సూత్రం నా మెడలో కట్టి నన్ను నీదానిగా బతికే అవకాశం కల్పించు''

"యేమిటిది? పిల్లలాటనుకున్నవా? బొమ్మలాటనుకున్నవా? నాతో వేళాకోళమెందుకు శశీ!"

"బొమ్మలాట లాడడానికి నేను పసిపిల్లను కాను. వేళాకోళానికిది సమయం కాదు. వైరాగ్యం, నైరాశ్యం కాదు వేదాంతమంత కంటే కాదు. ఆనాడే నీతో చెప్పాను. పెళ్ళంటూ జరిగితే నీతోనేనని... యిప్పుడు నాకింకో స్వార్థం కూడా వుంది..."

"వద్దు శశీ! ఈ తాళిగట్టిన కొద్దిరోజులకే తెంచెయ్యాలె. ఇది నీ బతుకుకు గుదిబండవుతుంది. నా మాటవిని మొండితనం మానేయ్"

"అబ్ బస్‌కరో! చలో బేటీ... చలో" జమేదార్ సమయం గుర్తుజేశాడు.

"సమయం లేదు రవీ! నా మాట కాదనకు. కాదంటే ఏం చేయాలో నాకు తెలుసు. నీకంటే ముందుగానే నేను పోతాను"

"ఎందుకు నన్నింత వొత్తిడి చేస్తున్నావో? నువ్వెందుకింత మంకుపట్టు పడుతున్నావో అర్థంకావడంలేదు. ఎవరైనా వింటే నవ్వుతారు!"

"నువ్వెన్ని జెప్పినా నానిర్ణయం మారదు! ఏం చేస్తావో నీయిష్టం" నిర్ణయంగా చెప్పింది.

రవి కళ్ళుమూసుకొని అంతరాత్మను ప్రశ్నించినట్లు క్షణమాలోచించాడు.

"ఇంతవరకెక్కడా జరగని విచిత్ర సంఘటన. న్యాయమో? అన్యాయమో? దీని ఫలితమేమిటో? యేమైనాగానీ- నీకోసం నీమాట కాదనలేక యీ మంగళసూత్రం నీ మెడలో కడుతున్నాను. కానీ జీవితాంతం నీకిది గుదిబండ కారాదు. నాతోపాటే యిది మట్టిలో కలిసిపోవాలి! మన బంధం తెగిపోవాలి"

కటకటాల మధ్యనుండి శకుంతల మెడలో మంగళసూత్రం కట్టాడు.

జైలు గడియారం గంటలు కొట్టింది. జమేదార్ మహమూద్ కర్రతో నేలమీద కొడుతూ "అబ్ చలో బేటీ" అన్నాడు.

శకుంతల ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతూ ఆనంద భాష్పాలు రాల్చింది. అతని చేతులు ముద్దాడింది. చెక్కిళ్ళకద్దుకుంది.

"రవీ! ఇప్పుడు నేనెంత గర్వపడుతున్నానో తెలుసా! ఒక విప్లవవీరుడి భార్యను నీ ఆశయాల వారసురాలిని. నీ బాటసారిని అందుకే రవీ! ఆలోచించే యీ నిర్ణయానికొచ్చాను. ఈనాటినుండి నేను నీమార్గంలోనే నడుస్తాను. విప్లవానికి అంకితమవుతాను" వాగ్దానం చేసింది.

శకుంతల భావాలకు రవి ముగ్ధుడయ్యాడు. ఆమెలో కలిగిన చైతన్యానికి మురిసిపోయాడు.

"బహత్ వక్త్ హోగయా! చలో... ఛలో బేటీ" జమేదార్ కోపంగా అన్నాడు.

చివరిగా రవి- శకుంతల ఒకరినొకరు చూపుల్తోనే పలకరించుకున్నారు. ఒకరి రూపాన్ని ఒకరు కళ్ళనిండా నింపుకున్నారు. ఆత్మీయత, అనురాగం పంచుకున్నారు.

రవికి వీడ్కోలు చెపుతూ బయటికి నడుస్తోంది శకుంతల. ఆమె వెనకాలే జమేదార్ మహమూద్ నడుస్తున్నాడు. ఆమె ముందుకు నడుస్తున్నా మాటిమాటికి చూపులు వెనక్కి మళ్లుతున్నాయ్. రవి

చేతులు వూపుతూ వీడ్కోలు చెబుతున్నాడు.

జైలు గేటు దాటిన శకుంతల మెడలోని మంగళసూత్రం చూసుకున్నది. కళ్ళకద్దు కొని ముద్దుబెట్టుకున్నది.

★ ★ ★

రవిని కలిసినప్పటినుండి శకుంతలలో ఎంతో మార్పును గమనించాడు గోపాల రెడ్డి. ఇప్పుడామెలో విచారం, విషాదం లేదు. కంట తడి కనిపించడంలేదు. ఎంతో ఉత్సాహంగా వుంటున్నది. తండ్రితో రాజకీయాలు చర్చిస్తున్నది. లైబ్రరీనుండి రాజకీయ గ్రంథాలు తెప్పించుకొని చదువుతున్నది. మార్పుకు కారణమేమైనా మార్పు వచ్చినందుకూ, ఆమె సంతోషంగా వుంటున్నందుకూ అతను సంతోషిస్తున్నాడు.

ఒకరోజు పెండ్లి ప్రస్తావన తెచ్చాడు.

"చాలాకాలంగా నాకు తెలిసినవాళ్లు-మంచి సంబంధం. మంచి రోజు చూసుకొని వస్తామన్నారు. అన్నీ కుదిరితే యీ ముహూర్తాల్లోనే పెండ్లి జరగాలంటున్నారు''

"ఎవరికి బాపూ పెండ్లి? " ఆశ్చర్యంగా అడిగింది శకుంతల.

"ఎవరికేమిటమ్మా! నీకే! యెవరి పెండ్లి గురించో నేనెందుకంటాను? "

"నా పెండ్లి ఎప్పుడో జరిగిపోయింది బాపూ"

"యేమిటి బేటీ నువ్వనేది? "

"బాపూ! ఇదిగో... మంగళసూత్రం... నా పెళ్ళి గుర్తు? "

" యేందమ్మా! నాకంత అయోమయంగున్నది. నీ పెండ్లి జరగటమేంది? "

"నిజం బాపూ! నేనిప్పుడు రవి భార్యను"

"రవితో నీ వివాహం జరిగిందా? నాకు తెలియకుండా ఎట్ల జరిగిందమ్మా! ఎప్పుడు జరిగింది? " గోపాలరెడ్డి ఆదుర్దా, ఆవేదన వ్యక్తం చేస్తూ అడిగాడు.

"ఇంటర్వ్యూకు వెళ్ళినప్పుడు. జైలులోపలే మా పెళ్ళి జరిగింది బాపూ! మీతో చెప్పకుండా చేసినందుకు క్షమించండి"

"నేను క్షమించడం కాదమ్మా! నీజీవితాన్ని ఎందుకిట్లా నరకం చేసుకున్నవ్ తల్లీ, రేపో మాపో ఉరితీయబడే రవిని పెండ్లిచేసుకోవట మేందమ్మా! నీకేమైనా పిచ్చిపట్టిందా? "

"అతనూ ఆమాటే అన్నాడు బాపూ! కానీ నేనే బలవంతంచేసి రవి భార్యగా బతకాలని అతనిచేత యీ మంగళసూత్రం కట్టించుకున్నాను. రవితో నా పెళ్లి చేయాలని మీరనుకున్నదేగద! ఒకవేళ అప్పుడే పెళ్ళి జరిగివుంటే ఏం జేసే వాళ్ళం. లోకం దృష్టిలో కాకపోయినా నా దృష్టిలో రవి ఎప్పుడో నా భర్తయ్యాడు. అందుకే యీ నిర్ణయం తీసుకున్నాను బాపూ!"

గోపాలరెడ్డి కళ్ళలో నీళ్ళు రావడం ఆమె ఎప్పుడూ చూడలేదు. తండ్రి బాధను అర్థం చేసుకున్నది. తల్లిలా అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించింది.

"బాపూ! నీవు కోరుకునేది నా ఆనందమే గదా! నాకు ఆనందాన్నిచ్చే పని చేసినప్పుడు ఎందుకు బాపూ బాధపడుతున్నావు? "

"నీకంటే నాకెవ్వరున్నారమ్మా! నీకోసమేగదమ్మా నేనేం జేసినా! నీవు సుఖంగా వుండాలనుకున్న!"

"ఇప్పుడు మాత్రమేమయ్యింది! బాపూ!"

"నీకెట్ల జెప్పనమ్మా! నా బాధ నీకెట్ల తెలుస్తది? యీ వయసులో నాకెందుకు మనశ్శాంతి లేకుండా చేసినవుబేటీ? "

"వద్దు బాపూ! మీరు బాధపడితే చూడలేను. నా మాట వినండి. మీరు ప్రశాంతంగా వుండండి. నాకంతే చాలు" అన్నది శకుంతల. కాని అన్ని ఆశలు ఆమెమీదనే పెట్టుకున్న అతనికి కూతురు తప్ప ఆప్తులు లేరు. చనిపోయేవ్యక్తిని భర్తగా ఎందుకు ఎంచుకున్నదో అర్థంచేసుకోలేకపోతున్నాడు. ఏమైనా చేయగలిగిందేమీ లేదని, ఆమెను మరింత బాధపెట్టి దూరం చేసుకోవద్దనుకున్నాడు.

"నీ యిష్టం... నేను చేయగలిగిందే ముంది" అని నిట్టూర్పు విడిచాడు.

పొద్దున్నే శకుంతల పత్రిక చదువుతూ కూర్చున్నది. బయటినుండి నౌకరు ఎవరో తెచ్చియిచ్చిన కవరు దెచ్చి ఆమె చేతికి చ్చాడు. అది తన తండ్రిదై వుంటుందని చూడకుండానే ముందున్న టేబుల్ మీద వేసింది. తిరిగి పత్రిక చదువుతూ అనాలోచితంగా కవరు చూసింది. దానిమీద "శకుంతలకు" అని రాసివున్నది. తనకు ఉత్తరమేమిటి? ఎవరు రాస్తారు? అని సందేహిస్తూ కవరు విప్పింది.

ఆశ్చర్యం, ఆనందంతో వుక్కిరిబిక్కిరయ్యింది. ఉత్తరాన్ని ముద్దుబెట్టుకొని, గుండె లకద్దుకొని చదువుతున్నది...

"శశీ!"

ఈ ఉత్తరం నీకు ఆశ్చర్యాన్ని కలిగించ వచ్చు ఇది నీకు అందుతుందో లేదో నాకు తెలియదు. అందితే నా ఆవేదన కొంతవరకు తగ్గినట్లే, నా కోరిక నెరవేరినట్లే. కానీ ముందుగా ఒక మాట ఉత్తరం చదివి నన్ను అపార్ధం చేసుకోవద్దు. నా హృదయాన్ని అర్థంచేసుకో.

ఎలా వున్నావు? వద్దన్నా వినకుండా పట్టుబట్టి నీ పంతం నెరవేర్చుకున్నావు. కానీ- నేను చెప్పింది కూడా ఆచరించక తప్పదు. రేపో- ఎల్లుండో నన్ను హైదరాబాదు సెంట్రల్ జైలుకు తరలించి ఉరిశిక్ష అమలు జరుపుతారని వింటున్న. అంతకు ముందు నిన్నొకసారి చూడాలన్న కోరిక వున్నా నెరవేరదని తెలుసు. ఈ ఉత్తరమైనా చేరితే ధన్యుణ్ణి.

శశీ! నీకు అన్యాయం చేశాను. నీ ఆశలన్నీ తుంచేశాను. నీకు ఆవేదన మిగిల్చాను. నీవు జీవితంమీద ఎన్నెన్ని ఆశలు పెంచుకున్నావో తెలుసు. తీయతీయని మాటలతో మనం ముచ్చటించుకున్న రోజులు, ఆనందంతో నీవు పొంగిపోయిన సందర్భాలు, ఆశాసౌధాలు నిర్మించుకున్నప్పటి సంఘటనలు చూసి నేనూ మురిసిపోయాను. ఇద్దరం కలిసి జీవిత లక్ష్యాలను నిర్దేశించుకున్నాం. అనురాగం పంచుకున్నాం. అనుబంధం పెంచుకున్నాం. వాటికి కారణం నేనే. ప్రేరణ నేనే. జీవితాంతం నీతో కలిసి వుంటానని వాగ్దానం చేశాను. కానీ... అవన్నీ కాదని నిన్ను కాదని ఉద్యమంలో చేరాను. సిద్ధాంత గ్రంధాల అధ్యయనంతోపాటు ప్రతిరోజూ ప్రత్యక్షంగా కళ్లముందు జరిగే సంఘటనలు నన్ను ప్రభావితం చేశాయి. రాజకీయ చైతన్యం కలిగించి ఉద్యమానికి పురికొలిపింది. మన అనుబంధం ఒకవైపు, దేశాభిమానం మరొకవైపు, ఏ వైపు నా ప్రయాణమన్నది నాకు మొట్టమొదటి పరీక్షగా మారింది. నీకు అన్యాయం జరిగినా, నా ప్రాణానికి హానిజరిగినా దేశంకోసం, ప్రజల కోసం నా కర్తవ్యం ముఖ్యమని నిర్ణయించుకున్నాను. అందుకే నీతో చెప్పి చివరిగా వీడ్కోలు తీస్కోవాలని వచ్చినరోజు నేనెప్పుడూ మరిచిపోలేను. నా గుండెను బండరాయిగా మార్చి నీతో కఠినంగా ప్రవర్తించాను. నీ మనసు గాయపరచి నీవు నన్ను ద్వేషించి, అసహ్యించుకునేట్లు చేయాలనుకున్నాను. నీ మనసులోనుండి నన్ను శాశ్వతంగా దూరం చేస్తావనుకున్నాను. కానీ... యిలా జరుగుతుందనుకోలేదు.

నీ మాట కాదనలేక, నీ మనసును మరింత గాయపరచడం యిష్టంలేక, ఆలోచించడానికి అవకాశంలేక, నీ మెడలో మంగళసూత్రం కట్టాను. అది కొద్దిరోజుల్లోనే రాలిపోతుందని, అది నీకు మచ్చలా మిగులుతుందని చెప్పినా వినకుండా నీ మాట నెగ్గించుకున్నావు.

నీవు వెళ్ళిన తర్వాత, నేను పడిన మానసిక వేదన భరించరానిది. ఎంత ఆలోచించినా అర్థంకానిది. నీవెందుకింత మూర్ఖంగా ప్రవర్తించావు? ఎందుకు నీ జీవితాన్ని

నరకం చేసుకోవాలనుకున్నావు? నా వుద్దేశ్యంలో నీవు చేసింది అపరాధం. ఏ మనిషీ, తన వేళ్ళతో తన కళ్ళు పొడుచుకోడు. తన చేతుల్తో తన గొంతు పిసుక్కోడు. అలా చేసిన వాళ్ళు మూర్ఖులు లేక పిచ్చివాళ్ళు. నీవూ అలాగే చేశావు. ఇంత ఘాటుగా అంటున్నందుకు క్షమించు. ఇది నీమీది కోపంతో అంటున్నది కాదు. నీ మీద ప్రేమ, అనురాగంలేక కాదు. నిజం చెప్పాలంటే నిన్ను నా గుండెలనిండా నింపుకున్నాను. నీ రూపం ఎల్లప్పుడూ నా కళ్ళల్లో తిరుగుతూనే వుంటుంది. నీవు ఎల్లప్పుడూ సుఖంగా, ఆనందంగా, చిరునవ్వుతో వుండాలని నా మనసు కోరుకుంటున్నది.

శశీ! యీ వేదాంతమంతా ఎందుకని విసుక్కుంటున్నావా? లేక నన్ను అసహ్యించుకుంటున్నావా? అయినా... చివరిగా నా మనసులోని కోరిక, బహుశా ఇదే ఆఖరి కోరిక.

నేను చనిపోయిన తర్వాత నీవేమైపోతావు? నీ జీవితం ఏమవుతుంది? నువ్వు ఏ నిర్ణయం తీసుకుంటావు? అన్నదే నన్ను కలవరపరుస్తున్నది. నా వూహల్లో కనిపించేది కొద్దిరోజుల్లో నా మెడలో తగిలించబోయే ఉరితాడు కాదు. నీ మెడలో నుండి జారిపడే తాళిబొట్టు అందుకే శశీ! నిన్ను మరోసారి వేడుకుంటున్నాను, నన్నర్థంచేసుకో. నేను తనువు చాలించిన తర్వాతనైనా నీ మనసు మార్చుకో. నన్ను మర్చిపో. జరిగింది ఒక కలగా అనుకో. జీవితాన్ని సుఖమయం చేసుకో. అవకాశముంటే నీ శక్తియుక్తుల్ని కొంతవరకైనా దేశంకోసం ఖర్చుబెట్టు. అదే నేను కోరుకునేది. మన అనురాగానికి, ఆత్మీయతకు కానుకగా నేను కోరేది.

నిరాశా, నిస్పృహ మానుకో. నాకోసం ఆలోచించడం మానేసేయ్. గుండె రాయి చేసుకో. భవిష్యత్తును తీర్చిదిద్దుకో.

నేనొక పవిత్ర ఆశయంకోసం ప్రాణమిస్తున్నందుకు గర్వపడుతున్నాను. నా చర్యను నీవు కూడా హర్షిస్తావని ఆశిస్తూ...

-రవి"

ఉత్తరం పూర్తిచేసింది. కన్నీటి ధారలతో కలవరం చెందుతున్నది శకుంతల. దుఃఖాన్ని ఆపుకోలేకపోతున్నది. ఆవేశం తట్టుకోలేకపోతున్నది. రవి దూరమవుతాడన్నది భరించలేకపోతున్నది. తన మార్గమేమిటో నిర్ధారణ చేసుకోలేకపోతున్నది.

★ ★ ★

ఉత్తరం చూసి గోపాలరెడ్డి పరిస్థితి అర్థం చేసుకున్నాడు. శకుంతలకు ధైర్యం చెప్పడానికి ప్రయత్నించాడు. రవికి ఉరిశిక్ష విధించినప్పటినుంచి చట్టపరంగా పోరాడటానికి గోపాలరెడ్డి ప్రయత్నిస్తున్నాడు. మిలటరీ కోర్టులో తన వకాల్తాను తిరస్కరించిన తర్వాత న్యాయ నిపుణులతో సంప్రదింపులు జరుపుతున్నాడు.

"బేటీ... ధైర్యంగా వుండమ్మా! నా ప్రయత్నం నేను చేస్తున్నా. హైకోర్టు వకీళ్ళతో మాట్లాడిన. మిలటరీ కోర్టు విచారణ చట్టవిరుద్ధమని దావా వేయాలని చూస్తున్న. మిలటరీ కోర్టు తీర్పు నఖలు రాగానే దావా వేస్త. కేసు మరల విచారణ జరపడానికి అనుమతి దొరికితే రవిని కాపాడొచ్చు. కనీసం కొన్ని రోజులపాటు ఉరిశిక్ష అమలు జరగకుండా వుంటుంది. యేమైనా... నువ్వు మాత్రం ధైర్యం దెచ్చుకోవాలమ్మ" అని బిడ్డను ఓదార్చాడు గోపాలరెడ్డి.

శకుంతల ఆ రాత్రంతా నిద్రబోలేదు. ఆలోచనలతో సతమతమయ్యింది. కర్తవ్యం బోధపడటంలేదు. రవిని మరవలేకుంది. రవి దూరమవుతాడంటే వూహించుకోలేకపోతున్నది. రవి కోరినట్లు అతన్ని మరిచిపోయి. మరొకరిని పెళ్ళిచేసుకోవాలనే ఆలోచనే భరించలేకపోతున్నది.

రాత్రి గడిచింది. అప్పటికే శకుంతల ఒక

నిర్ధారణ చేసుకున్నది. రవి ఊరుకెళ్ళి అతని తల్లిదండ్రులను పలకరించి రావాలన్న కోరి కను తెలిపింది. గోపాలరెడ్డి కాదనలేదు. ఆ రకంగానైనా మనశ్శాంతి పొందుతుందనుకు న్నాడు. ప్రయాణానికి ఏర్పాట్లు చేశాడు.

మర్నాడు పొద్దున్నే తండ్రితో చెప్పి అత్త వారింటికి పయనమయ్యింది. ప్రయాణ ఏర్పాట్లు చేసి సాగనంపుతున్నాడు గోపాల రెడ్డి. కచ్చడం బండిలో ఎక్కిన శకుంత లతో,

"రెండురోజుల్లో వచ్చెయ్యమ్మా! నువ్వొచ్చే దాకా నాకు మనశ్శాంతుండదు" అన్నాడు.

"అలాగే బాపూ! మీరు మాత్రం ఆలో చిస్తూ ఆరోగ్యం పాడుచేసుకోవద్దు" అన్నది శకుంతల.

బండి కదిలింది.

★ ★ ★

ఇంటిముందు కచ్చడం బండి ఆగడం చూసిన శాంతమ్మ తమ ఇంటికొచ్చిన చుట్టా లెవరా అనుకున్నది.

బండి దిగి లోనికొస్తున్న శకుంతలను గుర్తుపట్టింది. ఆమె ఇంట్లో అడుగుపెడు తుండగానే బావురుమన్నది శాంతమ్మ. కోడ లుగా ఇంటికి రావలసిన శకుంతల పరామ ర్శించడానికొచ్చిందని భావించింది. ఆమెను ఇంట్లోకి ఆహ్వానించి కాళ్ళకు నీళ్ళిచ్చింది.

మంచి నీళ్ళు అందించి, "దేవుడు అన్యాయం చేశాడమ్మ. కోడలై రావల్సినదా నివి చుట్టానివై వొచ్చినవ్, నా కొడుకు ఇవ్వాలో రేపో ఉరితీయబడ్తాడట. నా కూతురు సుగుణను ఆ రాక్షసులు చంపే సిండ్రు. ముసలాయన మంచంబట్టిండు" అంది.

ఉయ్యాలలో వున్న పసివాణ్ణి ఎత్తుకుంది శకుంతల.

"ఇన్ని ఘోరాలు చూసేకంటే ఏ నుయ్యో గొయ్యో చూసుకుందామంటే వీడున్నాడు. అందుకేనమ్మ గుండె రాయి చేసుకొని బతు కుతున్న" అన్నది శాంతమ్మ. ఆమెను చూస్తుంటే ఎలా సముదాయించాలో శకుం తలకు తెలియకుండా వుంది.

"ఈ ఇంటి కోడలుగా వస్తావనుకున్న. నా కొడుకు పెద్ద నౌకరీ చేస్తడని ఎంతో గొప్పో డైతడని కలలుగన్న. అంతా నా తల రాత"

తలబాదుకుంది.

"ఏడవకండి అత్తయ్యా! ఇప్పుడూ మీ కోడలుగానే వచ్చాను"

"ఆ అదృష్టం నాకు లేదమ్మ. ఉంటే దేవుడు గిట్లెందుకు చేస్తడు? "

"నిజమత్తయ్యా! ఈ మంగళసూత్రం సాక్షిగా, నీ కొడుకు భార్యగా, యీ ఇంటి కోడలుగా వచ్చిన" మెడలోని మంగళ సూత్రం చూపుతూ అన్నది.

శాంతమ్మ ఆశ్చర్యపోయింది. అది కలా నిజమా నమ్మలేకపోయింది.

"యెందుకమ్మ నీ బతుకు పాడుజేసుకు న్నవ్? చచ్చిపోయేవాడితో తాళిగట్టించుకు న్నవ్ దేనికమ్మ? " అన్నది.

పసివాణ్ణి ముద్దాడుతూ, ఆడిస్తూ అత్త ఆవేదన అర్థంచేసుకున్నది. మాట మారుస్తూ అడిగింది శకుంతల...

"మామయ్య ఎక్కడికెళ్ళారు? "

శాంతమ్మ కంట తడి తుడుచుకుంటూ.

"యెక్కడికెళ్ళాడో ఏమో? యియన్నీ చూసి ఆయన పిచ్చోడైపోతున్నడు" అన్నది. వచ్చిన చుట్టానికి మంచినీళ్ళైనా యివ్వ కుండా మాటల్తో గడిపాననుకున్న శాంతమ్మ

"రామ్మా! స్నానం చేసి అన్నం తిందువు? ఆయనొచ్చేసరికి ఎంతసేపయ్యిద్దో? " అన్నది బాబును శకుంతలనుండి తీసుకుంటూ.

★ ★ ★

సాయంకాలం వూర్లో వూరేగింపు జరుగు తున్నది. డప్పులు, కొమ్ములు, బాజాభజం త్రీలు మోగుతున్నయ్. ఆడుతూ పాడుతూ జై కొడుతూ జనమంతా గడిదగ్గరికి చేరారు. సభ జరగనున్నది. స్త్రీలు, పిల్లలు

ముందు వరుసలో కూర్చుంటున్నారు. వాళ్లు వచ్చేటప్పుడు ఇంటినుండి ఈత చాపో, గొంగడో, దుప్పటో తెచ్చుకుని నేలమీద పర్చుకుంటున్నారు. అరుగులమీద, గోడపక్కన గడిముందు స్థలమంతా జనంతో నిండిపోయింది. శాంతమ్మ, శకుంతల వచ్చి గోడపక్క చిన్న అరుగుమీద గొంగడిపరిచి కూర్చున్నారు. శకుంతల పసివాణ్ణి వడిలో పెట్టుకొని లాలిస్తూ కార్యక్రమం చూస్తున్నది. వచ్చిన దళసభ్యులు ముందుగా భగత్‌సింగ్ బుర్రకథ చెప్పుతున్నారు. అందరూ కథలో లీనమైనారు.

భగత్‌సింగ్ ధైర్యంగా ఉరికంబానికి నడిచే ఘట్టం వుద్రేకపూర్వకంగా కథకుడు చెపుతున్నాడు. భగత్‌సింగ్‌తోపాటు రాజగురు, సుఖదేవ్ మాతృదేశంకోసం ప్రాణాలను త్యాగం చేస్తూ చివరిగా "ఇన్‌క్విలాబ్ జిందాబాద్" నినాదం గొంతెత్తి పలుకుతున్నారు.

శకుంతల కథలో లీనమైపోయింది. భగత్‌సింగ్‌లో రవిని చూస్తున్నది. భగత్‌సింగ్ కంఠానికి ఉరితాడు బిగించడం, "ఇన్‌క్విలాబ్ జిందాబాద్" అంటూ ఆ వీరుడు వొరిగిపోయే ఘట్టం.

"విప్లవం వర్ధిల్లాలె" శకుంతల గొంతెత్తి వుద్రేకపూర్వకంగా అన్నది. అందరూ ఆమెవైపు చూశారు.

రౌద్రమూర్తియై నిలిచిన శకుంతల పసిబిడ్డని శాంతమ్మ చేతుల్లోబెట్టి వేదిక దగ్గరికెళ్ళింది.

"ఈమెవరు? ఎవరు?" జనంలో గుసగుసలు వినబడుతున్నయ్. వేదికనెక్కి అందరికీ నమస్కరించి అంది శకుంతల.

పేరు, వివరాలు చెప్పి తన భర్త అడుగుజాడల్లో విప్లవానికంకితమవుతున్నట్లు ప్రకటించింది.

దళసభ్యురాలిగా పనిచెయ్యడానికి అనుమతించమని దళ నాయకుణ్ణి కోరింది. విప్లవకారిణిగా ప్రతిజ్ఞ చేసింది.

జనం జే కొట్టారు.



తన నిర్ణయాన్ని, దళంలో చేరిన విషయాన్ని తండ్రికి తెలియజేయాలనుకున్నది శకుంతల. ఈ వార్త తన తండ్రికి బాధాకరమైనదైనా తప్పదనుకున్నది. మనిషిద్వారా ఉత్తరం పంపింది.

"ప్రియమైన బాపుకు!

నమస్కారములు.

క్షేమంగా చేరాను. వచ్చి వారం గడిచింది. ఇక్కడ అత్తయ్య, మామయ్యా రవిని గురించే ఆందోళనపడుతున్నారు. మామయ్య తనలో తను కుమిలిపోతున్నాడు. అత్తయ్య దుఃఖంలో మునిగిపోతున్నది. నేనొచ్చిన తర్వాత కొంత మార్పు కనబడుతున్నది. ఇక్కడి పరిస్థితులు, చూసిన తర్వాత, రవి ఏ లక్ష్యాన్ని సాధించడానికి ఉద్యమంలో చేరాడో అర్థంచేసుకున్నాను. నా భర్త అడుగుజాడల్లో ప్రయాణం చెయ్యాలని నిర్ణయించుకున్నాను. ఉద్యమానికి నా భర్త లేనిలోటు కొంతవరకైనా తీర్చాలని, నా వంతు బాధ్యతలు నిర్వహించాలని నిశ్చయించుకొని దళంలో చేరుతున్నాను.

"ఇది మీరు భరించలేరని తెలుసు. యీ విషయం మీకు స్వయంగా చెప్పి మీ ఆశీర్వాదం పొందాలని వున్నా, మీరు అంగీకరించరని మీ మాట కాదనవలసి వస్తుం

దన్న బాధతో మానుకున్నాను. మీరు నన్నెంతగా ప్రేమిస్తున్నారో తెలుసు. అమ్మ పోయినప్పటినుంచి ఎంత గారాబంగా పెంచారో తెలుసు. నేనుగాక మీకెవరూ లేరని తెలుసు. మీ ఆరోగ్యం గురించి తెలుసు. యీ విషయం విన్న తర్వాత మీరెలా వుంటారో తెలుసు. అయినా ఎందుకీ నిర్ణయం తీసుకున్నానని మీరనుకో వచ్చు. రవి అన్నట్లు మన వ్యక్తిగత అనుబంధాలకంటే దేశాభిమానం ముఖ్యం. నా చిన్నతనం నుంచి మీరూ అదే నేర్పారు. మీ ఆదర్శాలు, దేశభక్తి కూడా మీ బిడ్డగా నాకు అబ్బిందనుకుంటాను. అంతేగాక రవి లేని జీవితం నిత్యం దిగులుతో బతికేకంటే ఒక విప్లవవీరుడి భార్యగా నా కర్తవ్యం నెరవేర్చడం న్యాయమని భావిస్తున్నాను. నన్ను అర్థంచేసుకుంటారని, నా నిర్ణయాన్ని గౌరవిస్తారని, నన్ను ఆశీర్వదిస్తారని ఆశిస్తున్నాను.

ప్రేమతో

నీ కూతురు శకుంతల"

శకుంతల ఉత్తరంజూసి గోపాలరెడ్డికి మతిబోయినట్లయింది. తల్లిలేని బిడ్డని అల్లారుముద్దుగా పెంచుకున్నాడు. వాస్తవానికి ఆమె కోసమే తాను జీవిస్తున్నాడు. ఇంతకాలం ఆమె అన్నదేదీ కాదనలేదు. చివరకు ఉరిశిక్ష బడిన రవిని పెళ్ళి చేసుకున్నానన్నా కాదనలేదు. ఆమె మనోవ్యథను తగ్గించడానికి, రవిని రక్షించడానికి చేయగలిగిన ప్రయత్నాలన్నీ చేస్తున్నాడు. తన కళ్ళెదుట బిడ్డను చూసుకుంటూ అన్నీ మరిచిపోతున్నాడు.

ఇప్పుడు తానేమి చెయ్యాలె! ఎవరికోసం బతకాలి! శకుంతల ఏమవుతుంది? అడవుల్లో గుట్టల్లో ఆ బాధలెట్లు భరిస్తుంది. ఎప్పుడు ఏ ప్రమాదం జరుగుతుందోనని తల్లడిల్లుతున్నాడు.

విషాదంలో వున్న గోపాలరెడ్డికి మరో విషాద వార్త ఎదురయ్యింది. రవిని విచారించిన మిలటరీ కోర్టు తీర్పు న్యాయసమ్మతం కాదని, మామూలు కోర్టులో విచారణ జరపాలని సాక్షులను, న్యాయవాదిని అనుమతించాలని పెట్టిన అప్పీలును కోర్టు తిరస్కరించింది. రవికి ఉరిశిక్ష తప్పదని తెలిపోయింది.

ఏకాకిగా దిగులుతో గోపాలరెడ్డి మంచం పట్టాడు.

★ ★ ★

గట్టి బందోబస్తుతో రవిని హైదరాబాదుకు తీసుకుపోతున్నారు. అతని చేతులకు బేడీలు వేశారు. చేతుల బేడీలకు కట్టిన తాడు జమేదార్ మహమూద్ గట్టిగా పట్టుకున్నాడు. ఇరవై ముప్పైమంది పోలీసులు అతన్ని పోలీసు వ్యాన్‌లో ఎక్కించి, పక్కన కూర్చున్నారు. అమీన్‌సాబ్ ముందు సీట్లో కూర్చున్నాడు.

వ్యాన్ వేగంగా పోతున్నది. కంకరరోడ్డు. అతుకు గతుకుల్లో ఎగిరెగిరి పడుతూ వూగిపోతున్నది. పొద్దుగూక బోతున్నది. వాన మొదలయ్యింది. దారి కనిపించడంలేదు. రోడ్డుపక్క మట్టి తడిసి దిగబడుతున్నది. వ్యాన్ ఇంజన్ వేడెక్కి లాగలేక లాగుతున్నది. అమీన్‌సాబ్ తొందరపెడుతున్నాడు. "జల్దీజల్దీ" అని.

వ్యాన్ గతుకులో పడి ఆగిపోయింది. మూల్గుతున్నది కానీ కదలనంటున్నది. మరింత దిగబడి పక్కకు వొరిగిపోతున్నది. అమీన్‌సాబ్ కిందికి దిగాడు. వెనకనుండి పోలీసులు దిగారు. జమేదార్ మహమూద్ రవి బేడీల తాడు పట్టుకొని లోపల కూర్చున్నాడు. కిందికి దిగిన పోలీసులు శక్తినంతా వుపయోగించి వ్యాన్‌ను తోశారు. వేడెక్కిన ఇంజన్ నోరుమూసింది. స్టార్టు కావటం లేదు. డ్రైవరు అన్ని ప్రయత్నాలు చేసి అలిసిపోయాడు.

వాన, చీకటి ఏకమై అంధకారం

అయింది. దిగిన పోలీసులు వానకు తడిసి వణుకుతున్నారు. అమీన్‌సాబ్ గాబరాపడు తున్నాడు. సిగరెట్ దమ్ములు కొడుతూ దిక్కులు చూస్తున్నాడు. అతన్ని చూసి జవాన్లు కూడా పక్కకు పోయి చెట్లచాటున నిలబడి బీడీలు వెలిగిస్తున్నారు. కొందరు చెట్లచాటున మూత్రం చేస్తున్నారు.

వ్యాన్‌లో వున్న జమేదార్ మహమూద్‌కు చిటికెన వేలు చూపిండు రవి.

"అబ్బే. నీక్కూడా గిప్పుడే నచ్చిందా! చల్ దిగు దిగూ" అన్నాడు మహమూద్ తాడు పట్టుకొని కిందికి దిగుతూ.

తాడు గట్టిగా పట్టుకొని చెట్టుపక్కకు తీసుకుపోయాడు. చెట్టుచాటుకు వెళ్ళాడు రవి. ఒక్కసారి వాన ఎక్కువయ్యింది. పోలీసులు గబగబా వ్యాన్‌లో దూరారు. మహమూద్ వానలో తడుస్తూ.

"అరే జల్దీ కర్" అంటూ తాడు లాగాడు. తెగిన తాడు చేతికొచ్చింది. "పక్డో... పక్డో... ముజ్రిం బాగ్గయా" మహమూద్ అరుపులు పెడుతూ, తుపాకి తీసి కాల్పులు జరుపుతు న్నాడు.

అమీన్‌సాబ్, పోలీసులు గబగబా వచ్చారు.

"ఇదర్ బాగ్గయా! సాలే" వేలుతో చూపాడు మహమూద్.

"బాగో... మార్‌డాలో... చలో..." గోల గోలగా అరుస్తున్నాడు అమీన్. పోలీసులు అరుపులు, కేకలు పెడుతూ, కాల్పులు జరు పుతూ ఆ దిక్కుకేసి వురుకుతున్నారు.

అదంతా అడవి ప్రదేశం. నల్లని కొండలు, పెద్దపెద్ద పొదలు చెట్లున్నయ్. మట్టిలో బూట్లకాళ్ళు దిగబడుతున్నాయ్. పొదలు, రాళ్ళు దయ్యాల్లా కనబడుతు న్నాయ్. పోలీసులు అలిసిపోయారు. యింకా ముందుకు పోవటానికి జంకుతు న్నారు. సంగపోల్లుంటరో, దయ్యాలుంట యోనని భయపడుతున్నారు. అమీన్‌సాబ్ కూడా గబరాయిస్తున్నాడు. లాభంలేదని వెనక్కి మళ్ళారు.

చేతులకు సంకెళ్ళతో పరుగెత్తలేకపోతు న్నాడు రవి. అంతా చీకటిమయం కాలు కదిపితే రాయి, రప్ప, కంప, పొదలు తగు లుతున్నాయ్. పోలీసుల కాల్పులు, అరు పులు, కేకలు వినబడుతున్నాయ్. దూరంగా పోవాలని పడుతూ, లేస్తూ పరుగెడుతు న్నాడు.

ఎటుపోతున్నాడో, ఎంత దూరం వచ్చాడో తెలియదు. ఆయాసంతో వూపిరాడకుంది. గాయాలతో శరీరమంతా రక్తం కారుతు న్నది.

వాన తగ్గింది. చీకటిపోయింది. ఆకాశం నిండా చుక్కలు మొలిచినయ్. చంద్రుని కాంతి నేలనంతా కాంతివంతం చేస్తున్నది. ఆ ప్రాంతంలో వాన పడినట్లులేదు. అడవి లోని ఎండుటాకులు రవి పరుగుదీస్తుంటే గలగల మంటున్నయ్. అప్పుడప్పుడు నక్కల కూతలు వినబడుతున్నాయ్.

అలిసిపోయిన రవి సోషొచ్చి పడిపో యాడు.

★ ★ ★

"జరూరీ- హయం ఎలాన్"

హైదరాబాదు రేడియో ప్రకటన వినబడు తున్నది. ప్రమాదకరమైన నేరస్తుడు, ఉరిశి క్షబడిన కమ్యూనిస్టు నాయకుడు సెంట్రల్ జైలుకు తీసుకొస్తుండగా పారిపోయాడు. పేరు రవి, ఎత్తు ఐదు అడుగుల పది అంగుళాలు, వయసు 25 సంవత్సరాలు. చామనచాయ పారిపోయినప్పుడు ఖైదీ దుస్తులు చేతులకు బేడీలున్నయ్. నేరస్తుడు పారిపోవడానికి సహకరించిన జమేదార్ మహమూద్‌కు కఠినశిక్ష విధించబడింది. నేరస్తుడి ఆస్తిపాస్తులన్నీ సర్కార్ జప్తుచేయ డానికి హుకుం జారీ చేసింది. నేరస్తుడి ఆచూకీ చెప్పిన వారికి 10 వేలు, పట్టిచ్చిన వారికి 20 వేలు ఇనాం ప్రకటించింది. నేర స్తుడికి ఆశ్రయమిచ్చిన వాళ్ళకు నేరస్తులుగా

కఠినశిక్ష విధింపబడుతుందని సర్కార్ ఎలాన్ చేస్తోంది"

తెలుగు, ఉర్దూ భాషల్లో పదేపదే ప్రకటన చేస్తున్నారు.

వందలమంది పోలీసులు రామారంమీద దాడిచేశారు. కనబడిన మగోళ్ళందర్నీ పట్టుకుని రవి జాడ చెప్పమని హింసిస్తున్నారు. రవి ఇల్లు జప్తుచేశారు. నర్సిరెడ్డిని అరెస్టు చేశారు. దొర గడిలో పోలీసు క్యాంపుబెట్టారు. పటేల్ పాపిరెడ్డి, రజాకార్ దస్తగీర్ కొంతమంది రజాకార్లు కూడా వారిలో కలిశారు.

శాంతమ్మ పసిబిడ్డతో వాళ్ళ కంట బడకుండా తప్పుకున్నది. ఊరు బయట గుడిసెలో తల దాచుకుంటున్నది.

★ ★ ★

సూర్యకిరణాల వేడితో కళ్ళు తెరిచి చూశాడు రవి. ఆకాశం నిర్మలంగా వుంది. నెమ్మదిగా లేచి నలువైపులా చూశాడు. చెట్లు, గుట్టలమధ్య అడవిలో వున్నానని గ్రహించాడు. శరీరమంతా కంప, కొమ్మలు తగిలి గాయాలై రక్తం మరకలున్నయ్. కాళ్ల నిండా ముళ్ళు కదలనీయడంలేదు. దాహంతో నోరెండిపోతున్నది. చేతులు బేడీలు చూసుకున్నాడు. నీళ్ళకోసం చూపులతో గాలించాడు. దూరంగా పెద్ద చెరువున్నట్లు గమనించి అటువైపు ఒక్కొక్క అడుగు బరువుగా వేస్తున్నాడు. కాళ్ళకింద ఎండుటాకులు గలగలశబ్దం చేస్తున్నయ్.

చెరువుగట్టున కూర్చొని కడుపునిండా నీళ్ళు తాగి కాళ్ళు చేతులు కడుక్కొని. అలసట తీర్చుకుంటున్నాడు. చేతుల బేడీలతో నీటిలో తన ఆకారం చూసుకుంటున్నాడు.

అడవిలో అలజడి వినబడ్డది. చెట్లమీద పిట్టలు అరుస్తూ లేచి పోతున్నయ్. బూట్ల కాళ్ళ పరుగుల శబ్దం విని, శత్రువు ముట్టడిస్తున్నాడని తెలుసుకున్నాడు. లేవబోతుండగా, నీటిలో ఎత్తుపై తుపాకులెక్కిపెట్టి నిలబడ్డ పోలీసు బలగాలను చూశాడు. మరో దారిలేదు. నీటిదారేననుకుని గబాలున దూకాడు. పోలీసులు కేకలు పెడుతూ కాల్పులు జరుపుతున్నారు.

మునిగిన వ్యక్తి పైకి తేలకుండా ఏమయ్యాడని పోలీసులు ఆశ్చర్యపడ్డారు. ఈత రాక మునిగిపోయాడో, తూటాదెబ్బ తగిలి చచ్చిపోయాడోనని శవమైనా కనబడుతుందేమోనని చూసి, నిరాశతో వెనక్కు మళ్ళారు.

★ ★ ★

పూరి గుడిసెలో పసిబిడ్డను పడుకోబెట్టి ప్రక్కన కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నది శాంతమ్మ. దీపం గుడ్డి వెలుతురిస్తున్నది.

తలుపుకొట్టిన శబ్దంవిని వులిక్కిపడ్డది శాంతమ్మ. ఏదో ప్రమాదం వచ్చిందనుకున్నది. నెమ్మదిగా వెళ్ళి తలుపు సందులో నుంచి చూసింది. బయటంతా చీకటి. మళ్ళీ తలుపు కొట్టిన శబ్దం... వూపిరి బిగబట్టి ఖంగారుపడుతున్నది. తలుపు శబ్దం ఎక్కువయ్యింది. తప్పదనుకొని ధైర్యం చేసి...

"ఎవరూ? " అడిగింది.

"నేనేనమ్మా. తొందరగా తలుపుతీయ్" అవతలి గొంతు పలికింది.

శాంతమ్మ నమ్మలేకపోతున్నది.

"నేనమ్మా రవిని" అన్నాడు తొందరపడుతూ.

శాంతమ్మ తలుపు తెరిచింది. ఎదురుగా రవిని చూసింది. ఆశ్చర్యం, ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతున్నది. లోపలికొచ్చి తలుపు మూశాడు రవి. శాంతమ్మ తేరుకొని కొడుకును గుండెలకద్దుకున్నది. కంట తడి పెడుతూ అతని చేతులు నిమురుతూ- చేతులకు తగిలిన బేడీలు చూసింది.

ఆమె బాధనంతా కళ్లతో, కన్నీళ్ళతోనే తెలుపుతున్నది.

"నాకంతా తెలుసమ్మా! జరిగిందంతా తెలుసు. ప్రమాదంలో నుంచి బయటప

డ్డాను. కానీ, మీ అందరికీ కష్టాలొచ్చినయ్. ఒక్కసారి నిన్ను చూసిపోదామని వచ్చాను. ఇక్కడ ఎక్కువసేపుంటే ప్రమాదం. ఈ సంకెళ్ళు పగలగొట్టడానికి కంసాలి శంకరయ్యను ఓ చోటికి రమ్మని కబురు చేశాను. తొందరగా వెళ్ళాలమ్మా!" అన్నాడు.

"రా నాయన"

లోపలికి నడిచి చాపమీద పడుకోబెట్టిన బాబును చూపుతూ.

"నీ చెల్లెలు మిగిల్చిన గుర్తు నాయనా!" అన్నది.

రవి, నిద్రలోనున్న బాబును ముద్దాడి, చెల్లెను గుర్తుచేసుకున్నాడు. అతని కళ్ళల్లో కన్నీళ్ళు తిరిగినయ్. శాంతమ్మ పొంగుకొచ్చే దుఃఖాన్ని ఆపుకుంటున్నది.

"అంతా అయిపోయింది నాయనా! నీ చెల్లెలు చనిపోయింది. నువ్వేమవుతావోనని ఎప్పుడు వినకూడనిది వినవలసివస్తదేమోనని భయపడుతున్న. దేవుడి దయవల్ల గండం తప్పింది. బయటపడ్డవ్. మల్ల ఆ పాపిష్టోళ్ళ చేతులకు చిక్కద్దు నాయనా! నీ జాడ జెప్పమని మీ నాయన్ను పట్టుకపోయి హింసలు పెడుతున్నరట. కోడలు కూడా నీదారినె వెళ్ళింది. నేనొక్కదాన్ని యీ కొంపలో తలదాచుకుంటున్న. యిట్ల యింకెంతకాలం నాయన! యీ బాధలు? " ఆవేదనతో అన్నది.

"తొందరలోనే మంచిరోజులొస్తాయమ్మా! నువ్వు ధైర్యంగా వుండు. కొన్నాళ్ళీ బాధ తప్పదు"

"ఎప్పుడు ఏం జరుగుతుందో తెలియదు. వూరిలో పోలీసు క్యాంపు బెట్టింద్రు. రజాకార్ల గుంపున్నది. నువ్వు వచ్చినట్లు దెలిస్తే..."

"యేం ఫర్వాలేదమ్మా! బయట మన వాళ్ళు కాపలా వున్నారు. అయినా జాగ్రత్త పడాలి"

"మాటల్లో మరిచేపోయాను. మంచినీళ్ళు తెస్తానుండు నాయనా" అని లోపలికెళ్ళబోతుండగా.

"అన్నం లేదా అమ్మా"

రెండురోజులనుండి అన్నం తినలేదు. అమ్మ చేతులమీదుగా కడుపునిండా తినాలని అడిగాడు రవి.

ఆకలితోవున్న కొడుక్కు పట్టెడన్నం పెట్టలేని దుస్థితిలో వున్నదామె. ఇంట్లో వంట చేస్తే పొగతో అనుమానం కలగవచ్చునని వంట చేయడం లేదు. ఊరిలోని వాళ్ళే రహస్యంగా రెండుపూటలా అన్నం బాబుకి పాలు తెచ్చి పెడుతున్నారు. ఇంట్లో చారెడు బియ్యం వున్నవేమోనని కుండలన్నీ గాలిస్తున్నది. తన దీనస్థితికి దుఃఖిస్తూ పొయ్యి



దగ్గరే కూర్చున్నది.

అది గమనించిన రవి.

"అమ్మా నాకు ఆకలిగా లేదమ్మా! తినే వచ్చాను. నీ చేతులమీదుగా తిని ఎంతో కాలమయ్యింది ఒక ముద్ద తిందామని అన్నాను- అంతే. ఎందుకమ్మా దీనికింత బాధపడతావు" అని తల్లిని ఓదార్చుతున్న రవి చేతుల బేడీలు ఆమె మనసును కదిలించాయి.

"బిడ్డ ఆకలి తల్లికి తెలియదా నాయన. నా చేతుల్తో తినిపిద్దామనుకున్న. కానీ ఏం చేయను? ఆకలితో వచ్చిన బిడ్డకు పట్టెడన్నం పెట్టలేనిదాన్నయ్యాను. నేనేం పాపం చేశానని నాకీ శిక్ష వేసిండా దేవుడు? అందరికీ దూరంచేసి నన్నెందుకిలా బాధపెడుతున్నడు? నాయనా రవీ- నా బాధ నీకెట్ల చెప్పనయ్యా? కళ్ళముందు నిన్ను కాసేపు వుండమనడానికి- మనసారా మాట్లాడుకోవడానిక్కూడా అవకాశం లేకుండ జేసిండు? ఎందుకయ్యా? "

దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది.

"అమ్మా వద్దమ్మా! బాధపడొద్దు. నిన్ను చూశాను- నా ఆకలి తీరింది. ఎక్కువసేపుంటే ప్రమాదం. నేను వెళ్తానమ్మా!" తల్లి కంటతడి తుడుస్తూ అన్నాడు.



"ఎంతకాలం నాయనా ఇట్ల. దినదిన గండంగా ఎంత కాలమిట్లని. ఎవరితోను పల్లెత్తు మాటనిపించుకోని మీ నాయన నర కయాతనలు భరిస్తున్నడు. అప్పుడు నువ్వు చేసింది తప్పన్నడు. కానిప్పుడు ఎన్ని బాధ లైన భరిస్తున్నడు. ఎన్ని మాటలన్నా ఓర్చు కుంటున్నడు. గండంతప్పి వచ్చిన నిన్ను వుండమనలేను- పొమ్మనలేను. మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు. నువ్వు తప్పించుకున్న వని పోలీసులు అంటుంటే నమ్మలేదు. మళ్ళీ వాళ్ళ కంటబడతవేమోనని ఖంగారు పడ్డ. ఇకముందు జాగర్తగుండు నాయనా? '' అన్నది.

"అందుకేనమ్మా తొందరగా వెళ్ళాలి. అవ తల నా కోసం కామ్రేడ్సు ఎదురుచూస్తుం టరు. వెళ్తానమ్మా"

"వెళ్ళు నాయనా? సంగంతోపాటు యీ తల్లిని కూడా గుర్తుంచుకో. శకుంతలెక్క డుందో తెలుసుకొని కలుసుకో. మళ్ళెప్పుడొ స్తవో? నేనెప్పుడు చూస్తనో? " అన్నది.

తల్లికి వీడ్కోలు చెప్పి- పసివాడిని ముద్దు బెట్టుకొని- బయటికి నడిచిండు రవి. చీకట్లో కనిపించకుండా పోయేవరకు తలుపు దగ్గరే నిలబడి చూస్తోంది శాంతమ్మ.

★ ★ ★

నర్సిరెడ్డితోపాటు, గ్రామకమిటీ సభ్యులు లింగయ్య, మైసయ్య మరికొందరిని పట్టుకొ చ్చారు. పోలీసు క్యాంపులో అందరినీ గుంపుగా కూర్చోబెట్టారు. క్యాంపు ముందు రేగికంప పలచగా, చాపలాపరిచి ఇద్దరిద్దరి చొప్పున తీసుకపోయి కంపమీద పడేస్తు న్నారు. దానికిముందు వంటిమీది అంగీలు వూడదీస్తున్నారు. కంపమీద పడదోసిన వాళ్ళమీదుగా బూటుకాళ్ళతో పోలీసులు కసిగా తొక్కుతున్నారు. కంపముళ్ళు శరీర మంతా గుచ్చుకొని రక్తం చిందుతున్నది. ఆ బాధను భరించలేక హాహాకారాలు చేస్తు న్నారు.

నర్సిరెడ్డి వంతొచ్చింది. అంగీ వూడదీ యించి- రెక్కపట్టుకొని యీడ్చుకపోయి కంపమీదతోసేశారు. నర్సిరెడ్డి నోరు మెదప లేదు. అతని కళ్ళు మాత్రం ఆవేశం చిమ్ము తున్నాయ్. బూటుకాళ్ళతో తొక్కుతూ అమీ న్‌సాబ్ రంకెలు బెడుతున్నాడు.

"సాలే! తేరేకూ మార్‌డాలోంగా! బోలో సాలే" అంటున్నాడు. మరొక ఆఫీసరు దూరంగా నిలబడి. "మంచిగా జెప్పితే బత్కి పోతవ్! నీ కొడుకెక్కడుండో సెప్పు" అన్నాడు. నర్సిరెడ్డి బాధ భరించలేకపోతు న్నాడు. కానీ పౌరుషం నిలబెట్టుకుంటు న్నాడు.

"నాకు తెలియదు- ఎక్కడున్నాడో? తెలి సినా చెప్పను"

"యట్ల జెప్పడో సూస్తం. సెప్పకుంటే సస్తవ్" అన్నాడు అమీన్‌సాబ్ బలంగా తొక్కుతూ.

"చంపితే చంపరా! అంతకంటే యింకేం జేస్తవ్" అన్నాడు నర్సిరెడ్డి తెగింపుతో.

"ఈడిట్ల సెప్పడు- బయటికి తీస్కరా! ఆడి సంగతి నేన్జెప్త" అన్నాడు పక్కనున్న ఆఫీసరు.

నర్సిరెడ్డిని కంపలోనుండి బయటికి యీడ్చుకొచ్చాడు అమీన్.

నర్సిరెడ్డి నెమ్మదిగా లేచి నిలబడ్డాడు. వొళ్లంతా రక్తమయం.

శరీరంలోకి దిగిన రేగిముళ్లు అట్లాగే వీపునంటి వున్నాయ్.

ఎదురుగా వున్న అమీన్ కళ్ళల్లోకి సూటిగా చూశాడు.

"ఇంతకుముందు నా కొడుకు చేసేది తప్పనుకున్నా- వాడు నా కొడుకే కాదు- వాడికీ నాకూ ఏ బంధం లేదనుకున్న- కానీ- ఇప్పుడు జెప్పుతున్న. నా కొడుకు చేస్తున్న పోరాటం న్యాయమైనదని. వాడు నా కొడు కని చెప్పడానికి గర్వపడుతున్న. ఇప్పటి నుంచి నేను గూడా నా కొడుకు దారిలోనే నడుస్త. ఏం చేస్తరో చెయ్యండి. చంపు తరా? నరుకుతరా? దేనికైనా సిద్ధమే" అని ప్రకటించాడు.

పోలీసులు- పరేషానయ్యారు. అమీన్‌సా బ్‌కు రోషమెక్కువయ్యింది.

"గట్లనా- సాలే... సెప్తరా" అని నర్సిరెడ్డి చేయిబట్టుకొని గొరగొరా ఠానాలోనికి యీడ్చుకపోయాడు.

★ ★ ★

రామారం క్యాంపులో పోలీసులు, రజా కార్లు కలిసి వందమందికిపైగా వున్నారు. రోజూ పట్నంనుండి లారీలు, జీపులు వచ్చి పోతున్నాయ్. పటేల్ పాపిరెడ్డి పట్వారి రామారావు, రజాకార్ దస్తగీర్ క్యాంపులో వున్నవాళ్ళకు సౌకర్యాలు కలిగిస్తున్నారు. మస్కూరు కొండడు, చాకలి నారయ్య, మంగలి పిచ్చయ్య ఎప్పటిలాగే గడిలో పని చేస్తున్నారు. అక్కడి విషయాలన్నీ పార్టీవా ళ్ళకు తెలియజేస్తున్నారు.

పోలీసులు, రజాకార్లు గుంపుగా చుట్టు పక్కల వూర్లమీద ఆకస్మికదాడులు చేస్తు న్నారు. దోపిడీలు చేస్తూ- దొరికినవాళ్ళను చిత్రహింసలు పెడుతున్నారు. అనుమాన మున్న వాళ్ళను చంపుతున్నారు. ఆడవాళ్ళ మానాలు దీస్తున్నారు. గొర్రెల్ని, మేకల్ని తోలుకపోతున్నారు.

క్యాంపులో రోజూ విందులు జరుగుతు న్నాయ్. పట్నంనుండి పోలీసు అధికారులు, రజాకార్ల నాయకులు, దొరలు- దేశము ఖులు వచ్చిపోతున్నారు.

పెద్ద విందుకు ఏర్పాట్లు జరుగుతు న్నాయ్.

★ ★ ★

దట్టమైన అడవి-

గుట్టలు, చెట్లు, మధ్యలోయలు.

కొండమీదినుండి సెలయేరు పారుతు న్నది.

ఎత్తైన కొండ రాతిబండమీద దళాలు కలుసుకుంటున్నాయ్. నాలుగు వైపుల నుండి అక్కడికి చేరుతున్నాయ్. ఒక దళం తోపాటు శకుంతల వచ్చింది. మరో దళంలో చంద్రమ్మ, లచ్చుమమ్మ మరికొం దరు మహిళలున్నారు. ఎదురుగా వున్న రవిని చూసిన శకుంతల ఆనందం అంతింతా కాదు. అంగలో వెళ్లి అతని కౌగి లిలో వాలాలని వుంది. రవికి కూడా అలాగే వుంది. కానీ- అది సమయం కాదు- సందర్భం కాదని ఇద్దరూ మనసు నిబ్బరప రుచుకున్నారు.

శకుంతల వెళ్ళి అతని పక్కనే కూర్చు న్నది.

వాళ్ళందరికీ రామారం గ్రామ దళస భ్యులు సత్తిరెడ్డి, లతీఫ్ వగైరాలు భోజన ఏర్పాట్లు చూస్తున్నారు. వండిన వంటకాలు బుట్టల్లో వూరినుండి వస్తున్నాయ్. కొందరు మోదుగు ఆకులు కోసుకొస్తున్నారు. చంద్రమ్మ, లచ్చుమమ్మ విస్తళ్ళు కుడుతు న్నారు.

రాష్ట్ర నాయకునితోపాటు, గెరిల్లాలందరూ రవిని అతను ఎలా తప్పించుకున్నదీ అడిగి తెలుసుకుంటున్నారు.

చల్లని, తెల్లని వెన్నెల కాస్తున్నది. అందరూ విశాలమైన రాతిబండమీద చుట్టూ కూర్చుని భోజనాలు చేశారు.

సమావేశం మొదలయ్యింది. రాష్ట్రనాయ కుడు రంగన్న రిపోర్టు అందరూ శ్రద్ధగా వింటున్నారు.

"కామ్రేడ్స్,

నిజాంపాలన యింకెంతో కాలముండదు. నాలుగు వైపులనుండి మన గెరిల్లాదళాలు కమ్ముకొస్తున్నాయి. గ్రామాలన్నీ విముక్తిచేసి ప్రజారాజ్యాలు స్థాపించారు. దోపిడిదార్లంతా పట్నాలకు పారిపోయారు. మన పోరాటం అంతిమదశలో వున్నది. శత్రువు ఆయువు పట్టయిన పట్టణాలను పట్టుకోవాలి. దానికి మన శక్తి పెంచుకోవాలె. శత్రువు దగ్గర అధునాతన ఆయుధాలున్నాయ్. ఎక్కడెక్క డనుండో వస్తున్నాయ్. మనవద్ద వున్న ఆయుధాల శక్తిని, సంఖ్యను పెంచుకోవాలి. అవి ఎక్కడనుండో రావు- వాటిని శత్రువు

నుండే పొందాలి. శత్రుశిబిరాలపై మెరుపు దాడులు చేసి వశం చేసుకోవాలి. ఇంకా అక్కడక్కడ యీ రామారాంలో వున్నట్లు కొన్ని క్యాంపులున్నాయి. ముందుగా మనం వాటిని బద్దలుకొట్టాలి. శత్రువులు పారిపోవడం- ఆయుధాలు లభించడం ఏకకాలంలో జరుగుతాయ్. రేపురాత్రి రామారం క్యాంపు మన వశం కావాలి. దానిక్కావలసిన ఏర్పాట్లన్నీ లింగన్నదళం చేసింది. వివరాలు తర్వాత చెపుతారు. చివరిగా మరో విషయం- చాలా ముఖ్యమైన విషయం. మన పోరాటం నిజాం పాలనకు వ్యతిరేకం- ముస్లింలకు వ్యతిరేకం కాదు. మన శత్రువు, అలాగే కొందరు స్వార్థపరులు దీన్ని హిందూ-ముస్లింల పోరాటంగా చిత్రిస్తున్నారు. పేదవాళ్ళ మధ్య చీలికలు తేవాలని చూస్తున్నారు. మన ఉద్యమంలో ఎంతో మంది ముస్లింలున్నారు. నాయకులున్నారు. రేపో మాపో నిజాం సేనలు, రజాకార్లు పారిపోక తప్పదు. అప్పుడు వాళ్లు మరిన్ని ఘోరాలు చెయ్యొచ్చు. దానికి ప్రతీకారంగా ప్రజలు అమాయకులైన ముస్లిం ప్రజలపై దాడులు చెయ్యొచ్చు. రజాకార్లు రాక్షసత్వం చేశారని- మన అక్కచెల్లెళ్ల మానాలు తీశారని-కోపోద్రేకంతో ప్రజలు ఏమైనా చెయ్యొచ్చు. రజాకార్లు ప్రాణభయంతో చివరకు తల్లిదండ్రులను, భార్యాపిల్లలను, ఆప్త బంధువులను కూడా వదిలేసిపోవచ్చు. అందువల్ల కామ్రేడ్స్, మనం తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. అటువంటివాళ్లకు రక్షణ కల్పించాలి. విజయం మనది- విప్లవం వర్ధిల్లాలి"

అంటూ ఉపన్యాసం ముగించాడు. సమావేశం ముగిసింది. రాతిబండమీద ఎక్కడి వాళ్లక్కడ చేతి సంచులు తలదిండ్లుగా చేసుకొని పడుకున్నారు. మహిళాసభ్యులంతా ఒక పక్కన చేరారు. ఏదో గుసగుసలాడుతున్నారు. రెండువైపుల ఇద్దరు దళసభ్యులు సెంట్రీ కాస్తున్నారు.

లచ్చుమమ్మ గొంగలి తీసికెళ్లి దూరంగా పొదలచాటున పరిచింది. చంద్రమ్మ, శకుంతలను అక్కడికి తీసికెళ్ళింది. లచ్చుమమ్మ వచ్చి రవిని పక్కకు పిలిచింది.

"శకుంతలగారు పిలుస్తున్నారు" అన్నది.

"ఎక్కడున్నది? దేనికి? " కొంచెం సిగ్గుపడుతూ అన్నాడు రవి.

"రండి చెపుతా!" అని ఆవైపు తీసుకెళ్ళింది లచ్చుమమ్మ.

రవిని చూసి లేచి నిలబడింది శకుంతల.

వాళ్లిద్దర్ని ఒంటరిగా వదిలి, వెనక్కుమళ్లింది లచ్చుమమ్మ. తామిద్దర్ని కలపాలని ఆడిన నాటకమని అర్థం చేసుకుని అందుకు సిగ్గుపడుతున్నారు. ఒంటరిగా కలుసుకునే అవకాశం దొరికినందుకు మనస్సుల్లో సంతోషిస్తున్నారు.

శకుంతల సిగ్గుపడుతూ "కూర్చోండి" అన్నది.

అతను కూర్చున్నాడు. అతనితోపాటు శకుంతల పక్కనే కూర్చున్నది.

ఒకరినొకరు చూపుల్తోనే పరామర్శించుకుంటున్నారు. కాలం గడుస్తోంది. ఆ నిశ్శబ్దాన్ని తొలగిస్తూ రవి అన్నాడు...

"శశీ! ఇది కలో- నిజమో నమ్మలేకపోతున్నా! ప్రాణంతో బయటపడతాననీ. తిరిగి నిన్ను కలుసుకుంటాననీ అనుకోలేదు"

"అంతా దీని మహిమ!" మంగళసూత్రం చూపుతూ చమత్కరించింది శకుంతల. ఇద్దరు నెమ్మదిగా నవ్వుకున్నారు.

"సతీసావిత్రిలాగ శపథం నెరవేర్చుకున్నావన్నమాట"

"కాదామరి? "

"మహమూద్ సహాయపడకపోతే ఇప్పుడు నేనెక్కడుండేవాణ్ణో? " గుర్తు చేసుకున్నాడు రవి.

"ఎవరా మహమూద్? తన ప్రాణానికి తెగించి నీ ప్రాణం కాపాడిన మహానుభా

వుడు? "

"అతనే! ఆరోజు నిన్ను ఇంటర్వ్యూకు తీసుకొచ్చిన జమేదార్"

"నిజంగానా? ఆరోజు కూడా అతనెంతో అభిమానం చూపాడు"

"ఆ తర్వాత ప్రతిరోజు నన్ను పలకరించేవాడు. రాజకీయాలు చర్చించేవాడు. రహస్యంగా పత్రికలు తెచ్చియిచ్చేవాడు. కానీ- ఇంత సాహసం చేస్తాడనుకోలేదు. జైలు నుండి బయటకి వస్తున్నప్పుడే- సూచనగా చెప్పాడు. నీ ప్రాణం కాపాడటానికి అవసరమైతే నా ప్రాణమిస్తానన్నాడు. అన్నట్లే నన్ను పారిపొమ్మని దారిచూపి, పోలీసులను తప్పుదారి పట్టించి నా ప్రాణం కాపాడాడు... ఉరికంబానికి ఎక్కబోతున్నానని తెలిసి కూడా నాచేత తాళి గట్టించుకున్నావు నువ్వు. ఉరితాడు నా మెడలో పడకుండా చేసి- తన ప్రాణానికే ముప్పు దెచ్చుకున్నాడు మహమూద్... వ్యక్తిగా నామీద అభిమానంతో కాదు- ఉద్యమం ఎడల అతనికున్న అభిమానంతో చేశాడు" అన్నాడు రవి బాధగా.

"చాలా రాత్రయ్యింది" అన్నది శకుంతల.

"అవును. కామ్రేడ్సు అంతా అక్కడున్నారు. మనమిద్దరం ఇలా వొంటరిగా వుండటం మంచిదికాదు!" అని లేవబోయాడు రవి.

"భార్యాభర్తలు కలుసుకోవడం తప్పా? " అడిగింది అమాయకంగా.

తప్పనికాదు. పార్టీలో కొన్ని క్రమశిక్షణలు పాటించాలి"

"క్రమశిక్షణకు భిన్నంగా మనమేం చేశాం. పైగా ఆ మహిళా కామ్రేడ్సేగదా మనిద్దరిని ఇక్కడికి చేర్చింది"

"కానీ..." ఏదో అనబోయాడు రవి.

"కానీ లేదు. అర్థణాలేదుగని కూర్చోండి." అతని చేయిబట్టి లాగి కూర్చోబెట్టింది.

"యేమయ్యోయ్. నీవు నాయకుడివిగావచ్చు నేను కార్యకర్తను గావచ్చు- కానీ... నేను నీ భార్యనన్నది మరిచిపోవద్దు" చిలిపిగా అతని కళ్ళల్లోకి చూస్తూ అన్నది.

"యేమిటి అట్ల చూస్తున్నావ్? "

"చూడొద్దా! చూపులక్కూడా హద్దుందా? " రవి బుగ్గ గిల్లుతూ అంది శకుంతల చిలిపిగా.

"నువ్వట్లా చూస్తే... నాకెట్లాగో వుంటుంది? " ఆమె కళ్ళల్లో కళ్లు కలుపుతూ అన్నాడు.

"యెట్లాగుంటది? " అతని చేయి గట్టిగా నొక్కింది.

"చెప్పనా? ఇదిగో యిట్లా... బంధించాలని" అంటూ గట్టిగా కౌగలించుకున్నాడు.

పండువెన్నెల కాస్తున్నది. ప్రకృతి ప్రశాంతంగా వున్నది. చెట్లు, అడవిలోని రకరకాల మొక్కలు తలలాడిస్తూ, చల్లని సువాసనలు వెదజల్లుతున్నాయ్. రవి, శకుంతల రాతి బండమీద వెల్లకిలా పడుకొని ఆకాశంవైపు చూస్తున్నారు. ఆత్మీయత, అనురాగం పంచుకుంటున్నారు.

"శశీ! నా మూలంగానేగదా నీకిన్ని కష్టాలు? బంగళాలో వుండేదానివి- పట్టెమంచమ్మీద పడుకునేదానివి- అడవుల్లో తిరుగుతూ- రాతిబండలమీద పడుకుంటున్నావ్! మాతోపాటు ప్రాణానికి తెగించి పోరాడుతున్నావ్? "

"ఆ జీవితం యాంత్రికం- మనిషికి ఆనందాన్ని, తృప్తినిచ్చేది మేడలు- పరుపులు కావు. మనసుకు నచ్చినవే సంతృప్తినిస్తాయి. అయినా ఇప్పుడు నాకేం లోటు వచ్చింది? ఇంత ప్రశాంత వాతావరణం, ప్రకృతి వొడిలో మనసున్న మనుషుల మధ్య వున్నందుకు ఎంతో ఆనందంగా వున్నది. ఒక విప్లవకారుడి భార్యగా, విప్లవంలో ఒక సైనికురాలిగా విప్లవోద్యమంలో పాత్రధారినైనందుకు గర్వపడుతున్నాను" అన్నది.

"శశీ! రాజకీయంగా నువ్వెంతో ఎది గావు? నాకు చాలా గర్వంగా ఉన్నది"

"నిజంగా" అన్నది శకుంతల అతని గుండెలమీద తల ఆనిస్తూ.



పక్కనే అలికిడి విని లేచాడు రవి.

రాతిగుండు చాటున పొదలమధ్య ఏదో కదలిక గమనించాడు. నెమ్మదిగా దగ్గరికె ళ్ళాడు. నల్లని ఆకారం కదులుతున్నది. గొంగడి ముసుగులో వున్న మనిషని గ్రహించాడు. గబాలున ముసుగు తొలగించాడు.

మారయ్య దిగ్గున లేచి నిలబడ్డాడు. రవిని చూసి ఖంగారు పడుతూ చేతిలోని చుట్ట నేలమీద వేసి, నోటిలోని పొగను దిగ మింగాడు. అతని ముఖమంతా చెమటలు.

"క్షమించండి కామ్రేడ్- తప్పయ్యింది" అన్నాడు మారయ్య తలదించుకొని.

"తప్పు సంగతి తర్వాత, ముందు యిట్ల జేస్తే ప్రాణానికే ప్రమాదం!" అన్నాడు రవి.

"రాత్రిపూట చుట్ట, బీడి తాగితే- నిప్పు వెలుతురు, పొగ శత్రువులకు మన జాడ దెలుస్తదని తెలుసుగనీ... కుతికాగలేక జేసిన కామ్రేడ్. యింకెప్పుడు సెయ్యా" అన్నాడు మారయ్య.

"కామ్రేడ్సు... లేవండి. నాకేదో అనుమానంగున్నది" సెంట్రీలో వున్న సత్తిరెడ్డి గొంతు వినబడ్డది.

రవి, మారయ్య అక్కడికి చేరారు. దళస భ్యులందరూ గబాలున లేచి, తుపాకులు తీసుకున్నారు.

"ఏమయ్యింది! కామ్రేడ్!" రవి- సత్తిరెడ్డి నడిగాడు.

"అర్ధరాత్రికాడ- సెంట్రీలో వున్న ముత్తయ్య యిప్పుడే వస్తనని నాతో చెప్పిబో యాడు. ఇప్పటిదాకా రాలేదు. నాకేదో అను మానంగున్నది. రవిగార్ని పట్టిస్తే- ఇనాం దొర్కుతదని- కక్కుర్తిపడి- రహస్యం చెప్ప డాన్కి క్యాంపుకు బోయిండేమోనని నా అను మానం" అన్నాడు ఆదుర్దాగా సత్తిరెడ్డి.

"నీకెప్పుడు గిట్లాంటి అనుమానాలే వస్తయ్. ముత్తయ్య గట్లెప్పుడు జెయ్యడు" లతీఫ్ అన్నాడు.

"రైఫిల్ తీసుకెళ్ళిండా? " రంగన్న అడిగాడు.

"లేదు నాకే ఇచ్చిపోయిండు" సత్తిరెడ్డి అన్నాడు.

"ద్రోహం చేసేవాడైతే- ఆయుధం తీసుకెళ్ళేవాడు... అయినా మన జాగ్రత్తలో మన ముండాలి" అన్నాడు రవి.

గెరిల్లా దళనాయకుడు రంగన్న ఆర్డర్ ప్రకారం- అందరూ ఆయుధాలు- తీసుకొని అటెన్షలో నిలిచారు.

ఇంకా పొద్దుపొడవలేదు. మంచుతో భూమంతా కప్పేసివున్నది. దూరం కనిపించడంలేదు. చెట్టుమీద వుండి సెంట్రీ చేస్తున్న యాదగిరి వూరివైపు మార్గం పరిశీలనగా చూశాడు.

"కామ్రేడ్ ముత్తయ్య వస్తున్నడు" అని హెచ్చరిక చేశాడు.

"ఒక్కడేనా? వెనకాలెవరైన వున్నరా? " అడిగాడు లింగన్న.

"యెవర్లేరు! ఒక్కడే!" సమాధానం చెప్పాడు యాదగిరి.

"కామ్రేడ్ యాదగిరి నీవు పొజిషన్ మార్చి- జాగ్రత్తగా చూడు. కామ్రేడ్సు మీరంతా పక్కకు జరిగి పొజిషన్ను తీసు

కొండి. ఎవరూ తొందరపడొద్దు. నా ఆర్డర్ లేకుండా కాల్పులు జరుపొద్దు" లింగన్న కమాండర్‌గా ఆర్డర్ ఇచ్చాడు. తన వద్ద అదనంగా వున్న రివాల్వర్ తీసి రవికిచ్చి, తాను స్టెన్‌గన్ చేతిలోకి తీసుకున్నాడు. అందరూ పొదలచాటున, రాళ్ళచాటున పొజిషన్సులో కూర్చున్నారు.

ముత్తయ్య పరుగెత్తుకుంటూ వచ్చి, దళ మున్న ప్రదేశాన్ని పరిశీలనగా చూశాడు. ఎవరూ కనిపించనందుకు ఖంగారుపడుతూ ఆయాసంతో వూపిరాడకుండా వున్నాడు.

లింగన్న గబాలున వెళ్ళి అతని జుట్టు పట్టుకున్నాడు. ఖంగుతిన్న ముత్తయ్య కెవ్వు మన్నాడు. దళసభ్యులందరూ చుట్టేశారు.

"ఎక్కడికి బోయినవ్? వెనకాల మిలటరీ ఏమైనా వస్తుందా? నిజం చెప్పు!" గద్దించి అడిగాడు లింగన్న.

"మిలిట్రేంది కామ్రేడు? " బిత్తరబోయి అన్నాడు ముత్తయ్య.

"మరెక్కడికి బోయినవ్? " ప్రశ్నించాడు లింగన్న.

"డబ్బుకోసం గడ్డితిని- విప్లవద్రోహానికి తలపడ్డవా? " అడిగాడు రాష్ట్ర నాయకుడు రంగన్న.

ముత్తయ్య కళ్ళెంట బొటబొట కన్నీళ్లు రాలినయ్. మాట పెగల్లేదు. గద్గద స్వరంతో,

"పమాణం చేసి సెపుతున్న. పానంబో యిన పార్టీకి ద్రోహం చెయ్యను. గిట్లెందుకు అనుమానిస్తున్నరు? " బావురుమన్నాడు.

ముత్తయ్య అమాయకత్వం, వ్యక్తిత్వం తెలిసిన లచ్చుమమ్మ, దగ్గరగా వచ్చి- "యేం ముత్తన్న వదినను చూడటాన్కి పోయి నవా? " అని అడిగింది.

అవునన్నట్టు తలూపి, సిగ్గుతో తలదించు కున్నాడు ముత్తయ్య.

"నిజమేనా? " అడిగాడు లింగన్న- పట్టు కున్న జుట్టు వదులుతూ.

"మరింతసేపు ఏంజేసినవ్? " అడిగాడు సత్తిరెడ్డి.

"ఎవరు చూడలేదుగదా? " అడిగింది చంద్రమ్మ.

"మీరేమనుకోనంటే జరిగిందంత చెప్పుత!" అన్నాడు ముత్తయ్య.

"ప్రమాదమేమీ లేదుగదా? " మళ్ళీ అడి గాడు లింగన్న.

"యే ప్రమాదం లేదు. నేనే ప్రమాదంలో పడ్డ" అన్నాడు ముత్తయ్య

"ఇంతకేం జరిగిందే? " ఆసక్తిగా అడిగింది లచ్చుమమ్మ.

ముత్తయ్య పెండ్లి అయ్యి సంవత్సరమే అయ్యింది. భార్య తల్లిగారింటికాడ రామా రంలోనే వుంటున్నది. వూరికి దగ్గరలోనే వున్నందున- ఆమెను కలవాలనే కోరిక కలి గింది. అక్కడ పోలీసు-రజాకార్ల క్యాంపు న్న సంగతి- రేపు దానిమీద తాము దాడి చేయబోతున్న సంగతి దెలుసు. ఇల్లు వూరి బయటనే వున్నది. గుట్టుచప్పుడు లేకుండా పోయొద్దామనుకున్నాడు. సత్తిరెడ్డికి ఆ విషయం చెప్పితే ఏమంటడోనని, కాల కృత్యం పేరుతో అబద్ధం చెప్పి బయటప డ్డాడు.

తలగుడ్డ చుట్టుకొని, గొంగడి కప్పుకొని అంగలేసుకుంటూ ఎవరికంట బడకుండా గూడెం చేరాడు. వూరిబయట హరిజనవాడ గాఢనిద్రలో వున్నది. గూడెంనిండా కుక్కలు- గుడిసెకొక్కటైనా వున్నయ్. చిన్న అలికిడైనా బొయ్యిమంటున్నయ్. అప్పుడ ప్పుడు ఒకదాని గొంతు విని అన్నీ గొంతులు కలుపుతున్నయ్. వాటికంట బడితే- కొంకెలు కొరికేస్తయ్- గుట్టు రట్టు చేస్తయ్- పొంచి పొంచి వాటికంటబడ కుండ గుడిసె దగ్గరికి చేరాడు ముత్తయ్య.

గోడమీదినుండి లోపలికి తొంగిచూశాడు. ఖాళీస్థలంలో ఇంటిముందు మామ రామి గాడు నులకమంచమ్మీద గురక దీస్తు న్నాడు. ముత్తయ్య వెన్నెల వెలుతురులో

నిక్కినిక్కి చూస్తున్నాడు. గుడిసెలోపల తన భార్య, అత్తలను చూశాడు. వాళ్ల సగం శరీరాలు వెన్నెల కాంతిలో కనిపిస్తున్నయ్. వాళ్ళిద్దరు ముసుగుబెట్టి గాఢనిద్రలో వున్నారు. రామిగాడి మంచంకింద పడుకున్న కుక్కకు అలికిడి వినిపించకుండా నెమ్మదిగా గోడ దూకాడు. అత్త, భార్య పక్కపక్కన పడుకున్నాడు. చీరెను బట్టి తన భార్యను గుర్తుబట్టాడు ముత్తయ్య. భార్యను నిద్రలేపడానికి చేయితో కదిపాడు. చెవిలో చెప్పాడు. ఆమె మొండినిద్రకు కోపమొచ్చి కాలును గట్టిగా తొక్కాడు.

"ఓయ్మో! ఓయ్యో! దొంగ దొంగ" అని దిగ్గున లేచి బిగ్గరగా అరిచింది ముత్తయ్య అత్త యల్లమ్మ.

మంచం దగ్గర కుక్క భౌవ్వుమన్నది.

ముత్తయ్య గుండె గుభేల్ మన్నది. అంగలో గోడదూకి పరుగందుకున్నాడు. రామిగాడు లేచి కర్రందుకున్నాడు.

గూడెంలో కుక్కలన్నీ గొల్లుమన్నాయ్ చుట్టుపక్కలోళ్ళంతా లేచి వచ్చారు. ముత్తయ్య అత్త, భార్య, మెడలోని మంగళసూత్రం- కాళ్ళకడియాలు- చెవిపోగులు చూసుకున్నారు. దొంగ ఏమీ ఎత్తుకుపోలేదని సంతృప్తిపడ్డారు.

"ఎటు పొయ్యిండు? ఎట్లున్నడు? " అడిగాడు రామిగాడు భార్యను.

"ఎట్లున్నడో నేనెక్కడ జూసిన! సచ్చినోడు సీకట్ల కాలుదొక్కిండు. కండ్లు దెరిసేసరికి గోడదూకిండు" అన్నది యల్లమ్మ.

"యేమన్న ఎత్తుకపోయిండేమో సూడు" రామిగాడు అన్నాడు.

"యేముంది పోవడాన్కి- ముదనష్ట పోడు- మెడల్లోని నల్లబూసల గొలుసులు- కాళ్ళ కడియాలకు ఆశపడుంటడు" అన్నదామె.

చుట్టుపక్కలవాళ్ళంతా తమతమ గుడిసెల్లోకి పోయారు.

రామిగాడు నులకమంచమ్మీద కూలబడి చుట్ట ముట్టించాడు.

★ ★ ★

ఎవరొదిలినా కుక్కలు మాత్రం ముత్తయ్యను వొదల్లేదు. రామిగాడి కుక్క, దానికితోడు మరో రెండు కలిసి వెంటబడుతున్నయ్. దొరికితే కండలు తీసేట్లున్నయ్. కుక్కల అరుపులు పోలీసులకు అనుమానం కలిగిస్తయ్యో- ప్రమాదం తెచ్చి పెడ్తయ్యోనన్న భయమెక్కువయ్యింది. కంప, కట్టె, లెక్కచేయక పొలాల వెంట పరుగుదీస్తున్నాడు. బురదపొలంలో పడుతూ, లేస్తూ వెనక్కు తిరిగి చూస్తూ పిక్కబలమంతా చూపుతున్నాడు. అలిసిపోయి- సొమ్మొచ్చినట్లవుతున్నది. కుక్కలు వదిలేటట్లు లేవు. అటు ఇటూ చూసి- ఎదురుగున్న చెట్టెక్కి కొమ్మల్లో కూర్చున్నాడు. దగ్గరికొచ్చిన కుక్కలు అంతట చూసి, అక్కడెక్కడో వున్నాడని పసిగట్టి- అక్కడే తిష్టవేసినయ్. అరుపులు మానేసి- మెరిసే కళ్లతో చూస్తున్నయ్.

చెట్టుమీద ముత్తయ్య శ్వాసబిగబట్టి కూర్చున్నాడు. చేసిన పొరపాటుకు "తోబా-తోబా" అని చెంపలేసుకుంటున్నాడు. భార్యను చూడాలన్న బుద్ధెందుకు పుట్టింది? చీరను చూసి పొరబడి అత్తకాలు తొక్కినందుకే ఇంత జర్గిందనుకుంటున్నాడు. ఖర్మ కాలి జనం పట్టుకుంటే- నిజంగానే దొంగను కొని చితకగొట్టేవాళ్ళు. గొడవ విని పోలీసులొస్తే ఏమయ్యేది? తలుచుకుంటేనే భయమేస్తున్నట్లు ఆలోచిస్తున్నాడు. ఇంకా ప్రమాదం పోలేదు. ఈ కుక్కల బెడద వదిలేదెట్లని చింతిస్తున్నాడు.

తెల్లారబోతున్నది. గూడెంలో కుక్కలు మొరుగుతూ- రాగాలు తీస్తున్నాయ్. చెట్టు కిందున్న కుక్కలు అది విని- తోకలాడిస్తూ గూడెం వంక వురికినయ్.

ముత్తయ్య వూపిరి పీల్చుకొని గబగబ

చెట్టుదిగాడు. పరుగుతో దళాన్ని చేరుకు న్నాడు.

జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పిండు ముత్తయ్య. అది విని దళసభ్యులందరు ఫక్కున నవ్వారు.

రవి-శకుంతల మాత్రం ముత్తయ్యకు ఆ కోరిక కలగడానికి తాము కూడా కారణమ నుకున్నారు.

లచ్చుమమ్మ- అతని అమాయకత్వానికి సానుభూతి తెలిపింది.

అక్కడ ముత్తయ్య అత్తగారింటి దగ్గర కూడా అట్లాగే జరిగింది.

నిద్రలేచిన ముత్తయ్య భార్య రంగి వాకి లూడుస్తూ గోడదగ్గర పడున్న చెప్పు చూసింది. పరిశీలనగా చూసి

"అయ్యా! యీ చెప్పు చూడు. ఆయంది లాగున్నదే? " అని తండ్రినడిగింది. రామి గాడు చెప్పు తీసుకొని తేరిపార చూసి,

"మన ముత్తయ్య చెప్పు. నేను కుట్టిందే" అన్నాడు.

"యీడికెట్లొచ్చిందే? " రంగి అడిగింది.

రామిగాడు అర్థంగాక బుర్రగోక్కుంటుం డగా లోపలినుండి రామిగాడి భార్య యల్లమ్మ గొంగడి బట్టుకొని బయటికొస్తూ, " ముదనష్టపోడు. దొంగతనమేం జేయక బోయిన, గొంగడొదిలేసి పోయిండు" అన్నది.

"ఇదీ ఆయందేనే? " ఆశ్చర్యంగా అన్నది కూతురు.

"అంటే రాతిరొచ్చింది దొంగకాదే! ముత్తయ్య" అన్నాడు రామిగాడు.

"అయ్యోపాపం! ఎంత పనయ్యింది! పాపి ష్టిదాన్ని గుర్తుపట్టక గోలబెట్టిన" అన్నది యల్లమ్మ చెంపలేసుకుంటూ.

★ ★ ★

రామారంలో రజాకార్ల క్యాంపు కోలాహ లంగా ఉన్నది. దొర గడి ఇప్పుడు రజాకార్ల క్యాంపు అయ్యింది. గడి ముందు తాటాకుల పందిళ్లేశారు. పట్నంనుండి కుర్చీలు, కప్పులు, వంటసామాన్లు, వంటవాళ్ళనూ తెచ్చారు. పొద్దుట్నించి వచ్చిపోయే వాళ్ళు- మోటార్ల చప్పుళ్లు! వూరంతా హంగామా జేస్తున్నారు.

గడిలో కోళ్ళు, యాటలు తెగుతున్నయ్. కల్లు కుండలు సారా పీపాలు దిగుతు న్నయ్. పట్నంనుండి బోగంమేళా దిగింది. షేర్వాణీలు చుడేదార్ పైజామాలు, కుర్తాలు, జుబ్బాలు, కుచ్చుటోపీలు జిన్నా క్యాప్‌లతో జనం దిగుతున్నారు. సలాంలు జేసుకుంటున్నారు. ఖైరీయతులు తెలుసు కుంటున్నారు.

ఊర్లో వాళ్ళెవ్వరూ బయటికొస్తలేరు. భయంభయంగా తలుపులేసుకున్నారు. నిప్పులమీద కాలుస్తున్న మాంసం కవా బులు, ఖైమా, బిర్యాని వంటల వాసనలు వూరంతా గుప్‌మంటున్నయ్.

చీకటిపడింది. దావత్ షురువయ్యింది. బస్- తాగేవాడు తాగుతున్నాడు. తినేవాడు తింటున్నాడు. కల్లు, సారా, బీర్, బ్రాందీ, ఎవడి క్యావాల్సింది వాడు మింగుతున్నాడు. కొందరు అన్నీ కలిపి కొడుతున్నారు. నిషాలో మునిగి తేలుతున్నారు. ఖుషీ ఖుషీగా జల్సా జేస్తున్నారు.

మేందీనుంచి వచ్చినవాళ్ళు కవాలి షురూ జేశారు. నవాబులు, దొరలు, రజాకార్ల నాయకులు మైకంలో వూగుతూ నజరా నాలు అందిస్తున్నారు. ఈలలేస్తున్నారు. గోలగోలగా అరుస్తున్నారు.

కొందరు నవ్వుతున్నారు. కొందరు వూగు తున్నారు. మరికొందరు కక్కుతున్నారు. కొందరు తిట్టుకుంటున్నారు. కొందరు గల్లలు పట్టుకుంటున్నారు. దూరంగా కొందరు ఏడుస్తున్నారు. కొందరు సోయి లేక పడిపోయారు.

పోలీసులు, రజాకార్లు, దావత్‌కొచ్చిన జమీందార్లు, జాగీర్దార్లు, దొరలు, దేశము ఖులు, పటేల్, పట్వారీలు నిషాలో

వున్నారు. వాళ్ళతోపాటు రౌడీలు కూడా తప్పతాగారు.

మస్కూరి కొండడు, చాకలి నారయ్య, మంగలి పిచ్చయ్య అదంతా గమనిస్తు న్నారు. "లంజకొడ్కులు యియ్యాల యాటలు తెగినట్లు తెగుతరు" కసినంతా చూపుతూ అన్నాడు పిచ్చయ్య.

చాకలి నారయ్య మస్కూరి కొండడికి కనుసైగజేశాడు. కొండడు బయటికెళ్ళాడు.

ఒక్కసారి ధన్‌ధన్‌మని తూటాల చప్పుడు వినబడ్డది "జై" అన్న నినాదం విన బడ్డది.

నిషా దిగి పరేషాను అవుతున్నారు దావ త్‌లో వున్నవాళ్ళు.

"అరే మర్గయా! బాగోబాగో"

"సంగం వాలే ఆగయా! జాన్‌బచావ్"

"అరె అల్లా ముజే బచావ్?"

"రక్షించు దేవుడా!"

"బాగో! బాగో! జాన్ బచావో!"

అరుపులు, కేకలు పెడుతూ చెల్లా చెదురై పోతున్నారు. బెదిరిన కోడి పుంజుల్లా బెక బెకమంటు అడ్డం దొడ్డం వురుకుతున్నారు. గోడలు దూకుతున్నారు. సందులు వెతుకు తున్నారు. బల్లలకింద దూరుతున్నారు. లుంగీలూడుతుంటే, పైజామాలు జారు తుంటే మోటార్ల దగ్గరికి వురుకుతున్నారు.

క్షణంలో మోటార్లన్నీ మాయమైనయ్. పటేల్ పాపిరెడ్డి, పట్వారి రామారావు అందరికంటే ముందే జారుకున్నారు. పట్నంనుండొచ్చిన బోగమోళ్ళగుంపు, వంటోళ్ళు, పనోళ్ళు గజగజ వణుకుతూ వంటింట్లో దూరారు. మంగలి పిచ్చయ్య వాళ్ళకు ధైర్యం చెపుతున్నాడు.

పారిపోలేక మిగిలిపోయిన రజాకార్లు, పోలీసులు గడిలో అక్కడక్కడ నతికి కూర్చున్నారు. సంగం వాళ్ళచేతుల బడితే సఫా చేస్తారని మొండి ధైర్యంతో తుపాకు లెక్కుపెట్టారు.

గెరిల్లాలు గడిని చుట్టేశారు. గడి దర్వాజా తెరిచి వాళ్ళెక్కడ నతికిందీ సైగతో చూపించాడు చాకలి నారయ్య.

ముత్తయ్య గబగబా మెట్లెక్కుతున్నాడు. అతని వెనకాల మారయ్య వున్నాడు. పైనుండి తూటాలు దూసుకొస్తున్నయ్. ముత్తయ్య పైకి చూశాడు. నిక్కి చూస్తున్న వాళ్ళను గురిపెట్టి ఒక్కొక్కణ్ణి నేల కూల్చాడు. ఆవేశంగా ముందుకు పోతు న్నాడు. అతనితో పాటే మారయ్య వున్నాడు.

అంతలో ఓ శత్రు తూటా ముత్తయ్య గుండెలో నుండి పోయింది. ఇంకొకటి మారయ్య తొడలో పడింది. ఇద్దరూ మెట్ల మీద పడిపోయారు. సత్తిరెడ్డి, లతీఫ్, లచ్చు మమ్మ గోడదాపుగా పోయి ఇద్దర్నీ కిందికి ఎత్తుకొచ్చారు.

ముత్తయ్య గుండెకు పెద్ద రంధ్రమ య్యింది. రక్తం ధారలా కారుతున్నది. అతని కళ్ళు మైకం కమ్మినట్లున్నయ్. మారయ్య కంతప్రమాదం లేదు. ముత్త య్యను పడుకోబెట్టి గాయం దగ్గర రక్తం కారకుండా చేయడానికి, చీరకొంగు చింపి కట్టింది లచ్చుమమ్మ. బలవంతంగా కళ్ళు తెరిచి చూశాడు ముత్తయ్య.

"యెందుకన్న గిట్లజేసినవ్? యెనకా ముందు చూడకుండా ముందుకెందుకు బోయినవ్?" కంట తడిపెడుతూ అన్నది లచ్చుమమ్మ.

మూతబడుతున్న కనురెప్పలను బలవం తంగా నిలబెడుతూ చుట్టూవున్న కామ్రే డ్సును చూశాడు ముత్తయ్య.

"యిప్పుడేమయ్యింది? లంజకొడుకుల్ని నలుగుర్నేసిన. నేనొక్కన్ని చస్తేంది కామ్రేడ్. మీరందరున్నరుగద? పోరాట మంటే చంపకుండా చావకుండ ఎట్లుం టది? నా సంగతొదిలేసి గాళ్ళ సంగతి చూడండి. లంజకొడుకుల్ని ఒక్కడు మిగల కుండా చేయండి... గంతే... కమ్యూనిస్టు

పార్టీకి జై" అంటూ కన్నుమూశాడు.

గెరిల్లాలు వుగ్రులయ్యారు. లెక్కబెట్టి ఒక్కొక్కణ్ణి మట్టుబెడుతున్నారు. పది మందిదాకా ఖతమయ్యారు. మిగిలినవాళ్ళు చేతులేత్తేశారు.

గడిలో వున్న ఆయుధాలన్నీ తీసుకుని, చేతులెత్తినోళ్ళను తరిమేశారు. శత్రుశిబిరం కూలింది. ఆయుధాలు దొరికినయ్. కానీ ముత్తయ్యను పోగొట్టుకున్నామన్న విషాదంతో వున్నారు.

పోరాటంలో ముత్తయ్యా చనిపోయాడని తెలిసి అత్త, మామ, భార్య పరుగెత్తుకొచ్చారు. శవంమీదపడి భోరున విలపిస్తున్నారు. గెరిల్లా కమాండర్ లింగన్న, రాజకీయనాయకుడు రవి వాళ్ళను ఓదార్చుతున్నారు. వూరి జనమంతా చేరి కంట తడిబెడుతున్నారు.

ఆ రాత్రే ముత్తయ్యా అంత్యక్రియలు వూరి జనమంతా కదిలి చేశారు. గెరిల్లాలు తమ కామ్రేడుకు అంతిమ వీడ్కోలు చెప్పి ప్రయాణమయ్యారు. దొరికిన రైఫిళ్ళు కట్టలు గట్టుకొని, తూటాలు మూటలు గట్టుకొని మోసుకుపోతున్నారు. ఇద్దరు కామ్రేడ్సు గాయపడ్డ మారయ్యను ఎత్తుకుపోతున్నారు. అందరూ బరువులు మోస్తూ చకచకా నడుస్తున్నారు. తెల్లారేసరికి దూరం పోవాలని, పారిపోయిన వాళ్లు అదనపు బలగాలతో చుట్టుముట్టవచ్చని జాగ్రత్తపడుతున్నారు.

వందమంది దళం అడవిలోనుండి ముక్కుసూటిగా పోతున్నది. దారిలేదు. నేలరాలిన ఎండుటాకులు కాళ్ళకింద కరకరమంటున్నయ్.

"చప్పుడు కాకుండా బిరబిర నడ్వండి కామ్రేడ్స్"

ముందు నడుస్తున్న కమాండర్ లింగన్న వెనక్కు తిరిగి అన్నాడు.

ఎంత నెమ్మదిగా అడుగేసినా ఆకుల గల గల శబ్దం వినబడుతూనే వున్నది.

"గుసగుసలొద్దు కామ్రేడ్సు చెట్లక్కూడా చెవులుంటయ్ మరవద్దు" హెచ్చరించాడు మళ్ళీ కమాండర్.

కొందరు భుజాలమీద పెట్టుకుంటే కొందరు నెత్తిమీద బరువులెత్తుకున్నారు. రైఫిళ్ళ కట్ట భుజాన బెట్టుకొని నడుస్తున్నాడు లతీఫ్. ముళ్ళకంపలో కాలేసి ఆగి కంపదీసుకుంటున్నాడు.

అతని వెనకాల వున్న రవి...

"ఇక్కడ కాదు కామ్రేడ్ ముల్లు తీసుకునేది. మనం నడుస్తున్నదంతా ముళ్ళబాటే" అన్నాడు.

లతీఫ్ మాట్లాడకుండా బిరబిరా నడుస్తున్నాడు.

"యెక్కడో చప్పుడయితుంది" నెత్తిమీద మూటతో ఆయాసంగా నడుస్తూ అన్నది చంద్రమ్మ.

నక్కలు కూస్తున్నట్లుంది" అన్నాడు లతీఫ్.

"దగ్గర్లో వూరుందేమో!" అన్నాడు గోపయ్య.

"ఊరిదగ్గర కుక్కలుంటయ్‌గని నక్కలుంటయా? " అన్నది లచ్చుమమ్మ.

"కుక్కలైనా, నక్కలైనా పొద్దుపొడిచే సరికి స్థావరం చేరాలె" అన్నాడు లింగన్న. మాట్లాడకుండా నడుస్తున్నారు. లయబద్ధంగా అడుగులు పడుతున్నయ్.

"ఒక్కనిమిషం ఆగండి కామ్రేడ్సు మారన్న నాడి చూస్త" మధ్యలో నడుస్తున్న శకుంతల అన్నది.

ఎక్కడి వాళ్ళక్కడ ఆగిపోయారు.

నులక మంచంమ్మీద మారయ్యను పడుకోబెట్టి మోసుకొస్తున్న సత్తిరెడ్డి, యాదగిరి ఆగి, మంచం కిందికి దింపారు.

శకుంతల మారయ్య నాడి చూసింది.

"నాడి బాగున్నది. మత్తు మాత్ర యిచ్చాను. నిద్రలో వున్నాడు. ఫరవాలేదు. పదండి" అన్నది.

సత్తిరెడ్డి, యాదగిరి మంచం భుజాలమీ

దికెత్తుకుంటుండగా గోపయ్య,

"కాసేపు నేనెత్తుకుంట" అన్నాడు.

"నువ్వేం మోస్తవ్! నువ్వు నడిస్తే చాలు పద" అన్నాడు యాదగిరి.

మళ్ళీ కదం కలిపి నడుస్తున్నారు. వఱ్ఱె దారి- కాలుజారి చంద్రమ్మ పడబోయింది. పక్కనున్న లతీఫ్ పట్టుకున్నాడు. ఆమె నెత్తి మీద తూటాల మూటున్నది.

"నెత్తిమీది మూట జాగ్రత్త కామ్రేడ్! అది మన ప్రాణంకంటే విలువైనది" అన్నాడు రవి.

కొద్దిగా వెలుగొచ్చింది. లతీఫ్ కాలు భూమ్మీద మోపలేక కుంటుకుంటూ నడుస్తున్నాడు. రవి అది గమనించి అడిగాడు...

"యేమయ్యింది కామ్రేడ్! అట్ల నడుస్తున్నవ్? "

"యేం లేదు కామ్రేడ్. ముల్లు గుచ్చుకున్నది" లతీఫ్ చెప్పాడు.

"చెప్పులేమైనయ్? "

"తెగిపోతే దార్లో పారేసిన"

"ముళ్ళు బాగా యిరిగినట్లున్నయ్. ఆగు చూస్తా" రవి అన్నాడు.

"ఫర్వాలేదు కామ్రేడ్. ముల్లేంజేస్తయ్. గీ ముండ్లకు బయపడ్తెట్ల? " అన్నాడు లతీఫ్ మరింత వేగంగా నడుస్తూ.

★ ★ ★

ఆ ఊరు సింగారం పట్నానికి దగ్గర్లో దండు బాటలో ఉన్నది. అది జాగీర్దార్ జహంగీర్ జాగీరు. దానిప్రక్క వూర్లన్నీ జాగీరులోనే వున్నాయ్. సింగారంలో జహంగీరుకు కోటలాంటి ఇల్లుంది. జహంగీర్ రజాకార్ల పెద్దయ్యాడు. కోటలాంటి తన ఇల్లును రజాకార్ల క్యాంప్‌గా జేశాడు. వందలమంది రజాకార్లను పోగుజేసి మేపుతున్నాడు. వూర్ల మీదికి వుసిగొల్పుతున్నాడు.

వాళ్లు ఎన్నో వూర్లు దోచారు. ఎంతోమందిని చంపారు. ఎంతోమంది స్త్రీల మానాలు దీశారు. రాక్షసత్వానికి జహంగీర్ పేరుమోశాడు.

జాగీర్దార్లు, జమీందార్లందరూ వూర్లొదిలి పారిపోతున్నారని తెలంగాణమంతా సంగపోళ్ళ ఖబ్జా అయ్యిందని తెలుసుకున్నాడు. తన జాగీరు కాపాడుకోవాలని, తన పెత్తనం నిలబెట్టుకోవాలని, తన దోపిడి కొనసాగాలని, దానికోసం ఎంతకైనా తెగించాడు జహంగీర్. వూర్లనుండి పారిపోయొచ్చిన దొరలు, జమీందార్లు, పటేల్, పట్వార్లకు ఆశ్రయమిచ్చాడు. తన రజాకార్ల బలగాలకండగా సర్కారు ఫైజును తెప్పించుకున్నాడు. వూరంతా మిలటరీ, రజాకార్లతో నింపేశాడు.

పొద్దున్న లేస్తే వాళ్ళు కవాతులు చేస్తున్నారు. కత్తులు తిప్పుతున్నారు. బరిసెలు చూపుతున్నారు. గుర్రాలమీద సందుగొందులు తిరుగుతున్నారు. గడ్డాలు నిమురుతున్నారు. మీసాలు దిప్పుతున్నారు. కనిపించినోళ్ళను ఖబడ్దార్ అంటున్నారు. దారిలో వచ్చి పోయేటోళ్ళను పట్టుకొని హింసలు పెడుతున్నారు. అనుమానమున్నోళ్ళను పొడిచి చంపుతున్నారు.

అది చూసి వూరి జనమంతా బిక్కుబిక్కుమంటున్నారు. హిందువులు మరింత భయపడుతున్నారు.

జమీందార్ల జాగీర్దార్ల గుండెల్లో గుబులు పట్టుకున్నది. నిజాం రాజ్యం వుంటుందో వూడుతుందోనని దొరలంతా భయపడుతున్నారు. దేశానికి స్వాతంత్ర్యమొచ్చినా "నాది మాత్రం ఆజాద్ హైద్రాబాద్" అంటున్న నిజాం రాజు ఉస్మాన్ అలీఖాన్ ప్రకటనలు వింటున్నారు. మరో పక్క తెలంగాణమంతా వేల గ్రామాలు విముక్తి చెందినయ్. ప్రతి వూర్లో పంచ కమిటీలేర్పడ్డయ్. వెట్టిచాకిరి, దొరల రాజ్యం పోయింది. జమీందార్ల, జాగీర్దార్ల భూములన్నీ పేదప్రజలకు పంచుతున్నారు. ఎక్కడ చూసినా ఎర్రజెండాలెగురుతున్నాయ్. గెరిల్లాలు కదంతొక్కుతు

న్నారు. రేపో మాపో నిజాం పాలన కూలి పోతుందన్న వార్తలు వింటున్నారు. నిజాం నవాబుకు, భారత ప్రభుత్వానికి మధ్య రాజీ సంప్రదింపులు జరుగుతున్నాయని తెలుసు కున్నారు. మున్షీ రాయబారం, పటేల్ ప్రక టనలు గమనిస్తున్నారు.

జాగీర్దారు జహంగీర్ రజాకార్ల నాయుకు డేగాదు, సుబేదారుననుకుంటున్నాడు. అధి కారమంతా తనదేనని హుకుం చలాయిస్తు న్నాడు. జరగరానిది జరిగితే పారిపోవడా నికి ఏర్పాట్లు చేసుకొని మూటా ముల్లె సిద్ధంగా ఉంచుకున్నాడు.

★ ★ ★

రామారం వూరినిండా పచ్చని మామిడా కుల తోరణాలున్నాయి. ఎర్రజెండా లెగురు తున్నాయి. చుట్టుపక్కల వూర్లనుండి జై కొడుతూ జనం తండోపతండాలుగా వస్తు న్నారు. డప్పులు, కొమ్ములు, బాజా భజంత్రీ లతో కోలాట నృత్యాలతో సంగం నాయకు లకు స్వాగతం చెప్పుతున్నారు. బంతి, చేమంతి, మల్లెపూలు, మందారం దండలేస్తు న్నారు. ఆనందంతో పాటలు పాడుతూ, నినాదాలు చేస్తూ వూరేగింపు జరిగింది. గడి దగ్గర సభ జరుగుతున్నది.

అరుగెక్కి రవి ఉపన్యసిస్తున్నాడు.

"మన విజయం సమీపిస్తున్నది. తెలంగా ణమంతా విముక్తి జరిగి గ్రామరాజ్యాలేర్ప డ్డయ్. పదిలక్షలెకరాల బంజరు, పొరం బోకు, అక్రమంగా దొరలు, దేశముఖులు జమీందార్లు, జాగీర్దార్లు ఆక్రమించుకున్న భూములు పేదలకు పంచిపెట్టబడ్డయ్. దోపిడి దార్లంతా పారిపోయింద్రు.

హైదారాబాదులో మాత్రం నిజాం పాలన సాగుతున్నది. నిజాం గద్దె కూల్చడా నికి, ప్రజారాజ్యం స్థాపించడానికి మన పోరాటాన్ని వుధృతంచేశాం. సాయుధులైన మన గెరిల్లా యోధులు అంతిమ పోరాటా నికి సిద్ధమవుతున్నారు. ఇప్పటికే నిజాం కోరలు పీకేశాం. రజాకార్ల తోకలు కత్తి రించాం. ఇప్పుడు మన శక్తినంతా వొడ్డి నిజాం నిరంకుశపాలనకు గోరికట్టాలి. ముక్కోటి ఆంధ్రుల చిరకాల వాంఛ విశా లాంధ్రలో ప్రజారాజ్యం స్థాపించాలి. అందుకు ప్రతి ఒక్కరు ప్రతినబూనాలి" అన్నాడు.

నినాదాలు మిన్నుముట్టినయ్.

"కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్"

"ఆంధ్రమహాసభ జిందాబాద్"

"విప్లవం వర్ధిల్లాలి"

సభ ముగిసింది.

అప్పటివరకు దూరంగా నిలబడి ఉప న్యాసం వింటున్న శాంతమ్మ దగ్గరికొచ్చింది. రవిని తనివితీరా చూసుకున్నది.

"ఏమమ్మా! ఎట్లున్నవ్? నాయన ఎట్లు న్నడు? " అడిగాడు రవి.

"బాగానే వున్నాం. అదిగో మీ నాయన కూడా వచ్చిండు. అక్కడ నిలబడ్డడు" అన్నది శాంతమ్మ.

శాంతమ్మను చూసి లచ్చుమమ్మ, చంద్రమ్మ, లతీఫ్ దగ్గరికొచ్చి నమస్కారం చేశారు.

"శకుంతలెక్కడ" లచ్చుమమ్మ నడిగింది శాంతమ్మ.

"రాలేదమ్మ! ఇప్పుడు వొట్టిమనిషి కాదు గదా! ఇంతదూరం నడవలేనని అక్కడే వున్నది" సమాధానం చెప్పింది లచ్చు మమ్మ.

తన కోడలు గర్భవతని తెలుసుకున్న శాంతమ్మ ఎంతో సంతోషపడింది. తల్లి వొడిలో నిద్రబోతున్న బాబును చూస్తూ రవి...

"ఏమమ్మా! వీడు బాగా అల్లరిచేస్తు న్నాడా? " అనడిగాడు.

"అల్లరికేం నాయన పట్టలేకపోతన్న. యిప్పటిదాకా అల్లరిచేస్తు, యిప్పుడే నిద్రబో

యిండు" అన్నది.

"పదమ్మా నాయన దగ్గరికి పోదాం" అని తండ్రి వున్నవైపు నడిచాడు రవి.

దగ్గరగా వెళ్ళి ఆప్యాయంగా పలకరించాడు. నర్సిరెడ్డి ఆనందంతో పులకించిపోయాడు.

"మళ్లీ నిన్ను చూస్తాననుకోలేదురా? అమ్మాయి శకుంతల బాగున్నదా? " అడిగాడు నర్సిరెడ్డి.

"కోడలు నీళ్ళుబోసుకున్నదట" ఆనందంతో చెప్పింది శాంతమ్మ.

"మరిక్కడికి రమ్మనకపోయినవ్. ఇంటికాడ వుండి ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకునే దిగద? ఎక్కడుందిప్పుడు? " కొడుకునడిగాడు నర్సిరెడ్డి.

"చెప్పితే వినిపించుకోదు. ఉద్యమంలోనే వుండాలంటుంది" రవి అన్నాడు.

"ఆమె ఒక్కతె లేక ఆగిపోద్దా! ఇంటికి పంపించు" అన్నాడు నర్సిరెడ్డి.

"అట్లాగే! మీ ఆరోగ్యమెట్లుంది? " తండ్రి నడిగాడు.

"నాకేం! మీ అమ్మ చాదస్తమే ఎక్కువయ్యింది. పొద్దున లేస్తే మిమ్మల్ని గుర్తుచేసుకుని, సుగుణను జ్ఞాపకం చేసుకొని శోకాలు పెడుతుంటది. ఎంతజెప్పినా యినదు. శకుంతలొస్తే ప్రశాంతంగుంటది? " చెప్పాడు నర్సిరెడ్డి.

"బజార్లోనే వుండి మాట్లాడుకుంటరా? ఇంటికి పోదాం పద నాయనా? " అన్నది శాంతమ్మ.

"లేదమ్మా! మేమెళ్ళిపోవాలే మళ్ళొచ్చినప్పుడు వస్తాను. మిమ్మల్ని చూశాను గదా!'' అన్నాడు.

"భోంచేసి పోదువు"

"అందరికీ భోజన ఏర్పాట్లు చేశారు. అక్కడే తింటాను. వస్తానమ్మా! వస్తాను నాయనా"అని వాళ్ళకు వీడ్కోలు చెప్పి కదిలాడు రవి.

యూనియన్ సైన్యాలు హైదరాబాదు రాష్ట్రంమీదికి దండెత్తి వస్తున్నాయన్న వార్తలొచ్చినయ్. కోదాడ దగ్గర సరిహద్దును దాటి అవి హైదరాబాదు రాష్ట్రంలో ప్రవేశించి ఫిరంగులు పేల్చినయ్. నిజాం సైన్యం, రజాకార్లు వణుకుతూ వెనక్కు మళ్ళి హైదరాబాదువైపు పారిపోతున్నారు. ఆ వార్త విని గెరిల్లా దళాలు రజాకార్ల కేంద్రాలపైకి తరలివస్తున్నాయ్.

అటుపక్క యూనియన్ సైన్యాలు, ఇటు పక్క గెరిల్లాలు, మధ్యన యిరుక్కుపోతామని ఖంగారులో నిజాం సేనలు, రజాకార్లు, ఆస్తిపాస్తులు భార్యాపిల్లల్ని వదిలి పారిపోతున్నారు. పోతూ పోతూ భీభత్సం చేస్తున్నారు. పారిపోతున్న రజాకార్ల అమాయక ప్రజల మాన, ప్రాణాలు తీయకుండా రక్షణ కవచంగా గెరిల్లా దళాలు కదులుతున్నాయి.

సింగారంలోని రజాకార్ల మూక రాక్షసత్వం చేస్తుందని తెలిసి గెరిల్లా దళం అక్కడికి చేరింది. రజాకార్ల కేంద్రమైన జహంగీర్ గడిని చుట్టేసింది. దళాన్ని చూసి గడిలోనుండి పదిమంది రజాకార్లు చేతులెత్తి బయటికొచ్చారు. ఆయుధాలు అప్పగించి దండం బెట్టారు. సంగపోళ్లు వచ్చారన్న వార్త దెలిసి వూరిజనమంత వచ్చారు. చాలామంది రజాకార్లు, మిలిటరోళ్ళు పారిపొయ్యారని చెప్పారు. పోయేటప్పుడు ఎదురొచ్చిన వాళ్ళను చంపేశారన్నారు.

వాళ్ళెందుకిట్ల జేస్తున్నారో, జరుగుతున్నదేమిటో రవి వాళ్ళకు వివరించాడు. "నిజాం నిరంకుశపాలన కూలిపోతున్నది. మన ఆశయం నెరవేరుతున్నది. మనకు స్వాతంత్ర్యం లభిస్తున్నది. యివ్వాలో, రేపు ఉదయానికో నిజాం రాజు లొంగిపోవడం, ఖాసిం రజ్వీ ఇతర రజాకార్ల నాయకులు పారిపోవడం ఖాయం" అన్నాడు.

ఆనందంతో జనం జై అన్నారు.

దళ సభ్యులనుద్దేశించి రవి అన్నాడు.

"కామ్రేడ్సు గడి వశమయ్యింది. రజాకార్లు, మిలటరీ పారిపోయారు. మిగిలిన వాళ్ళు లొంగిపోయారు. ఎక్కడెక్కడ దాగున్నారో తెలియదు. ఊరిలో అల్లర్లు జరగకుండా, మత ఘర్షణలు జరగకుండా చూడాలి. అమాయక ముస్లింలకు ఆవేశంతో ప్రజలు హాని చేయకుండా చూడాలి. వారి ఆస్తిపా స్తులు కాపాడాలి. మనం ఆ బాధ్యత చేప ట్టాలి. కామ్రేడ్ సత్యం నాయకత్వంలో దళ సభ్యులంతా వూరిలోకెళ్ళాలి. ఇక్కడ యీ గడి విషయం నేను యాదగిరి, గోపన్న, మారయ్య, కిష్టయ్య ఐదుగురం చూసు కుంటాం" అని కర్తవ్యం వివరించాడు.

"స్వతంత్ర భారతికి జై! కమ్యూనిష్టుపార్టీకి జై! ఆంధ్రమహాసభకు జై" నినాదాలు మిన్నుముట్టినయ్. కామ్రేడ్సు సత్యంతో పాటు శకుంతల, లచ్చుమమ్మ, చంద్రమ్మ, మిగతా దళసభ్యులంతా వూరివైపు నడి చారు. వారితోపాటు జనం కదిలారు.

గడి గేటుముందు సెంట్రీగా గోపన్నను ఉంచారు.

రవి తన దళసభ్యులతో కలిసి లొంగిపో యిన రజాకార్లను, ఆయుధాలను తీసుకొని గడిలోపలికెళ్ళాడు. ఎదురుగా వున్న గది లోకిలొంగిపోయిన వాళ్ళను పంపి బయట గొళ్లెంబెట్టాడు. గది బయట ఓ మూల ఆయుధాలుబెట్టి, అక్కడ సెంట్రీగా కిష్టయ్య నుంచున్నాడు.

రవి, యాదగిరి, మారయ్య లోపల సోదా చెయ్యడానికెళ్ళారు. రెండంతస్తుల పెద్ద బంగ్లా అది. కింద, మీద ఎన్నో గదులు పెద్దపెద్ద హాల్లున్నయ్. గదుల్లో ఎక్కడి వస్తువులు అక్కడే పడివున్నాయ్. తాగిన టీ కప్పులు బల్లలమీద తినకుండా వున్న వంట లున్నాయ్. సంచులు, సందుకలు అలాగే వున్నాయ్. అన్నీ వదిలి ఎందుకు పారిపో యారోనని ఒక్కొక్కటే పరిశీలనగా చూస్తు న్నారు.

"జాగర్త కామ్రేడ్సు లమ్డీకొడ్కులు యింకా గడిలోనే వున్నారు" అన్న గోపన్న కేక విని పించింది. ముగ్గురు పరుగుతో వచ్చి చూశారు. రక్తపు మడుగులో గోపన్న వున్నాడు. యాదగిరి వెళ్ళి గోపన్నను గోడ దాపుకు ఎత్తుకొచ్చాడు. కొన వూపిరితో వున్న గోపన్న ఏదో చెప్పాలనుకుంటు న్నాడు. మాట పెగలక వేలుతో గడిపై అంతస్తువంక జూపి కన్నుమూశాడు.

రవి, యాదగిరి, మారయ్య వుగ్రుల య్యారు. ఎక్కడ దాగినా, వాళ్ళ అంతం చూస్తామన్న శపథంతో మళ్లీ గడిలోకెళ్ళారు. అక్కడ కిష్టయ్య శవంగా మారి పడు న్నాడు. అతన్ని కత్తులతో పొడిచి చంపారు. గదిలోని రజాకార్లు పారిపో యారు.

యాదగిరి పళ్లు పటపట కొరికాడు.

"యెక్కడికి పోతరు లంజకొడ్కులు. యిక్కడెక్కడో దాక్కుంటరు" అన్నాడు ఆవే శంతో. ముగ్గురు ఆయుధాలెక్కుపెట్టుకొని గదులన్నీ వెతుకుతున్నారు. పైన గుసగు సలు వినబడ్డయ్. బంగ్లామీదికి రెండువై పుల మెట్లు కనబడ్డయ్. యాదగిరి, మారయ్య చెరో దారిన పైకెక్కుతున్నారు. కింద స్థంబం చాటున మాటుబెట్టుకొని రవి నిలబడ్డాడు. ఎదురుగా ఒకడు తలెత్తి నిక్కి చూస్తుండగా పిట్టను కాల్చినట్లు కాల్చాడు రవి. వాడు గావుకేక బెట్టు కిందబడ్డాడు. మెట్లమీదనుండొస్తున్న యాదగిరిని చూశారు రజాకార్లు. పిచ్చకేకలు పెడుతూ కాల్పులు చేస్తున్నారు. యాదగిరి గోడదా పుకు చేరి గురిపెట్టి యిద్దర్ని కూల్చాడు. హోరాహోరీ పోరాటం సాగుతున్నది. నిక్కి చూసిన వాణ్ణల్లా రవి నేలగూల్చుతున్నాడు.

యాదగిరివద్ద తూటాలైపోయినయ్. దారి చేసుకొని పారిపోవాలని రజాకార్లు గుంపుగా దాడిచేస్తున్నారు. మరో మార్గం లేదనుకున్నాడు యాదగిరి. రైఫిల్ మడమ ఎత్తి పట్టుకున్నాడు. వచ్చిన వాణ్ణి వచ్చినట్లు

తలబద్దలు గొడుతున్నాడు. వాళ్ళు మెట్లమీ దనుండి దొర్లిపడి ప్రాణాలు విడుస్తున్నారు.

యాదగిరిని దూరంనుండి జహంగీర్ కని పెట్టాడు. స్టెన్‌గన్‌తో యాదగిరి శరీర మంతా తూటాలతో నింపేశాడు.

"కమ్యూనిస్టుపార్టీకి జై" అంటూ యాద గిరి ప్రాణం విడిచాడు.



మరోపక్క మారయ్య గదులన్నీ గాలిస్తు న్నాడు. ఒక గదిలో పారిపోయిన వాళ్ళు మంచాలకింద దాక్కున్నది పసిగట్టాడు. ఒక్కణ్ణి హతమార్చగానే మిగతావాళ్ళు దారి కొచ్చి చేతులెత్తారు.

వాళ్ళను గుంపు చేసుకొని మారయ్య కిందికి తోలుకొస్తున్నాడు. వెనకనుండి ఒకడు పటపటమని కాల్చాడు. మారయ్య పొట్టలోనుండి, గుండెలోనుండి తూటాలు దూసుకుపోయినాయ్. గబాలున వెనక్కి తిరిగి చూశాడు. ఎదురుగా వున్నవాణ్ణి కసి కసిగా కాల్చి వాడిని నేలగూల్చి తాను వొరి గిపోయాడు.


Sivaji

పైన కాల్పుల శబ్దం ఆగిపోయింది. ఎదురుగా ఎవ్వరూ కనిపించడంలేదు. యాదగిరి, మారయ్య ఏమయ్యారోనని ఆదుర్దాపడ్డాడు రవి.

గబగబా పైకెళుతుండగా దుండగులు చూశారు. తూటాల వర్షం కురిపిస్తున్నారు. ఒక తూటా తొడలోనుండి దూరిపోయింది.

కాళ్లీడ్చుకుంటూ మొత్తకు ఒరిగాడు. వాళ్ళ వునికిని గమనిస్తూ నిశ్శబ్దం పాటించాడు. మెట్లమీద యాదగిరి పడివున్నాడు. మెట్ల కింద శత్రుశవాలు దొర్లిపడివున్నయ్.

ఎదురు కాల్పులు లేనందున విజయం తమదేనని రజాకార్లనుకున్నారు. అక్కడక్కడ నక్కినోళ్ళంతా దిగ్గున లేచి ఒక్క దగ్గరికి చేరారు. పకపకమని వెకిలి నవ్వులు నవ్వుతూ ముందుకొస్తున్నారు.

రవి స్టెన్‌గన్ ఎక్కుబెట్టి వరసబెట్టి కాల్చుతున్నాడు. పిట్టల్లా ఒక్కొక్కడు ఎగిరిపడుతున్నాడు. రవి మరింత ముందుకుపోతూన్నాడు. మిగిలినవాళ్ళు పక్కకు జరిగి రెండువైపులనుండి కాల్పులు జరుపుతున్నారు. రవి దెబ్బకు దెబ్బ సమాధానం చెప్పుతున్నాడు.

రవి తూటాలైపోయినయ్. క్షణమాలోచించాడు. అటూయిటూ చూసి ఎదురుగా శత్రుశవాలవద్ద పడున్న రైఫిళ్ళు చూశాడు. అంగలో దూకి ఆయుధం అందుకుంటుండగా యింకో తూటా భుజంలో దూరింది. తగిలిన గాయాల్ని లెక్కచేయక తెగించి ముందుకుపోయాడు. మిగిలిన యిద్దర్నీ మట్టుబెట్టి శత్రుశేషం లేకుండా అయ్యిందనుకున్నాడు.

గోడదాపుకు ఒరిగి గాయాలను చూసుకున్నాడు. రక్తం ధారగా కారుతున్నది. నేలంతా తడిసిపోతున్నది. కాలు, చేయి కదిలించడం కష్టమౌతున్నది. ఎడమ చేతిలో తగిలిన గాయాన్ని రక్తం కారకుండా కుడిచేతితో అదిమి పట్టుకున్నాడు.

పక్కన పొంచివున్న జహంగీర్ అది గమనించాడు. బిగ్గరగా వెకిలినవ్వు నవ్వి, పిచ్చెక్కినవాడివలె కాలుస్తున్నాడు. రవి శరీరం చిల్లులుపడింది. తలెత్తి చూశాడు. అతని కళ్ళు రక్తం చిమ్ముతున్నట్లున్నయ్. పళ్ళు పటపట కొరికాడు. పక్కన బెట్టిన రైఫిల్ అందుకున్నాడు. దెబ్బతో జహంగీర్‌ను ఖతం చేశాడు.

చిల్లులుపడ్డ కుండలా శరీరంనుండి రక్తం కారుతున్నది. కాళ్ళు- చేతులు పట్టు తప్పుతున్నాయ్. శరీరం వశం తప్పుతున్నది. మైకం కమ్ముతున్నది. గోడను బట్టుకొని వూపిరి పీల్చుకున్నాడు. వూర్లోనుండి విజయోత్సవం నినాదాలు వినబడుతున్నయ్.

"స్వతంత్ర భారతికి జై"

"కమ్యూనిస్టుపార్టీకి జై"

"ఆంధ్రమహా సభకు జై"

"విప్లవం వర్ధిల్లాలి"

"విశాలాంధ్రలో ప్రజారాజ్యం స్థాపిస్తాం"

నినాదాలు ప్రతిధ్వనిస్తున్నయ్.

తమ ఆశయం నెరవేరిందన్న సంతృప్తి పొందుతున్నాడు రవి. యింకెంతోసేపు తాను బతకననీ, తన కామ్రేడ్సును చూసే అవకాశం లేదనీ గ్రహించాడు. శకుంతలనొకసారి చూడాలనే కోరికున్నా అది సాధ్యం కాదనకున్నాడు. క్షణమాలోచించాడు.

రైఫిల్‌లోనుండి తూటా తీసి కలంగా,
తన శరీరంలోని రక్తాన్ని సిరాగా,
తెల్లని గోడను కాగితంగా చేసి
రక్తాక్షరాలు రాస్తున్నాడు.

"ప్రియమైన కామ్రేడ్సు

నేను పోతున్నా! కడసారి మిమ్మల్ని చూడాలని, అంతిమ వీడ్కోలు తీసుకోవాలని వున్నది. కానీ- ఏం చేయను? శరీరం వశం తప్పుతున్నది. మైకం కమ్ముతున్నది. మీరు చేస్తున్న విజయనాదాలు వింటున్నా. క్రూర నిజాం పాలన కూలిపోతున్నది. ప్రజారాజ్యం రానున్నది. మన లక్ష్యం నెర

వేరనున్నది. ఆ శుభదినం నేను చూడలేక పోతున్నా!

చనిపోతున్నానన్న బాధలేదు. పిరికివాడిలా చావడంలేదు పోరాటంలో విప్లవకారుడిగా చనిపోతున్న. నాకంటే ముందు నలుగురు కామ్రేడ్లు వీరులుగా పోరాడుతూ అమరులయ్యారు. ప్రతీకారం తీసుకోవాలని, పట్టుదలతో పోరాడి శత్రువులను హతమార్చిన.

ఉరికంబంమీద గాకుండా యుద్ధరంగంలో వొరిగిపోతున్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను.

లాల్ సలాం.

శశీ!

నిన్ను చూడాలని వుంది. కానీ ఆ అవకాశంలేదు.

కంట తడి పెట్టొద్దు. నిరాశ చెందొద్దు.

విప్లవనారిగా నీ కర్తవ్యం నెరవేర్చు.

పుట్టబోయే మనబిడ్డను మన ఆశయాల బాటలో తీర్చిదిద్దు.

అమ్మకు, నాయనకు నమస్కారాలు చెప్పు.

యింకా ఏదో ఏదో చెప్పాలని వున్నది.

కానీ... చేయి నిలవనంటున్నది.

కళ్ళు ఆగనంటున్నయ్.

శరీరంలో శక్తి వడిసిపోతున్నది.

నా కళ్ళల్లో నీరూపే నింపుకొని పోతున్న.

విప్లవం వర్ధిల్లాలి

రవి"

అతని చేయి జారిపోయింది. కనురెప్పలు వాలిపోయినయ్. శరీరంలో కదలిక ఆగిపోయింది.

★ ★ ★

స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు వందల సంఖ్యలో ఆనందంతో కోలాహలంగా వూరేగింపు జరుపుతున్నారు. డప్పులు, కొమ్ములు, తాళాలు, మద్దెల దర్వులకనుగుణంగా యువకులు నృత్యాలు చేస్తున్నారు. పాటలు పాడుతున్నారు. నినాదాలు చేస్తున్నారు. వూరంతా ఆ ఊరేగింపుతోనే కదులుతున్నట్లున్నది. ముందు భాగాన దళనాయకుడు సత్యం, సత్తిరెడ్డి, లతీఫ్, శకుంతల, లక్ష్మమ్మ, మిగతా దళసభ్యులున్నారు. ఊరేగింపు గడి దగ్గరికి చేరింది.

ముందున్న సత్యం, గడిముందు రక్తం మడుగులో శవమై పడివున్న గోపన్నను చూసి, "ఆగండి కామ్రేడ్లు. ఏదో మోసం జరిగింది" అని బిగ్గరగా అరిచాడు. ఎక్కడి వాళ్ళక్కడ నిలిచిపోయారు. జయజయధ్వనులు ఆగిపోయినాయ్. అందరి చూపులు గోపన్న శవంవైపు మళ్లినాయ్. దళ సభ్యుల కళ్ళు ఎరుపెక్కినాయ్. శత్రుశేషం ఎక్కడో మిగిలిందని అనుమానించి గబగబా గడిలోనికి పరుగెత్తారు.

లోపల అంతా నిశ్శబ్దంగా వున్నది. రజాకార్ల శవాలతో నిండివున్నది. ఆ శవాల మధ్య అక్కడక్కడా పడివున్న మారయ్య, కిష్టయ్య, యాదగిరి శరీరాలు రక్తంతో తడిసి ఎర్రని శిలాప్రతిమల్లా కనిపించాయి. అశ్రునయనాలతో ఆ వీరులకు జోహార్లు అర్పిస్తున్నారు.

శకుంతల ఖంగారుతో అటు యిటూ పరిశీలిస్తూ, రవికోసం వెతుకుతున్నది. ఒక్కొక్క రజాకారు శవాన్ని దాటుకుంటూ ముందుకు సాగుతున్నది. ఎదురుగా గోడపక్కన వొరిగిన రవిని చూసి కెవ్వున కేకవేసింది. నిశ్చేష్టురాలై నిలిచిపోయింది.

అంతా అక్కడికి చేరారు. ఎవరినోటా మాట రావడంలేదు. అందరి కళ్ళల్లో కన్నీరు నిండుకున్నది. కొందరి చెక్కిళ్ళపై నుండి కన్నీటి ధారలు కారుతున్నాయ్. అశ్రునయనాలతో గోడమీదున్న రవి రక్తాక్షరాల సందేశం చూస్తున్నారు. ఆవేశంతో దళసభ్యులు "విప్లవం వర్ధిల్లాలి, కామ్రేడ్ రవి అమర్హై" గొంతెత్తి అన్నారు.

గోపన్న, కిష్టయ్య, మారయ్య, యాదగిరి

శవాలను అక్కడికి తీసుకొచ్చి రవి శవం పక్కనుంచారు.

తేరుకున్న శకుంతల, తన భర్త అంతిమ సందేశాన్ని ఆచరించడానికి గుండెనిబ్బరం చేసుకున్నది. కన్నీరు తుడుచుకున్నది. నెమ్మదిగా రవి దగ్గరికెళ్లి తన సిగలోని ఎర్ర గులాబి తీసి అతని పాదాల చెంత పెట్టింది. ఇంకా పూర్తిగా యింకిపోని అతని రక్తంతో వీర తిలకం దిద్దుకున్నది. వీరనారిగా నిలిచి విప్లవసెల్యూట్ చేసింది. దళ సభ్యులంతా పిడికిళ్ళు బిగించి సెల్యూట్ చేశారు.

"విప్లవం వర్ధిల్లాలె" రౌద్రంతో గొంతెత్తి అన్నది శకుంతల. అందరి గొంతులు కలిసి నినాదాల తరంగాలు పైకెగసినాయ్. చెట్లు, గుట్టలు ప్రతిధ్వనించినాయ్.

★ ★ ★

గతం కళ్ళముందు జరుగుతున్నట్లు చూస్తున్న శకుంతలమ్మ,

"విప్లవం వర్ధిల్లాలె" బిగ్గరా అన్నది.

అక్కడికి చేరిన జనం గొంతులు కలిపి "వర్ధిల్లాలె" అన్నారు. శకుంతలమ్మ కళ్ళు తెరిచింది. కల చెదిరిపోయినట్లు కలవరం చెందింది. చుట్టూ చేరిన జనాన్ని కన్నీరు పెడుతున్న లక్ష్మమ్మ, లతీఫ్‌లను చూసింది. కంట తడి తుడుచుకున్నది.

లక్ష్మమ్మ, శకుంతలమ్మ చేతులు బట్టుకొని గద్గదస్వరంతో- "యెవరికోసమమ్మా వాళ్ళు పానాలిచ్చిండ్రు? దేనికోసమమ్మా త్యాగాలు జేసింద్రు? " అన్నది.

"అప్పుడు యిప్పుడు దోపిడోల్లదే రాజ్యమయ్యింది" నిరాశతో లతీఫ్ అన్నాడు. వీర మాతగా అందరివంక పరిశీలనగా చూసింది శకుంతలమ్మ.

"బానిసత్వం పోవాలని, మనిషి మనిషిగా బతకాలని, అందరికీ న్యాయం జరగాలని, సమసమాజం రావాలని ఆశించారు. పోరాటం చేశారు. వారి త్యాగాల ఫలితం మనకు దక్కలేదు. దగాకోరులు, దోపిడి దొంగలు దేశాన్ని దోచేస్తున్నారు. రౌడీలు, గుండాలు, రాజకీయ నాయకులైపోతున్నారు. ఎటుచూసినా హత్యలు, మానభంగాలు, అత్యాచారాలు. ఈ దేశం ఏమైపోతున్నది? స్వార్థం పరమార్థమైనది. అవినీతి రాజ్యమేలుతున్నది. న్యాయం, ధర్మం అడుగంటిపోతున్నది. కులాలు, కుమ్ములాటలు, బలవంతుల దౌర్జన్యాలు, అమాయకుల ఆర్తనాదాలు పెరిగిపోతున్నాయి. మోసకారుల మాయమాటలు విని మన ప్రజలు కర్తవ్యం మరిచిపోతున్నారు. విప్లవకారులు ఇంటికో కుంపటి పెట్టుకున్నారు. ఎంతకాలం? ఈ దోపిడి పోవాలంటే, మన కష్టాలు తీరాలంటే కష్టజీవులంతా ఒకటిగావాలె. కులం, మతం పుచ్చులోనుండి బయటపడి ఒకే జాతిగా కదలాలె. మత్తులో నుండి యువత మేల్కొనాలే. విప్లవకారులంతా ఒకటిగావాలె. న్యాయం, ధర్మం కోరేవారంతా తమ కర్తవ్యం తెలుసుకోవాలి. మరో ధర్మయుద్ధం జరగాలె. అప్పుడే యీ వ్యవస్థ మారుతుంది. నూతన వ్యవస్థ వస్తుంది. ఈ చీకటిపోయి వెలుతురొస్తుంది. సమసమాజం వస్తుంది. అది ఎప్పటికైనా రాక తప్పదు"

అన్నది శకుంతలమ్మ ఆవేశంతో.

అందరూ హర్షధ్వానాలు చేశారు. ★

**మనవి**

తెలంగాణా మాండలిక భాషతో పరిచయం అంతగా లేనివారు కంపోజ్‌చేసినా, ప్రూఫ్ రీడింగ్ చేసినా తమ పరిధుల్లో ఆ భాషలోని ఒప్పులను కూడా తప్పులుగా భావించి సవరించే పరిస్థితిలో భాషలో తేడాలు సహజం. అలాంటి లోపాలు ఎదురైతే అవి రచయితవి కావని గమనించగోరుతాం.

# చతుర కతలు

## మగువా! మగధీరులూ!

ఆంధ్రదేశంలోని ఆ పెద్ద పట్టణంలో మిగిలిన చోట్లకు మల్లేనే సందులూ, గొందులూ, పందులూ, ప్రయాణీకుల్ని పరుగెత్తించే సిటీ బస్సులూ, విద్యాలయాలూ, వాటిలో పాతుకుపోయి కులంపేరుతో తన్నుకుచచ్చే అధ్యాపకులూ, వారికి బాసటగా నిలిచే మేనేజ్‌మెంట్లూ యధావిధిగానే వున్నాయి. వాటికి అనుబంధంగా మగ వసతి గృహాలూ, వాటికి బాగా దూరంగా విద్యార్థినుల హాస్టలూ వున్నది. స్వర్గానికి మార్గం ఇరుకుగా, తిన్నగా వుంటుందో లేదో తెలియదు గానీ ఈ లేడీస్ హాస్టల్ పక్కనుంచి పోయే మార్గం ఇరుకుగా, కించిత్ తిన్నగా వుంటుంది.

గ్రీష్మరుతువు! రోడ్లపై రాకపోకలు అంతంత మాత్రంగానే వున్న సమయంలో అరడజను యువకిశోరాలు, ఆ ఇరుకైన బాటపై హాస్టలు దిశగా నడుస్తున్నారు. గుంపులు గుంపులుగా నడుస్తున్న వారి దృష్టి ఎదురుగా వస్తూన్న ఒక లతాంగిపై పడింది.

ఆమె అందంగానే వున్నది. మందంగా, మరీ పూర్వకాలపు పెళ్లికూతురిలా తలవంచుకు నడుస్తోంది.

ఆడగాలి సోకగానే కుర్ర పురుష పుంగవులలో చలనం వచ్చింది. చూపు మారింది. నడక మారింది. అంతవరకూ గుంపులుగా నడుస్తూ, జోకులేసుకుంటూ అష్టవంకర్లు పోతూన్న యువకిశోరాలు నిటారుగా నడవనారంభించారు. చప్పుడు చేస్తున్న నోళ్లు ఠక్కున మూతపడ్డాయి. విచిత్రంగా వారు కళ్లతోనే సంప్రదించుకుని ఒకే లైనులోకొచ్చారు. అసలే ఇరుకు రోడ్డు, దానిపై కదిలి గోడలాగా ఒకేలైనులో నడుస్తున్న యువశార్దూలాలు.

వెనుకనుంచి చూస్తున్న నాకు ఇదంతా తమాషాగా అనిపించింది. మేరు నగరధీరుల కదిలేగోడ! ఎదురుగా తలవంచుకుని వస్తున్న ఏకైక అబల!!

ఏమి జరగబోతోంది? క్షణక్షణానికీ వారి మధ్య దూరం దగ్గరౌతోంది.

ఆమె ఇంకా తలవంచుకునే నడుస్తోంది!

సడెన్‌గా తలెత్తి వీళ్లను చూసిన ఆ అమ్మాయి సడెన్‌గానే వంగింది.

కాలిజోడు బెల్టు విప్పసాగింది.



అర్ధరాత్రి పక్కలో ఆర్.డి.ఎక్స్ మూటని చూసిన సైంటిష్టులా, పరదేశంలో పాక్ టీముని చూసిన ఇండియన్ క్రికెట్ యోధుల్లా, పాదాభివందనం చెయ్యడానికి వస్తున్న ఆత్మాహుతిదళ సభ్యుడిని గుర్తుపట్టిన రాజకీయ నాయకుడిలా, కదిలే గోడ

వణికింది. ఛిన్నాభిన్నమైంది. యువకిశోరాలు రెండు పాయలుగా చీలి ఆదిపరాశక్తికి అటు ఇటూ మీటరేసి దూరం వదిలి కంగారుగా పరారయ్యారు.

నేను భారంగా నిట్టూర్చాను. ఏమో జరుగుతుందని ఊహించుకుని ఏమీ జరక్కపోవటంతో మళ్లీ మనసు నిరాశగా మూలిగింది.

ఆమెకు దగ్గరగా వెళ్లిన నాకు ఆమె చాలా చాలా అందగత్తె అని అర్థమైంది.

ఆమె కొత్త షూస్‌లో దూరిన గులకరాయినితీసి, బైటపారేసి, మళ్లీ కాలికి షూ బిగించి, తలవంచుకుని మందగమనంతో ముందుకే సాగింది.

-సుబశ్రీ

---

## సుందరకాండ

సాయంత్రం 6 గంటలయింది. సుబ్బారావు స్కూటరుమీద ఇంటికి చేరుకున్నాడు. ఉక్కపోతగా ఉందని డ్రస్‌తీసి తుండుగుడ్డ కట్టుకొని స్నానానికి వెళ్ళబోతున్నాడు.

"ఏవండీ! బియ్యం నిండుకున్నాయి" అంది సుందరి.

సుబ్బారావుకి ఒళ్లుమండుకొచ్చింది. ఆఫీసునుండి రాగానే చెప్పొచ్చుగా అర్ధనగ్న ప్రదర్శనలో ఉండగా ఈవిడ ఇండెంట్! ఈ టైంలో నిలువెత్తు బంగారం యిస్తామన్నా తనెక్కడకూ వెళ్లడన్న సంగతి తెలుసావిడకు.

"మీరేమీ ఫీల్ కావద్దు. బజారుకు వెళ్లనూ వద్దు. ఇవాళ్టికి పుల్కాలు చేస్తాను లెండి. ముద్దపప్పులో ముంచుకొని తిందాం'' అంది సుందరి గోముగా.

"సరే తగలడు" అని చెప్పి బాత్రూంలోకి దూరాడు సుబ్బారావు. రెండుపూటలా అన్నం తినందే సుబ్బారావుకి కడుపు నిండదు. అయినా ఆ పూటకి పుల్కాలు తిని గడిపేశాడు.

మర్నాడు లేచీలేవగానే సుందరి తలారా స్నానం చేసి ముచ్చటగా కన్పించింది.

"ఏవండీ తెల్లవెంట్రుకలు కనబడ్తున్నాయి. డై కలిపి ఉంచాను రాస్తాను" అంది ఆప్యాయత వలకబోస్తూ.

"ఆజ్ఞ దేవీ! ఈ దాసుడు శిరసు వంచి నీకు దాసోహం అంటున్నాడు" అన్నాడు సుబ్బారావు నాటకీయఫక్కీలో.

పది గంటలకు తయారై ఆఫీసుకి బయల్దేరాడు. సుందరి వీడ్కోలు చెప్పింది. ఫర్లాంగుదూరం వెళ్ళిందో లేదో స్కూటరు ఆగిపోయింది. పెట్రోలు అయిపోయింది. వెనక్కి తిరిగి ఇంటికి వచ్చాడు. స్కూటరు లాక్‌చేసి ఇంట్లోకి వెళ్లాడు.



"నా అమ్మే, నా అమ్మే! నాస్తికుడయిన నా కొడుక్కి గ్రహణంనాడు రొట్టెలు తినిపించి, తలస్నానం చేయించి పంపేవుకదే సుందరీ!''

అని సుబ్బారావు తల్లి కోడలిని మెచ్చుకుంటున్నది. వింటున్న సుబ్బారావుకి ఆ ముందురోజు వేకువజామున చంద్రగ్రహణం అన్న సంగతి గుర్తొచ్చి అవాక్కయిపోయాడు.

-ఆనందరావ్

## కేవలం కల్పితం

"అదృష్టమంటే అలా ఉండాలి. మీరూ ఉన్నారు ఎందుకూ? మీ ఫ్రెండు గురుమూర్తిని చూసి నేర్చుకోండి" అంది విసురుగా శ్రీమతి.

"ఇపుడేమయింది? " విసుగ్గా అన్నాను నేను.

"ఏమవుతుంది! పత్రికలో ఈ వారం మళ్ళీ కొత్త సీరియల్ మొదలయింది.

ఇద్దరూ ఓ బెంచీమీద కూర్చుని చదివాం... రాశాం అంటారు. ఆయన అలా నవలల అందలాలు ఎక్కి ఆకాశాన్నందుకొంటుంటే మీరు మాత్రం ఆరు పేజీలు మించని అర్భక కథల్లోనే, అట్టడుగున ఉండి పోతున్నారు. ఓసారి ఆయన్ని కలిసి ఆ కిటుకేమిటో కనుక్కోరాదూ!" అంది శ్రీమతి బాధను వ్యక్తం చేస్తూ. గురుమూర్తి, నేను చిన్ననాటి స్నేహితులం! కలిసి చదివి, కలిసి కథలు రాయటం మొదలుపెట్టాం. ఒకరి లోటుపాట్లను ఒకరు దిద్దుకున్నాము. అచ్చయితే కలిసి పండుగ చేసుకున్నాం. ఉద్యోగాలరీత్యా ఊళ్ళుమారి, ఉత్తరాలు కూడా లేక పత్రికల్లో అచ్చవుతున్న కథలద్వారా పలకరించుకుంటున్నాం. అదేమిటో విచిత్రంగా వాడీ నాలుగైదు సంవత్సరాల్లో సంచలన సీరియల్ రచయితగా గొప్ప పేరు తెచ్చుకుంటున్నాడు. పోనీ వాడి నవలల్లో కొత్తదనం ఉందా అంటే అదీ లేదు. పాత సీసాలో పాత సారా అన్నట్టు ఒకటే ఒరవడి! ఇంకేం చూసి పత్రికలవాళ్ళు అచ్చువేస్తున్నారో అర్థం కాలేదు! ఎంతో బాగా రాశాననుకుని పంపిన నా నవలలు తిరిగొస్తున్నాయి!

మనసుండక వాడిని కలుద్దామని ఊరు బయలుదేరాను. పలకరింపులు, భోజనాలు పూర్తయ్యాక అడిగేశాను. "నీ కథల్లో, నవలల్లో ఏమాత్రం కొత్తదనం లేదు. పత్రికల వారికి లంచం ఇస్తున్నావా? లేక మీ బంధువర్గంవారు పత్రికల్లో పనిచేస్తున్నారా? " మొహం మీదే అడిగేశాను.

"భలేవాడివి! అలాంటిదేం లేదు. దీనికో ట్రిక్కుంది. నవల పంపేముందు మొదటిపేజీలో 'ఈ నవల ఒక యధార్థ సంఘటన ఆధారంగా రాయబడిందిఅని రాసి పంపిస్తున్నాను" అన్నాడు గురుమూర్తి.

"సర్లే! నీవు నీ ట్రిక్కు ఉపయోగిస్తే పాఠ



కులు పిచ్చివాళ్ళా ఎగబడి చదవటానికి" అన్నాను.

"పాఠకులు పడిచచ్చిపోయి మరీ చదువుతున్నారు తెలుసా? "

"ఎడిటర్‌గారు ఏదైనా వశీకరణమందు పత్రికలకు రాసి మార్కెట్‌లోకి వదులుతున్నారా? " వళ్ళు మండిపోయి అన్నాను.

"అలాంటిదేం లేదు. కానీ ప్రతివారం సీరియల్ మొదలయ్యే పేజీలో 'ఈ కథలోని పేర్లు, సంఘటనలు కేవలం కల్పితాలు, ఎవరినీ ఉద్దేశింపబడినవి కావు. పాఠకులు గమనించగలరు!' అని బాక్సు కట్టివేస్తున్నారు. అంతే" అంటున్న గుర్తుమూర్తివైపు పిచ్చిచూపులు చూశాను నేను.

**-ఎ. జయలక్ష్మిరాజు**

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# వర్ధని పై చతుర సమీక్షలు

మే 'చతుర'లో ప్రచురితమైన చంద్రలత రచన 'వర్ధని'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## అవగాహనను ఏర్పరచాలి

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

సున్నిత మనస్తత్వం, నిష్కల్మషహృదయం కలిగి వుండే చిన్నారుల మానసిక సంఘర్షణని ఇతివృత్తంగా తీసుకుని రచయిత్రి చక్కగా విశ్లేషించారు.

మొత్తం తన సొంతం అనుకున్న పెద్దమ్మ, పెద్దనాన్న ప్రేమానురాగాలకు మరొకరు భాగస్వాములు కావడంతో, ఊహించని పరిణామానికి ఉక్కిరిబిక్కిరై ఒకలాంటి డిప్రెషన్‌కి లోనైంది వర్ధని! అలాంటివారికి సరైన సైకియాట్రిస్ట్ ట్రీట్‌మెంట్, సకాలంలో జరగకపోతే ఉన్మాదస్థితికి చేరుకుని హింసా ప్రవృత్తికి అలవడే ప్రమాదముంది.

వర్ధనికన్నా వాణి పాత్ర బాగా ఉంది. చిన్న వయసులో, వయసుకు మించిన హుందాతనంతో, పెద్దమనిషిలా ప్రవర్తించే వాణిని చూస్తే జాలి కలుగుతుంది. వర్ధని కొట్టినా, తిట్టినా ఎంతో ఓర్పుని, నేర్పుని చూపించడమేకాక, తనని ద్వేషించే వర్ధని అభివృద్ధిని, శ్రేయస్సుని కోరుకుంటుంది. వర్ధనికి ఫస్ట్‌ర్యాంక్ వచ్చినప్పుడు తన అక్క తెలివితేటల్ని సంతోషంగా, గర్వంగా తన ఫ్రెండ్స్‌కి చెప్పడంలోనే చిన్నారి వాణి విశాల హృదయం ప్రస్ఫుటమౌతుంది.

వర్ధని ఎడబాటు కోటయ్య, జయమ్మలలో కూడా ఎలాంటి మనస్థాపాన్ని కలిగించిందో చెప్పివుంటే బాగుండేది.

ఒకే తల్లికి పుట్టిన పిల్లల మధ్య కూడా ఇలాంటి అసూయాద్వేషాలే వుంటుంటాయి. అందుకే పిల్లలనందరినీ ఎప్పుడూ సమానంగా చూడాలి. ఒకరి ఎదుట మరొకరిని కించపరచటం, అతిప్రేమ చూపటం పనికిరాదు. వాళ్ళలో ఆత్మన్యూనతాభావాన్ని కలిగించకూడదు.

ఈ పరుగుల యుగంలో పిల్లలకి ప్రేమానురాగాలు, ఆత్మీయతానుబంధాలు తీరని కోరికలుగానే మిగులుతున్నాయి.

ఉమ్మడి కుటుంబాలలో అయితే చిన్నపిల్లలు ఎక్కువగా వుంటారు. మరీ చిన్నపిల్లల్ని ఎత్తుకొని లాలించడం, ఆప్యాయతను చూపడంలాంటివి అవసరమని పెరుగుతున్న పిల్లలకి అర్థమయ్యేలా వివరించాలి. అంతేకాదు చిన్నారి పాపాయిని ప్రేమించగలిగేలా చెయ్యాలి. ఒకే ఈడు పిల్లలమధ్య సయోధ్యను, అవగాహనను ఏర్పరచాలి

ఇలా చేయడంవల్ల వాళ్ళలో ఈర్ష్య జనించదు. ప్రేమ అంకురిస్తుంది. జాలి, దయ, కరుణ, స్నేహశీలత చిన్నప్పటినుంచే అలవడి రేపటితరానికి మానవత్వపు పరిమళాలని అందిస్తారు.

-కంచర్ల పద్మజ,
శివరాంపురం.

## ఛైల్డ్ సైకాలజీ

**(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)**

**వి**భిన్నమైన కథావస్తువుని తన అరుదైన శైలితో ఆలోచింపచేసేదిగా మలిచారు రచయిత్రి- పసిపిల్లలు అప్పుడే నాటిన మొక్కల్లాంటి వాళ్ళు. విపరీతమైన ఎండ, నీరు మొక్కకి ఎంత చేటు చేస్తాయో, మితిమీరిన గారాబం, అలవిమాలిన అలసత్వం పసిహృదయాలకి అంత చెరుపు చేస్తాయని చెప్పడానికి సజీవసాక్ష్యం వర్ధని. అతిగారాబాన్ని పొందిన పిల్లలు ఆ ప్రేమను ఎవరితోనూ పంచుకోవటానికి, తమ ప్రపంచంలోకి ఎవరూ ప్రవేశించటానికి ఇష్టపడరు. తిరిగి ఆ ఆప్యాయతను స్వంతం చేసుకోవటానికి ఏ అఘాయిత్యానికైనా వెనుకాడరు. వారిని నిర్లక్ష్యం చేసినట్లైతే బాల నేరస్థులుగా మారి సంఘానికి మాయని మచ్చలుగా మిగిలే ప్రమాదముంది. పిల్లల్ని సరైన మార్గంలో నడిపించి వారిని అందరూ గర్వించేలా భావితరానికి మార్గదర్శకులుగా చేసే బాధ్యత తల్లిదండ్రులపై ఉంది. అది ఓ తపస్సు లాంటిది.

జయమ్మ, కోటయ్యల వల్లమాలిన ప్రేమ వలన తననో యువరాణిలా భావించుకుంటూ అందర్నీ పురుగుల్లా చూసే వర్ధని పాత్ర చిత్రణ బాగుంది. కలల ప్రపంచంనుంచి కరుకైన వాస్తవంలోకి తీసుకురాబడి, అభద్రతాభావం చోటుచేసుకోగా ప్రతివారిని దోషులుగా అపనమ్మకంగా చూసే వర్ధనిలాంటి చిట్టి తల్లులు ఈ సమాజంలో ఎందరో ఉన్నారు.

పిల్లల'నాడి' తెలిసిన 'మేడం'లాంటి తల్లి సంరక్షణలో కూడా గౌతం మొండిగా, దురుసుగా తయారుకావటం, చివరికి సుశిక్షితురాలైన ఆవిడ కూడా కొడుకుని బాదటం అసహజంగా ఉంది. అసలా పాత్ర ద్వారా రచయిత్రి ఏం సందేశం ఇవ్వదలచుకున్నారో అర్థంకాలేదు. లలితలో ఒక పరిపూర్ణమైన స్త్రీ మూర్తిని, ముఖ్యంగా తల్లిని చూపించలేకపోయారు. వర్ధనిని ఆమె ఆప్యాయంగా చూడటంగాని, ముద్దాడటంగాని లేకపోగా సవతి తల్లిలా సూటిపోటి మాటలనడం వాస్తవానికి దూరంగానూ, మాతృత్వానికి భిన్నంగానూ ఉంది. చివరకు వర్ధనిలో కొద్దిగానైనా మార్పు చూపించిఉంటే బాగుండేది. మొత్తానికి పిల్లల మనసులు అర్థంచేసుకోని తల్లిదండ్రులకు 'చురక'లాంటిదీ నవల.

**ఎ. రాధాశ్రీనివాస్,**
గుంటూరు.

## మనస్సు- పరిపక్వత!

**(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

**ఉం**దని కాని, లేదని కాని చెప్పటానికి వీలులేనిది, రూపం లేనిది, శాస్త్రవేత్తలచేత తలలు బద్దలు కొట్టుకొని ఆలోచింపజేసేది, అత్యంత క్లిష్టతరమైనది 'మనస్సు'.

అందులో శారీరక మానసిక పరిపక్వత లేని పసివాళ్ళ ప్రవర్తనకు గల కారణాలు వివరించటం ఇంకా కష్టసాధ్యమైనది. రచయిత్రి చంద్రలతగారు ఇంత క్లిష్టమైన విషయాన్ని కథావస్తువుగా ఎన్నుకొని తాను చెప్పదలుచుకొన్న విషయాన్ని సూటిగా స్పష్టంగా వివరించగలిగారు.

చదువుకోకపోవటం వలన కొంతమంది తమ పిల్లల విషయంలో తగిన శ్రద్ధ వహించకపోతే, చదువుకొని "ఇది తమ బాధ్యత కాదు'' అని తప్పించుకొనే ముకుందంవంటి తండ్రులను మేడం పాత్రద్వారా హెచ్చరించారు.

కోటయ్య, జయమ్మ వంటివారు పిల్లలను అతిగారాబంచేసీ, ముకుందం వంటివారు అశ్రద్ధ చేసీ పిల్లల, ప్రవర్తనను అర్థం

చేసుకోకపోవటంతో పసివారి మనస్సుపై అది ఎంతటి ప్రభావం చూపుతుందో తెలిపారు. ఈ పనిలో రచయిత్రి కృతకృత్యులయ్యారు.

నవల కథాపరంగా బాగున్నా కథను ఏకబిగిని చదవాలన్నంత ఆసక్తికరంగా లేకపోవటం విచారకరం. అన్ని రసాలలో అత్యంత అవసరమైన హాస్యరసం కొంచెమైనా లేకపోవటం పప్పులో ఉప్పులేనట్లుగా ఉంది.

అందరినీ ఆదరించి, అలరించే మేడం తన కొడుకు ప్రవర్తనను గుర్తించకపోవటం, గౌతం ప్రవర్తన తెలిసినపుడు సంయమనం పాటించక స్టేజిమీద బెల్టుతో కొట్టటం వంటి సంఘటనలు లేకుండా ఉంటే నవల ఇంకా బాగుండును.

గౌతంవంటివారు దండనకు మరింత మొండివారుగా మారుతారే తప్ప ఫలితం ఆశించినట్లుగా ఉండదు. అటువంటివారిని సహనంతో మంచివారిగా మార్చినట్లు చెబితే బాగుంటుంది.

**బి. వేణుగోపాలరావు,**
శ్రీరాంనగర్.
-535101

## పెద్దల బాధ్యత

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

పెళ్ళిళ్ళయ్యాకా, శ్రీమంతాలప్పుడూ... కేవలం మాతృత్వంలోని మధురిమల్ని, మాతృత్వం గొప్పదనాన్ని గూర్చి మాత్రమే గోరంతలు కొండంతలుగా చేసి కాబోయే తల్లులకు చెప్పే పెద్దలు పిల్లల పెంపకాన్ని గూర్చి... అంటే పిల్లలు పెంకివారు కాకుండా మంచివారుగా రేపటి నిజమైన ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దబడడానికి తీసుకోవలసిన జాగ్రత్తల్ని గూర్చి ఒక్కమాట కూడా చెప్పరు. వారలా చెప్పకపోవడానికి కారణం పిల్లల పెంపకాన్ని గూర్చిన సాహిత్యం వారికి అందుబాటులో లేకపోవడం మరియూ వారికి దానిమీద సరైనటువంటి అవగాహన లేకపోవడం. వారికే తెలియనప్పుడు, తెలియజెప్పేవాళ్ళు లేనప్పుడు తర్వాతితరాలకి వాళ్ళేం చెప్పగలరు?

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే మే 1996 చతుర నవల 'వర్ధని' పిల్లల స్వభావాలమీద, పెంపకంమీద సశాస్త్రీయంగా రాసిన అరుదైన నవల కనుక.

వర్ధని అతిగారాబాన్ని, వాణి నిర్లక్ష్యానికి గురవడాన్ని చక్కగా వర్ణిస్తూ, అలా చేయడంవల్ల భవిష్యత్తులో పరిణామాలెలా వుంటాయో కూడా చాలా చక్కగా పాఠకులకు తెలియజెప్పిన రచయిత్రి నిజంగా అభినందనీయురాలు. నవలలో పల్లెవాతావరణ చిత్రణ ఎంతో బాగుంది. కానీ భాష మాత్రం కొంచెం కృతకంగా అన్పిస్తోంది. మాండలికంమీద రచయిత్రి కొంచెం శ్రద్ధ తీసుకొని వుంటే నవలకి నిండుదనం వచ్చేది. తోటి ఈడు పిల్లల్తో సమానంగా చూడకుండా వర్ధనిలో సుపీరియారిటీ కాంప్లెక్సుని పెంచిన పెద్దమ్మా పెదనాన్నలే తనకిష్టమైన బొమ్మల కథల పుస్తకాల్ని పాప చింపేసిందన్న కోపంలో వర్ధని పాపను కొట్టినప్పుడు, తనకెంతో ఇష్టమైన పెద్దమ్మే ఆ చెంపా ఈ చెంపా వాయించేసరికి వర్ధని చిన్నారి హృదయం తట్టుకోలేక విలవిలలాడిపోయింది. పెద్దమ్మ పెంచిన తోటలోని బంతి, చేమంతి పూలనీ, మొక్కల్నీ ఎంతో కసిగా తెంపి తొక్కి నాశనం చేస్తేగానీ శాంతి కలగనంత శాడిజం ఆ చిన్నారి హృదయాంతరాళాల్లో వుందంటే దానికి కారకులెవ్వరు? వర్ధనిని అతిగారాబంచేసి సుపీరియారిటీ కాంప్లెక్సుని ఆ పసిపిల్ల నరనరాల్లోకి డైరెక్టుగా ఇంజక్ట్ చేసిన పెద్దవాళ్ళే కదా....!

ఇదేదో కాలక్షేపానికో, ఆషామాషీ

గానో చదివే నవల కానేకాదు. అసలు దీన్ని ఓ నవల అనడంకంటే మానసికంగా పిల్లలు దెబ్బతినకుండా వుండడానికి తీసుకోవలసిన జాగ్రత్తల్ని మనముందుంచే ఓ గొప్ప వరదాయినొచ్చు. అంతేకాకుండా మానసికంగా దెబ్బతిన్న చిన్నారి బాలల్ని (పెద్దల్ని కూడా) ఎలా ట్రీట్ చేయాలో, పిల్లల్ని ఎలా సక్రమమైన మార్గంలో పెంచి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలో తెలియజెప్పే మార్గదర్శిని ఈ 'వర్ధని'.

**పల్లేటి నిర్మల,**
సూళ్ళూరుపేట.
-524121

## వయసును దాటిన పాత్ర

*(ఆయిదో బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**చా**లాకాలం తర్వాత పసిపిల్లల మనస్తత్వంపై వొచ్చిన నవల వర్ధని. నెల్లూరు యాసతో, అచ్చమైన పల్లె వాతావరణంతో రచయిత్రి నవలను చివరదాకా చదివించారు. కానీ పసిపిల్లల పట్ల, తల్లిదండ్రులు, పెద్దలు ప్రవర్తించాల్సిన విధానం పూర్తిగా వివరించలేకపోయారు. ఈ రచయిత్రి రాసిన 'నేనూ నాన్ననవుతా' కథలో ఇదే సందేశాన్ని గొప్పగా తెలియజేశారు. కథకన్నా ఎక్కువ అవకాశమున్న నవలలో మాత్రం ఆ పని చేయలేకపోయేరు. పెదనాన్న, పెదమ్మల అతిగారాబం వర్ధనిలో నిర్లక్ష్యాన్ని పెంచింది. తల్లి చీటికి మాటికి, ఒకవిధంగా చూస్తే అనవసరంగా కూడా కొడుతుంది. లలిత పాత్ర చూస్తుంటే అసలీమె తల్లేనా? అని కూడా అనిపిస్తుంది. ముకుందం పాత్ర ఒకింత ఫరవాలేదు. వర్ధని పాత్ర పూర్తి పసిపిల్ల (ఆరేడేళ్ళ పాప) మనస్తత్వంతో సాగదు. ఒకోసారి చాలా పెద్దగా ఆలోచిస్తుంది. తన స్థానాన్ని, ప్రేమను ఆక్రమించిన పాపపై కోపం సహజమేగాని, పసిపిల్లల్లో అది తాత్కాలికం. దాన్ని రమ్యంగా చిత్రీకరించివుంటే బావుండేది. లలిత పాత్ర మరీ దారుణంగా వుంది. తల్లిలా ఆమె ఎక్కడా అగుపించదు. ఆఖరున మాత్రమే కాస్త బాధపడుతున్నట్లు కనిపిస్తుంది.

నవలలోని గౌతమ్‌లాంటి పిల్లల మనస్తత్వం మనమూ చూస్తూనే ఉంటాం. దానికి కారణం ఏమిటి? పరిష్కారం ఏమిటి? అన్నదే అనాదినుంచి తల్లిదండ్రుల్లో వున్న ప్రశ్న. మానవ జీవితంలో బాల్యం మధురాతిమధురమైనది. పిల్లలను ప్రేమతో అక్కున చేర్చుకోవాలి. అవసరమైతే ఓ దెబ్బవేసి మార్గం మళ్ళించాలి. బాల్యపు మధుర స్మృతులు జీవితాంతం గుర్తుచేసుకునేట్లు చూడాలి. అందుకు తగ్గట్టుగా పెద్దల ప్రవర్తన వుండాలి. ఈ నవలలో సరైన పాత్ర ఒక్కటీ కనిపించదు. అన్ని పాత్రలు తమ పరిధిలో బాధ్యతారాహిత్యంగానే ప్రవర్తించాయి. ప్రేమాదరణతో జర్జరితమైన పాత్ర ఒకటైనా లేకపోవటం కొట్టొచ్చినట్లు అగుపించే లోటు. వర్ధని పెదనాన్న పాత్ర ఫరవాలేదు కాని, వృత్త ప్రేమ నిండిన పాత్ర అది. బాధ్యతగా ప్రవర్తించినట్లు అగుపించదు.

పిల్లల మనస్తత్వాన్ని ఎరిగి ప్రవర్తించేందుకు ముకుందం కాస్త ఆలస్యంగానైనా ప్రయత్నించటం హర్షణీయంగా వుంది. ఏది ఏమైనా ఈ నవల పూర్తి సంతృప్తిని ఇవ్వలేకపోయింది. ఈ రచయిత్రి కలం నుంచి మరిన్ని మంచి నవలలు ఆశించవచ్చు.

**-ఎం.కె. అడుసుమల్లి,**
కావలి.
-529201

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444; Madras 470434; Vijayawada 476685; Visakhapatnam 52211; Tirupati 5291; Anantpur 22977; Rajahmundry 71390; Karimnagar 83216; Suryapet 20538; Guntur 353942.

CHATURA Telugu Monthly Hyderabad – 500 482 Regd. No. H/HD/402

# ఇలా చదవండిది, అలా తెలుసుకుంటారిక
# ఇకనుంచీ నీలిమందుని ఎందుకసలు వాడనేవాడరో అనే సంగతినిక !



సాధారణ 'బ్లూ' నీటిలో గడ్డలు కట్టడంతో మీ బట్టల పైన మడ్డి నీలి మరకలు పడుతాయి.



వైజ్ఞానికంగా రూపొందించిన, శక్తివంతమైన మైక్రోడిస్పెర్సన్ ఫార్ములేషన్ కల్గిన 'ఉజాలా' నీటిలో అంతటా సమంగా కరిగిపోయి, మీ బట్టలకు ఇస్తుంది మిరుమిట్లు గొలిపే తెల్లదనం.

## కొత్త ఉజాలా ఫేబ్రిక్ వైట్‌నర్.
## మీ బట్టలకి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నితెచ్చే మచ్చలేని మంచి ఉపాయం.

నీలిమందు మీ బట్టలపైన చారల మరకల మచ్చల అవశేషాల్ని వదిలిపెడుతుంది, అయినా అతి పురాతనమైన ఆ నీలిమందును కలకాలంగా వాడుతూనేవున్నారు జనం – కారణం, దానికి బదులుగా మరొకటి లేకపోవడం. అది పాతమాట, వచ్చేసింది యిప్పుడిక ఉజాలా – బట్టలకు తెల్లని తెలుపునిచ్చే శాస్త్రీయమైన ఫేబ్రిక్ వైట్‌నర్. దాన్లోగల పదార్థాలతో, శాస్త్రీయమైన ప్రక్రియతో అబ్బింది దానికి ఆ లక్షణం.

<u>వి+ గల వైట్‌నర్ ఉజాలా</u>

అసలు వి+ ఎందుకని? ఏంచేస్తుంది మీ బట్టలకి యిది? మరి గమనించారా యిది – బట్టలని డిటర్జంట్‌తో ఉతికిన ప్రతిసారీ వాటి కళని పోగొట్టుకుంటాయి. నిజానికి డిటర్జంట్లు, మాసిన బట్టలలోని మురికిని మాత్రమే తీసివెయ్యగలవు కాని ఆ ప్రక్రియతో బట్టలు పాడైపోయినట్టు కనిపిస్తాయిక. మరి నీలిమందు, నీటిలో మడ్డి పదార్థాలను వదలటంతో అవి మీ బట్టలపైన చారల మరకల్ని వేస్తాయి. ఇక ఉజాలాలోగల 'మైక్రో డిస్పర్సన్ కేటలిస్ట్ వి+' నీటిలో పరిసమానంగా కరిగిపోయే, బట్టల పోగుపోగులోకి తక్షణమే చొచ్చుకు పోయే, వాటికి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నిచ్చే ఒకేఒక వైట్‌నర్. అదీ వి+ ప్రత్యేకత.

<u>మిరుమిట్లుగొలిపే తెల్లదనం – చూడండి ప్రత్యక్షంగా మీకు మీరే</u>

మరొక పనికొచ్చే కిటుకు – ఉజాలా, కేంద్రీకృతమైన గాఢతగల ద్రవం కావడంవలన, కొద్దిచుక్కలు వేస్తే చాలు యిది. పొదుపే పొదుపు. ఆ మిరుమిట్లుగొలిపే తెల్లదనపు అత్యుత్తమ ఫలితాంకోసం, పక్కన సూచించిన పద్ధతుల్ని అనుసరించండి. అనుభవంలోకి వస్తుందీ మీకే.

ఇక చారల మచ్చలువడే నీలిమందును ఎందుకు వాడాలి, పట్టుక్కూర్చో వాలిగనక? ఉందిగదా తెల్లదనాన్నిచ్చే కిటుకు ఉజాలా, వుందిగదా అందుబాటులో?

## నీలిమందుకన్న ఎంతో మరెంతో మెరుగు

**ఉజాలాని సరిగ్గా వాడటానికి అంచెలు అంచెలుగాగల పద్ధతి**



1. ఉజాలా బాటిల్ లోపలి మూతకి సన్నని చిల్లు పొడవండి.



2. మీకు కావలసిందల్లా ఒక లీటరు నీటికి 4–5 చుక్కలు.



3. ఉతికిన బట్టల్ని నీటిలో ముంచి వుంచండి.



4. బట్టల్ని మెల్లిగా జాడించండి కొద్ది క్షణాల సేపు. వాటిని ఆరనివ్వండి.





**UJALA**

జ్యోతీ లేబరేటరీస్, బొంబాయి వారి నుంచి.

Situations/JL/22/96